# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Saturday, the 11th August 1956.**

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

---

## I QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS

*Salaries of Aided Elementary School Teachers of Markapuram taluk.*

46.

* 107 Q.— Sri S. VEMAYYA: Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government are aware of the fact that the Aided Elementary School Teachers of Markapuram taluk of Kurnool district have not been paid their salaries in time for the months January to April; and

(b) if so, the reasons for the delay in payment?

THE HON. Dr. B. GOPALA REDDI:—

(a) The answer is in the negative.

(b) Does not arise.

I may tell Hon. Members that salaries have subsequently been paid.

Sri PILLALAMARRI VENKATESWARLU:— ఎన్నినెలలైన తరువాత వారికి salareis pay చేశారు?

THE HON. Dr. B. GOPALA REDDI:— ఎప్పుడో సంవత్సరాంతములో ఒక్కొక్కసారి వాళ్ళకు allotment ఉండదు. అప్పుడు D. P. I. allot చేయలేకుండా పోతూఉంటారు. కాని. April 6 వ తేదీనే తాఖీదులు ఇచ్చాము. ఎక్కడెక్కడ ఎవరెవరికి ఇవ్వవలసి యుంటుందో అదంతా ఇచ్చివేయవలసిందని telegraphic orders పంపించాము.

Sri S. VEMAYYA:— పోనీ ఎంతకాలం ఆలస్యంగా వీళ్ళకు pay ment జరిపించారో తెలుసుకో వచ్చునా?

The Hon Dr. B. GOPALA REDDI:— రెండు, మూడు మాసాలకంటే ఎక్కువ ఆలస్యం జరుగలేదు.

*Conversion of Tiruvur National Extension Service into Community Development Block.*

48.

* 151 Q.—Sri V. VISWESWARA RAO: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether there are any proposals to convert Tiruvur National Extension Service into Community Development Block?

THE HON. Sri K. VENKATA RAO:—

Tiruvur National Extension Service Block was converted to Community Development Block with effect from 1-4-1956.

1-4-1956 నుంచి తిరువూరు National Extension Block, Community Development Block క్రింద మార్చబడినది.

Sri V. VISWESWARA RAO:— అధ్యక్షా. ఈ Community Development Blocks కు 15 లక్షలు మంజూరు చేశామని చెప్పి, మరల 12 లక్షలకు తగ్గించామని చెబుతున్నారు. ఇది నిజమేనా? అయితే ఎందువల్ల ఈ విధంగా తగ్గించారు?

The Hon. Sri K. VENKATA RAO:— తగ్గింపు ఏమిచేయలేదు. National Extension Block లో మూడు లక్షల రూపాయలు అప్పులు ఉన్నాయి. మిగిలిన 4½ లక్షల రూపాయలు ఇతర బడ్జెటుకు సంబంధించినది. ఈ మూడు లక్షల రూపాయలు ఇకముందు Reserve Bank ద్వారా పంచపెడను అనే టటువంటి నిర్ణయము Government of India చేయడము వలన మిగిలిన రూపాయలే ఇక్కడ ఖర్చు పెట్టడానికి వీలు అవుతుంది.

Sri V. VISWESWARA RAO:— Extension Service లో ఉన్నటువంటి మూడు లక్షల రూపాయలు Reserve Bank ద్వారా ఇవ్వాలని చెప్పుతున్నారు. నాకు కావలసినది. ఈ విషయముకాదు Community Development Block లోనే 15 లక్షల రూపాయలు లోగడ మంజూరుచేస్తూ, ఇప్పుడు 12 లక్షల రూపాయలు మంజూరు చేస్తామని చెప్పబడుచున్నది. ఎందువల్ల ఈ విధంగా తగ్గించారు?

THE HON. Sri K. VENKATA RAO:— విశ్వేశ్వరరావుగారు మంచి సూక్ష్మగ్రాహులు అనుకొన్నాను. 7½ లక్షలేమో N.E.S. కు ఉండినది. దానికి ఇంకొక 7½ లక్షలు కలిపితే Community Development Block అవుతుంది. ఆ 15 లక్షలలో మూడు లక్షలు తీసివేస్తే 12 లక్షలు అవుతుంది.

Sri B. SANKARAIAH:— ఈ విధంగా N. E. S. నుంచి Community Development Blocks గా మార్చడము రాష్ట్ర మంత్రులా తీసుకొన్నారా లేక ప్రత్యేకంగా అక్కడే తీసుకొన్నారా?

THE Hon. Sri K. VENKATA RAO:-మొత్తము, రెండవ పంచవర్ష ప్రణాళికలో నూటికి 40 Blocks ను Community Development Blocks క్రింద మార్చడానికి వీలు అవుతుంది. ఇది మొట్టమొదట మూడుఏళ్ళు జరగాలి. అసలు మనము అన్నీ పూర్తిచేసేదానికి ఇంకా 2, 3 ఏళ్ళు పడుతుంది. అందుచేత రెండవ పంచవర్ష ప్రణాళిక కాలములో, నూరు N.E.S. Blocks ఉంటే, 40 Community Blocks అవటానికి అవకాశము ఉంటుంది.

Sri P. NARASIMHAPPA RAO:— ఇప్పుడు మూడు లక్షలు చిల్లర Irrigation క్రింద ఉన్నది. $3\frac{1}{2}$ లక్షల చిల్లరకు ఇదివరకు 25 percent subsidery ఇచ్చేవారు. ఇప్పుడది లేదని చెబుతున్నారు. ఏ కారణంచేత ఆ విధంగా చెప్పుతున్నారు?

THE HON. Sri K. VENKATA RAO:— అసలు మీరు అనుకొన్నది తప్పు, దాంట్లో Irrigation కు 3 లక్షలు లేనేలేదు.

*Provision of path-way to the Harijans of Gandigunta, hamlet of Vuyyuru village, Krishna distric*

49.

48 Q—SRI S. VEMAYYA: Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether the Harijans of Gandigunta, hamlet of Vuyyur village, Gannavaram taluk of Krishna district are provided with a path-way; and

(b) if not the reasons for withdrawal of Land Acquisition proceedings in G.O. Rt. No. 228, Education and Endowments, dated 20th March 1956?

THE HON. SRI G. LATCHANNA:—

(a) The answer is in the negative.

(b) The proposal was first initiated to provide a path-way in B. S. No. 115/1 along with proceedings for aquisition of land for house sites in B.S. No. 150-1,2 and 149 of Vuyyur village but in view of the high cost involved in the acquisition of land for house sites the proposals were dropped. As there is no need to acquire land for a path-way without providing house sites, the acquisition proceedings, were withdrawn in G.O. Rt. No. 228 Education Endowments dated 20-3-1956.

(a) లేదు

ప్రాథమిక దశలోనే drop చేయడము. pathway proposol మాత్రము pending లో ఉండడము సంభవించినందువల్ల, కలెక్టరుగారు ఇటీవల ఏ house sites గురించి అయితే ఈ pathway proposal పరిశీలింపబడ్డదో, ఆ house sites proposl ఇప్పుడు లేదు కాబట్టి ఈ pathway proposal కూడా drop చేయవలసిన అవసరమున్నదని తెలియజేసినందువలన ఇది drop చేయబడినది.

Sri S. VEMAYYA :— ఎంత కాలముగా ఈ reference ప్రభుత్వ ఆలోచన క్రింద ఉండినతరువాత ఇది ఎందుకు drop చేయబడినదోతెలుసుకోవచ్చునా: ఎందుకు.

THE HON. Sri G. LATCHANNA :— మొట్టమొదట అనగా 6-6-1953 నే ఈ proposal వచ్చింది. House sites కు సంబంధించిన proposal ఏమో 1953 లోనే drop చేయబడింది. కాని pathway proposal మాత్రము record లో pending గా ఉన్నందువలన, ఇటీవలనే కలెక్టరుగారు అది drop చేయవలసి యున్నదంటే drop చేయడం జరిగింది.

Sri G. YELLAMANDA REDDI :— ఇప్పుడు మంత్రిగారు సెలవిస్తూ అసలు కొత్తగ్రామానికి గాను pathway propose చేయబడింది. అది పోయింది కాబట్టి ఇదికూడ పోయింది అన్నట్లుగా చెప్పారు. అసలు గన్నవరము గ్రామానికి సంబంధించినటువంటి hamlet కు సంబంధించిన pathway ఉన్నదా లేదా అనే ప్రశ్నకు లేదు అని సమాధానము వచ్చింది. ఇది drop చేసి నప్పటికినీ. ఇవి రెండు seprate గా ఉన్నట్లు గోచరిస్తున్నది. అందువల్ల గ్రామానికి pathway లేకుండా చేయడానికి కారణమేమిటి ? దాని విషయం ఆలోచిస్తారా ?

THE HON. Sri G. LATCHANNA :— ప్రశ్న (a) లో గన్నవరం hamlet లో ఉన్న హరిజనులకు pathway provide చేయబడినదా: అనుదానికి, 'చేయబడలేదు' అను సమాధానము ఇవ్వబడినది. ఎందుకు provide చేయలేదు అనే ప్రశ్నకు, దేన్ని గురించి అయితే ఈ pathway proposal వచ్చిందో ఆ సమస్య ఇప్పుడు లేదు కాబట్టి ఇది drop చేయబడింది అని చెప్పాడు.

Mr. SPEAKER :— It is connected with the new house sites, but not to the old village.

THE HON. Sri G. LATCHANNA :—ఆPathway proposal అనేవి old house sites కు కాదు అని మనవి చేస్తున్నాను. అది కొత్త house sites కు సంబంధించి చేయబడినటువంటి proposal. ఆ కొత్త house sites proposal drop చేయబడింది కాబట్టి దానికి సంబంధించిన pathway proposal కూడా drop చేయబడినది.

Sri P. SREERAMULU:— హరిజనవాడలనుంచి గ్రామాలకు రహదార్లు లేకుండా హరిజనులు చాలా ఇబ్బంది పడుతున్నటువంటి గ్రామాలు చాలా ఉన్నాయి. అటువంటి రహదార్లను acquire చేయడానికి కావలసిన ధనాన్ని

ప్రభుత్వమే భరిస్తారా ? లేకపోతే పంచాయితీ బోర్డులు ఇవ్వవలెననే నియమము ఉన్నదా ?

Mr. SPEAKER :- This relates to Gandigunta, you are asking about general policy. Please put a separate question.

Sri M. NAGI REDDI:— మంత్రిగారి సమాధానములో, ఇప్పుడు ఉన్నటువంటి ఇళ్ళకు path-way ఉన్నదా లేదా అనేది స్పష్టంగా చెప్పలేదు. కొత్త house sites కే ఈ path-way అన్నట్లయితే కొత్త ఇళ్ళ స్థలాలకు proposals ఎప్పుడైతే విరమించుకొన్నారో ఈ path-way proposals కూడా అప్పుడే విరమించుకొని ఉండవలసినది. కాని అది pending లో ఉన్నది అంటే ఇప్పుడు ఉన్న ఇళ్ళకు కావలసిన అవసరమున్నది అనేది స్పష్టంగా తెలుస్తున్నది. కాబట్టి ఇప్పుడు ఉన్న ఇళ్ళకు కూడ దీనియొక్క అవసరమున్నది. కనుక ఇళ్ళ స్థలాలు కూడ ఇస్తూ ఈ pathway విషయం కూడా మళ్ళీ ఆలోచించవలసిన అవసరమున్నదని ప్రభుత్వం గుర్తిస్తుందా ?

THE HON. Sri G. LATCHANNA:— ఊహించుకొని ప్రశ్నవేస్తే లాభములేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU:-అసలు house sites proposal ఎందువల్ల drop చేశారో చెప్పగలరా ?

THE HON. Sri G. LATCHANNA:— వేరే ప్రశ్నవేస్తే చెప్పటానికి.

*Removal of President of the Co-operative Bank at Bhimunipatnam.*

50—

* 253 Q— Sri B. RATHNASABHAPATHI:— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(a) whether it is a fact that the Registrar of Co-operative Societies issued an order removing the President of the Co-operative Bank of Bhimunipatnam (Visakapatnam district) and appointing a Special Officer; and

(b) if so, whether the said order has been given effect to?

The Hon. Sri D. SANJIVAYYA:—

(a) Yes Sir, The Committee of the Bhimunipatnam Co-operative Urban Bank, was superseded on grounds of

mismanagement for a period of one year from 7-4-1956 and a Special Officer was appointed to manage its affairs.

(b) Yes.

### *Conduct of election to Allur Panchayat Board*

51—

*51 Q— SRI S. VEMAYYA:— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) whether it is fact that the Government have ordered a stay in the conduct of election of Allur Panchayat Board in Nellore district; and

(b) if so, the reasons thereof?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—

(a) The answer is in the affirmative.

(b) The elections were stayed, as it was brought to Government's notice that there would be a breach of peace if the elections were held on the 6th April 1956.

Sri S. VEMAYYA — అక్కడ అశాంతి కలుగుతుందని ప్రభుత్వానికి ఎవరిద్వారా representation వచ్చింది? ఎటువంటి ఇబ్బందులు అక్కడ కలుగుతాయని ప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని ఈ orders ఇచ్చారో తెలుసుకోవచ్చునా?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ఈ సభలో ఉన్నటువంటి ఒక సభ్యుని ఉత్తరము మీద stay orders ఇవ్వబడినవి.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఏపైన సభ్యులు ఉత్తరము వ్రాస్తే, ఎన్నికలు stay చేస్తారా?

THE HON SRI A. B. NAGESWARA RAO :— అందులోని merits బట్టి చేయబడుతుంది.

Sri PILLALA MARRI VENKATESWARLU :— Stay orders ఇచ్చేముందు అక్కడ పరిస్థితులను గురించి సమగ్రమైనటువంటి reports తెప్పించుకొని stay చేశారా?

THE HON. Sri A. B. NAGESWARA RAO :— 6 వతారీఖున election అనగా, 3వ తారీఖున petition వచ్చింది. కనుక reports తెప్పించుకోవడానికి వ్యవధి లేక stay orders ఇవ్వవలసి వచ్చింది.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అప్పటివరకు మాట్లాడకుండా ఊరుకొని హఠాత్తుగా వచ్చి ఏ కారణాల వల్లనో అశాంతి

కలుగబోతుందని ఒక సభ్యుడు స్పష్టంగా చెప్పినంత మాత్రాన అక్కడ election stay చేయడం ఏ విధంగా న్యాయమో తెలియచేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఈ విషయంలో నాకు కొంత వరకు పరిచయము ఉన్నది కాబట్టి సమాధానము చెప్పుతున్నాను. ఆ Deputy PANCHAYAT OFFICER గారు దురుద్దేశంతో వచ్చినటువంటి withdrawals ను తీసుకోలేదనేటటువంటి complaint వచ్చింది. 6 వ తారీఖు election ఉంటే 3వ తారీఖు ఈ complaint వచ్చింది. కనుక election stay చేసి దాన్ని దర్యాప్తు చేస్తామనే ఉద్దేశంతో stay orders ఇవ్వబడినాయి.

Sri G. YELLAMANDA REDDI :— అధ్యక్షా. మంత్రిగారు చెప్పిన సమాధానాన్ని బట్టి మూడవతేదీన withdrawals అన్నారు. అలాంటప్పుడు ఆరవతేదీన ఎన్నికలన్నమాట. అయితే ప్రభుత్వానికి నిజంగా ఉద్దేశ్యము ఉన్నట్లయితే యీలోపల emergent గా wire ద్వారానైనా on the spot లో వున్న డిప్యూటీ పంచాయతీ ఆఫీసరునుంచి అయినా రిపోర్టు తెప్పించుకోటానికి అవకాశము లేదా ?

THE HON. Dr. B. GOPALA REDDI:—

Withdrawals అయిపోతున్నవి. ఆ గ్రామంలో పోటీలేకుండా ఎన్నికలు జరుగుతాయి అనే వాతావరణము ఏర్పడుతున్నప్పటికినీ. పంచాయితీ ఆఫీసరు ఎన్నికలు సక్రమంగా జరిపించలేదేమోనన్న విషయము గమనించటానికి చేసినదేగాని, యింకొకటి ఏమీ లేదు. తరువాత elections మరల జరిగాయి. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోటానికి అన్నివిధాల అక్కడ సౌకర్యాలు జరిగాయి. కాబట్టి stay order వల్ల ఎవరికీ ఏవిధమైన నష్టము రాలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU.

అధ్యక్షా.

మంత్రిగారు, అక్కడ అశాంతిపరిస్థితులు కలుగుతున్నవి గనుక elections ఆపు చేశామని చెప్పారు. కాని ముఖ్య మంత్రిగారు చెప్పినదానిని బట్టి, డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు withdrawals అంగీకరించకపోవడమువల్ల election ఆపివేయవలసి వచ్చిందని చెప్పారు. మంత్రిగారి సమాధానములో మొదట్లోనే యీ కారణములు చెప్పిఉంటే, దానికి ఏదైనా ప్రయత్నము ఉండేది. వారు చెప్పేది కాని ఊసే ఎత్తుకోకుండా, అశాంతి ఏర్పడ బోతున్నది గనుక, వాళ్ళు అక్కడ తలకాయలు పగలగొట్టుకో బోతున్నారు గనుకనే election ఆపి వేశామని చెప్పారు. (Interruption). My point is this sir. దీనికి సంబంధించిన మంత్రిగారు అశాంతి కలిగే పరిస్థితులవల్ల elections ఆపివేశామని అంటే, ముఖ్యమంత్రిగారు అశాంతిలేదు, withdrawals అంగీకరించకపోవడం వల్లనే elections ఆపి వేయవల్లసి వచ్చిందని అన్నారు. కాబట్టి దీనికి మంత్రిగారు ఏమి చెబుతారు ?

TAE HON. Dr. B. GOPALA REDDI :—

వెంకటేశ్వర్లుగారికి యీ రెండు సమాధానాలలో పరస్పర వైరుధ్యం ఎందువల్ల కనబడుతున్నదో నాకు తెలియడంలేదు. సకాలములో వచ్చిన withdrawals ను Deputy Panchayat Officer అంగీకరించారని కొందరు, అంగీకరించలేదని కొందరు చెప్పడం జరిగింది. యిలాంటి వాదనలు వచ్చినప్పుడు సాధారణంగా గ్రామాలలో తగాదాలు కొట్లాటలు రావచ్చు. riotings కూడ జరగవచ్చు, కాకపోతే డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు న్యాయముగా చేశారని కొందరు, చేయలేదని కొందరు చెబుతున్నప్పుడు, అక్కడ నిజంగా riotings జరిగే పరిస్థితులు వచ్చి ఉండవచ్చు, అందులో అల్లూరు యిటువంటి election విషయములో riotings కు చాలా ప్రసిద్ధిగా ఉంటూవచ్చింది. ఇదివరకు అక్కడ యాభై సంవత్సరాలనుంచి ఆ వూరిలోనివాళ్ళమీద, యిటుపార్టీ వారిమీద, అటుపార్టీ వారిమీద security proceedings వగైరాలు జరుగుతున్నటువంటి స్థలము. కాబట్టి Election stop చేసి enquiry చేసి, అవసరమైతే Deputy Panchayat Officer చేసింది తప్పు అయితే, ఆయనమీద చర్య తీసుకోవలసి ఉంటుంది. కాబట్టి యిప్పుడు చెప్పిన రెండు సమాధానాలలో ఒకదాని కొకటికి సంబంధము ఉన్నదని నా అభిప్రాయము.

THE HON. Sri A. B. NAGESWARA RAO :—

జిల్లా పంచాయతీ ఆఫీసరు, "breach of peace" ఉన్నట్లుగా apprehend చేసి ఒక రిపోర్టు పంపించారు. అందువల్ల District Panchayat Officer రిపోర్టుమీద ప్రభుత్వం చేసినది చేసినట్లుగా నేను సభ్యులకు మనవి చేస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :—

అయితే, Deputy Panchayat Officer మీద చర్య తీసుకున్నారా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO :—

తీసుకుంటున్నామండి.

Sri B. SANKARAIAH :—

Nomination తీసుకోకపోవడం ఎప్పుడైనా జరిగిఉంటే జరిగిఉండవచ్చు కాని, withdrawals తీసుకోకుండా ఉండడం ఎందుకు సంభవిస్తుంది ? అది ప్రభుత్వం ఎట్లా నమ్మింది ? తరువాత నిజంగా withdrawals తీసుకున్నారా లేదా ? తరువాతనైనా విచారణ రిపోర్టు ఏమని వచ్చింది, ఆ వివరాలు తెలియజేస్తారా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO:—

2-4-1956 వ తేదీన అల్లూరువెళ్ళి withdrawals తీసుకోమని District Panchayat Officer, Deputy Panchayat Officer ను ఆదేశించినప్పటికినీ, ఆయన వెళ్ళి withdrawals తీసుకోలేదు, ఆరోజు సాయంత్రం 4-40 నిమిషాలు అయినతరువాత, ఆయన అక్కడకు వెళ్ళినప్పుడు నామినేషన్ను

వేసినవారు కొందరు withdrawals యివ్వకపోతే, కొన్ని పుచ్చుకున్నారు, కొన్ని పుచ్చుకోలేదని మూడవతేది రాత్రి మాకు పిటిషను వచ్చింది. ఆ రోజు మూడవతేది కాబట్టి వ్యవధి లేదు. పిటిషనులో "irregularity" అని "breach of peace" అని రెండు కారణాలు ఉన్నవని తెలియడమువల్ల, వ్యవధికానందువల్ల stay తెప్పించాము. దానిమీద ప్రభుత్వం ఆ ఆర్డరు vacate చేస్తూ, 28వ తేదీన elections అని, 22వ తేదీన 5 గంటలదాకా withdrawals యివ్వడము జరిగింది. తరువాత elections రోజున సామరస్యంగా, ఏకగ్రీవంగా ఎన్నికలు పోటీ లేకుండా జరిగాయి. కాబట్టి, యీ విషయము సభవారికి తెలియజేస్తున్నాను.

*Teaching grants for aided schools in Krishna district.*

53—

* 152 Q—Sri V. VISWESWARA RAO: Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether it is a fact that the final teaching grants for aided schools are not sanctioned till now in Krishna district; and

(b) if so, why?

THE HON. Dr. B. GOPALA REDDI:—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI V. VISWESWARA RAO:—

"Negatived" అని ముఖ్యమంత్రిగారు చెబుతున్నారు. అయితే ఎంత కాలము అయిన తరువాత యిస్తారో తెలియజేస్తారా?

THE HON. Dr. B. GOPALA REDDI:—

109 schools లోనూ 91 స్కూల్సుమీద objections వచ్చాయి. ఇవి అన్నీ దర్యాప్తు చేయడానికి కొంతటైము పట్టింది. అన్నీ కూడా enquire చేస్తున్నారు.

SRI V. VISWESWARA RAO:—

అయితే objections లేనటువంటి వాటికైనా యివ్వవచ్చును గదా?

THE HON. Dr. B. GOPALA REDDI:—

వాటికన్నింటికీ కూడ యివ్వబడ్డవి.

SRI N. K. LINGAM:—

దర్యాప్తుచేసేవరకూ teaching grants ఆపుచేసినట్లుగా ముఖ్యమంత్రిగారు చెబుతున్నారు. అయితే త్వరలోనైనా దర్యాప్తుచేయించడానికి special staff ను వేశారా?

THE HON. Dr. B. GOPALA REDDI:—

వేరే special staff అవసరము లేదు. D.E.O. Office లో ఉన్న staff చాలుననుకుంటాను.

SRI C. SUBBARAYUDU:—

కృష్ణాజిల్లాలో కాకుండా, యితర జిల్లాలలో కూడా యీ teaching grants యివ్వకుండా ఉండడము తటస్థించింది. యీ విషయము ముఖ్యమంత్రిగారి దృష్టికి యిదివరకు రెండుమూడుసార్లు తీసుకొనిరావడము అయింది. కాబట్టి ఇక మీదటనైనా ఆలస్యం జరగకుండా త్వరలో యిచ్చేఏర్పాటు చేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI:—

నేను మొదట్లో యీ ప్రశ్నమీద సమాధానము చెప్పాను. ఒక్కొక్కసారి సంవత్సరాంతములో కొంతవరకు ఆలస్యములు జరిగితే జరగవచ్చు Allotment కంటె యింకా excess గా కూడా యిస్తూవుండడము ఉన్నది last year ఉన్న స్కూల్సును బట్టి సాధారణముగా allotment చేయడము జరుగుతుంది. ప్రతి సంవత్సరము జులైనెల వచ్చేసరికి, కొన్ని కొత్తస్కూల్సు పెట్టినవి లిస్టులోనికి వస్తూ ఉంటాయి. వాటి అన్నింటికి allotment యివ్వడములో ఆలస్యము జరిగితే జరగ వచ్చు. ఒక్కొక్కప్పుడు కొన్ని objections వస్తే, వాటినన్నింటిని దర్యాప్తిచేసి allotment యివ్వడములో ఆలస్యములు ఉండవచ్చు, allotment కూడ లేకపో వచ్చు. ఏమైనప్పటికినీ, యివి అన్నీ final గా సంవత్సరము ఆఖరుకుగాని తెలవు. అయినను list ను త్వరలో పంపిస్తూ ఉండమని D.P.I. గారికి instructions యిచ్చిఉన్నాము.

*Opening of new hospitals for treatment of lunacy and infectious diseases.*

55—

* 180 Q— Sri P. GUNNAYYA: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state —

(a) whether the Government propose to open any new hospitals for treatment of lunacy and infectious diseases; and

(b) if so, in which districts ?

THE HON. SRI K. VENKATA RAO:—

(a) & (b) Proposals for opening one new Mental Hospital at Guntur and four Infectious Diseases Hospitals at Visakhapatnam, Guntur; Tirupathi and Bhadracha'am have been included in the State's Second Five Year Plan.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో గుంటూరులో ఒక పిచ్చివాళ్ళ హాస్పిటలున్నూ, విశాఖపట్టణం, గుంటూరు, తిరుపతి, భద్రాచలం, యీ నాలుగు చోట్లలోనూ అంటు వ్యాధుల హాస్పిటలున్నూ పెట్టటానికి ప్రభుత్వం నిర్ణయించింది.

58—

## *Opening of a Medical College at Kurnool.*

* 292 Q.-Sri VAVILALA GOPALAKRISHNAYYA:- Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the reply of the Government of India to the State Government's proposal for the opening of a Medical College at Kurnool ?

The Hon. Sri K. VENKATA RAO:—

The Government of India have stated that the matter is under consideration and that a further communication will be sent to this Government as soon as a decision is arrived at in the matter.

ఈ విషయము కేంద్ర ప్రభుత్వంవారి పరిశీలనలో ఉన్నది, త్వరలోనే వారు నిర్ణయముచేసి తెలియజేస్తారాని యీ ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వంవారు తెలియజేశారు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—

ఈ కాలేజీలో యాభైమందినో వందమందినో చేర్చుకున్నారని తెలుస్తున్నది. అయితే యీ విధముగా చేర్చుకోవటానికి కేంద్ర ప్రభుత్వము యొక్క అనుమతి రాకపోతే ఏమైనా ప్రమాదము ఉంటుందేమో ననే భయము ఉన్నదా? అనుమతి రావని గట్టి విశ్వాసము ఉన్నదా?

The Hon. Sri K. VENKATA RAO:—

మనం కాలేజీలు పెట్టుకోటానికి కేంద్ర ప్రభుత్వంవారి అనుమతి అవసరము లేదు. మనదగ్గర డబ్బులేక పోవడంవల్ల కొంతడబ్బు సహాయము చేయమనివారిని కోరి ఉన్నాము. ఇప్పుడు కర్నూలు నుంచి హైద్రాబాదుకు Capital కదిలి పోవడం వల్ల. హైద్రాబాదులో ఖాళీ అయిన buildings సుమారు ఒకకోటి రూపాయలు ఖరీదుచేసేవి రాబోయే నాలుగు సంవత్సరాలలో కాలేజీవారి స్వాధీనము చేస్తామని నిర్ణయించాము. దానిని బట్టే యీ స్కీము అంతా అమలులోకి వస్తుంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—

కాలేజీలలో యాభైమంది studentsను maintain చేయటానికి సంవత్సరము ఒకటికి recurring expenditure ఎంత అవుతుంది ?

The Hon. Sri K. VENKATA RAO:—

సాధారణముగా కొత్తగా Medical College స్థాపించాలంటే సుమారు ఒక కోటి యాభై లక్షలు ఖర్చు అవుతుంది. ఇదిగాక సంవత్సరానికి 7, 8 లక్షల దాకా ఖర్చు కావలసి ఉంటుంది. ప్రస్తుతము ఒక లక్షో రెండులక్షలో చాలును. క్రమేణా విద్యార్థులు అందరూ చేరి, courses అన్నీ begin చేసేసరికి సంవత్సరము ఒకటింటికి ఎనిమిది లక్షలు అయినా ఖర్చు చేయవలసి ఉంటుంది.

SRI E. AYYAPU REDDI:—

Will the Hon. Minister be pleased to state whether it will be possible to start the College in Kurnool itself in the next academic year ?

THE HON. SRI K. VENKATA RAO:—

వచ్చే మార్చినెలనుంచి యీ కర్నూలులోనే కాలేజీ function చేయటానికి ఆరంభమవుతుంది.

SRI L. LAKSHMANA DAS:—

Medical graduates చాలా తక్కువమంది తయారవుతున్నారు గనుక, కొత్తగా కర్నూలులో స్థాపించబోయే Medical College లో short term courses ఏవైనాఉంటే, అవి పెట్టటానికి బాగా ఉంటుందేమో ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE. Hon. SRI K. VENKATA RAO:—

India Medical Council వారు, Government of India వారు, యింతవరకు ఎక్కడైనా short term courses గల college వుంటే, అవి మూసివేయవలసిందిగా ఉత్తరువులు పంపించారు.

*Simplification of the Acts of Co-operative Societies.*

60—

* 430 Q.—Sri M. NAGI REDDI : Will the Hon. the Minisier for Co-operation and Commercial Taxes be pleased to state -

(a) whether the Central Government have appointed a committee to simplify the Acts relating to the working of the Co-operative Societies; and

(b) if so, whether anybody from Andhra has been appointed on that committee ?

The Hon. Sri D. SANJIVAYYA:—

(a) Yes, Sir.

(b) Sri K. SUBRAMANYAM NAIDU, Registrar of Co-operative Societies, Andhra (now on leave) is on that Committee.

*Adult Literacy Campaign.*

131—

* 163 Q—SRI V. VISWESWARA RAO: } Will the Hon. the Chief
SRI M. NAGI REDDI: }
Minister be pleased to state-

(a) whether it is a fact that the Government directed the Education Department to discontinue the adult literacy campaign; and

(b) if so, the reasons for the same?

THE HON. Dr. B. GOPALA REDDI :—

a) The answer is in the negative.

b) Does not arise.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—

ఇప్పుడు adult education training classes నడుపుతూ సర్టిఫికేట్లు కూడా ఇచ్చారు. గాని ఆ స్కూల్సును ఎత్తి వేస్తున్నారు. వారిని ఏమి చేస్తారు. గ్రామములలో adult schools Close చేస్తున్నట్లు మానుకొండి అని notice ఇచ్చారు.

The Hon. Dr. B. GOPALA REDDI:—

I am sorry for the reply. This reply was given in April or so, the question having been given in March. Subsequently something has happened. I shall give a fresh answer some time later.

తీసుకురావడానికి పోతే దొరకలేదు. ఆ ప్రశ్న చాలా పాతది. ఆన్సరు పాతదే, తరువాత మళ్ళీ ఆన్సరు చేస్తాము.

Sri M. NAGI REDDI:—

జాన్యువరినుండి జీతాలుకుడా ఇవ్వడము లేదు. పనిచేసిన కాలానికి జీతాలు ఇస్తారా ?

Mr. SPEAKER:—

Please put this supplementary question when that question is answered.

*Meraka Sivavilanka of Manepalli.*

132—

* 339 Q.—SRI G. NAGESWARA RAO:—Will the Hon. the Minister for Revenue be pleased to state:—

(a) the reason for not granting the Meraka Sivavilanka S. No. 332 of Manepalli having an extent of 85.60 Ac. to Manepalli Adi-Andhra F.L.C. Society which has been cultivating it from 1918; and

(b) the reason for granting the same lanka land on 21-10-1955 by the District Collector, East Godavari to the

Landless Poor Workers Co-operative Society of Nagullanka, hamlet of Manepalli registered on 2-10-1955 with 17 members of whom a majority are having their own lands and tobacco business?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) The lanka land referred to by the Member is presumably the Vynateym Godawarilanka measuring Ac. 86.93 in R.S No. 332 of Manepalli village in Razole Taluk. This lanka was under the lease of the Adi-Andhra F.L.C. Society Manepalli village from F. 1349. In F 1365 it was withdrawn from the society as it failed to pay the arrears due from it for F. 1364 completely in time.

(b) The Lanka so withdrawn from the Adi Andhra Society was available for disposal under the rules governing lanka leases. No other society except the Nagullanka landless Field Labour Co-operative Society applied for its lease for F. 1365. Since this Society was eligible for grant of lanka leases and was also willing to take up the lanka agreeing to pay the rentals fixed under rules, it was leased out to it for that Fasli. The allegation that a majority of the members of this Society are not landless poor persons is not correct.

Sri G. NAGESHWARA RAO:—

అధ్యక్షా గవర్నమెంటు శిస్తు బకాయపడింది. అందుచేత లంక వేలము పెట్టినాము అన్నారు. ఆ బకాయి 18-10-53. లోపున గడువుఇస్తాము అని కలక్టరు గారు, తాసీల్దారుగారు చెప్పారు. రైతులు మూడు వాయిదాలలో చెల్లించారా. అయినప్పటికి ఆ లంకను 21-10-5ంన Landless Poor Societyకి లీజుకు ఇచ్చారు. ఇది ఏమిన్యాయమో మంత్రిగారు శలవిస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI:—

ఆ సొసైటీ డబ్బు కట్టలేదు. 8 రోజులలో కట్టవలెను లేక పోతె కాళీ చేయిస్తాము అని నోటీసు ఇచ్చారు. ఆ 8 రోజులలో మాత్రము కట్టలేదు. 18-10-55న కట్టిన మాట వాస్తవమే. కలక్టరు వెంటనే స్వాధీనం చేసికొని వేలం వెయ్యడానికి చూస్తూఉండగా ఇంకో సొసైటి డిప్యూటి రిజిస్ట్రారు రిజిస్టరుచేసి రికమండు చేసినారు. అది legalised కాబట్టి దానికిఇచ్చారు. జరిగినమాట నిజమే. దానికి వారు రివెన్యూ బోర్డుకు appeal పెట్టారు. బోర్డువారు కలక్టరును అడిగినారు. ఈ లోపున ఈలంక సొసైటీకి ఇవ్వడం జరిగింది. మళ్ళీ తీసుకోడానికి జిల్లాకలక్టరుకు అధికారం లేదు. పొరపాటు జరిగిన మాట వాస్తవము. దానిలో దురుద్ధేశం ఏమీలేదు. 8 రోజులలో కట్టనపుడు తరువాత కట్టినా విలువ ఉండదు. Technicalగా కలక్టరు correct అయనను ఏమిచెయ్యడానికి వీలులేదు.

*Steamer service between Howrah and Bombay.*

133—

* 457 Q.—SRI P. VENKATA SUBBAYYA } Will the
SRI M. NAGI REDDI: } Hon. the
Minister for Electricity and Social Welfare be pleased to state:—

(a) Whether this Government have sent up a proposal to the Central Government for running a regular monthly steamer service between Howrah and Bombay, touching the minor port in Andhra; and

(b) if so, whether the Government of India have asked for a detailed scheme?

THE HON. Sri G. LATCHANNA:—

(a) and (b):— The answer is in the affirmative.

Sri VAVILALA GOPALKRISHNAYYA:—

హౌరాపోమే steamer ఏర్పాటు చేస్తామన్నారు. ఇప్పుడు రంగును వెళ్ళే ప్యాసింజర్లు మద్రాసుగాని హౌరాగాని, పోయి ఫెళ్ల వలసివస్తున్నది. వారు విశాఖ పట్నంలో ఎక్కే సౌకర్యల చేస్తారా?

The Hon. Sri G. LATCHANNA:

ప్రశ్న హౌరా బొంబాయి స్టీమరుగురించి ప్రభుత్వం ఏవైనా రికమండు చేసిందా అని ఈ రికమండేషనకు సంబంధించినంత వరకు కొస్తా మైనరు పోర్టు్స సరి అయిన వర్తకం లేనందువల్ల మైనరు పోర్టు్సస్వయం పోషకంగా లేనందువల్ల వాటిని స్వయం పోషకత్వం చేసేందుకు వ్యాపారం కావాలి. మన ప్రభుత్వం ఈ ప్రపోజలు కేంద్ర ప్రభుత్వానికి పంపింది. బొంబాయి, మద్రాసు ట్రావంకూరు కొచిను. ఒరిస్సా ప్రభూత్వాలకు ఈ స్కీముపై వారి అభిప్రాయాలు కోరడమైనది. బొంబాయి ట్రావంకూరుకొచిను రాష్ట్రాలు ఈ కోస్తా Nairgatim అవసరం అని కేంద్ర ప్రభూత్వానికి తెలియచేశారు. వ్యాపార వివరములు కావలెనని మనప్రభుత్వాన్ని కోరారు. వాటిని మేము సేకరించుచున్నాము. గోపాలకృష్ణయ్యగారు రంగూను ఫ్యాసింజర్లు విషయమై అడిగినదానికి, దానికి సంబంభములేదు

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

ఇప్పుడు కూర్గు విషయమై ప్రయత్నిం చేస్తున్నారు. ప్యాసింజర్లకు కూడ సౌకర్యముల కలుగ చేసేదానికి ప్రయత్నించేస్తారా?

THE HON. SRI G. LATCHANNA.

దీనిలో ప్యాసింజర్లు వెళ్ళే అవకాశములేదు, ప్రస్తుతము మనము హోరానుండి అన్ని మైనరు కొస్తా పోర్టుల మీదుగా దక్షిణ భారతదేశ మైనరు పోరుటు వర్తక

వ్యాపార సౌకర్యములు కల్పించడానికి ఈ proposal, ప్రజలు వెళ్ళే అవకాశం ఉంటే కేంద్ర ప్రభుత్వం పరిశీలించవచ్చును. ప్రభుత్వం శిఫారస్సు చెయ్యవచ్చును,

SRI L. LAKSHMANA DAS:—

ఆంధ్ర దేశములో ఏ ఏ మైనరు పోర్టులవద్ద స్టీమర్లు నిలపడానికి Propsal పంపేరు. కళింగ పట్నం గురించి కూడా Proposal ఉన్నదా ?

THE HON. SRI. G. LATCHANNA:—

కళింగ పట్నంకూడా ఉన్నది. 8 మైనరుపోర్టులు ఉన్నవి. మరిరెండు open చెయ్యవలెనని మన ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి తెలియచేసింది. బొంబాయి. మద్రాసు, ఒరిస్సా, ఆంధ్ర, ట్రావంకోరు కొచ్చిను ప్రభుత్వాల కోసము ఈ ప్రొపొజలు చెయ్యబడింది.

SRI G. NARASIMHA MURTHY:—

అధ్యక్షా: తూర్పుగోదావరి జిల్లా కొమరగిరి పట్టణం పురాతనంనుంచి ప్రసిద్ధి చెందిన రేవు. 1802 లో 3 లక్షల రూపాయల బట్ట అక్కడినుంచి ఎగుమతి అయి నట్లు అధ్యక్షుడు పట్టాభి సీతారామయ్యగారు చెప్పారు. ఇది అనుకూలమైన ప్రదేశము. కొమరగిరి పట్నంలో కూడ స్టీమర్లు ఆగేటట్లు చేసి ఓడలరేవు చెయ్యడానికి మన ప్రభుత్వం కేంద్రప్రభుత్వమునకు సిఫార్సు చేస్తుందా ?

THE HON. SRI G. LATCHANNA:—

ప్రత్యేకప్రశ్న వేస్తే దానికి సంబంధించిన వివరములు సేకరించి కావలసిన భోగట్టా తీసుకురావచ్చును.

*Audit of the Accounts of the Panchayat Boards.*

134—

* 388 Q.—SRI M. NAGI REDDI:— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether it is a fact that the Government have decided to get the accounts of the Panchayat Boards audited by the Local Fund Audit staff; and

(b) if so, whether the expenditure for auditing will be borne by the Government?

THE HON. SRI A.B. NAGESWARA RAO:—

(a) The answer is in the affirmative.

(b) The answer is in the negative.

According to Sec. 74 (2) of the Madras Village Panchayats Act, 1950 (Madras Act X of 1950) as subsequently am-

ended by the Madras Village Panchayats (Andhra Second Amendment Act, 1955 (Andhra Act XXII of 1955), the Panchayat Boards shall pay to the Government from out of their funds such sum as may be determined by the Inspector towards the pay and allowances of such auditors and towards any other expenditure involved in the audit of the accounts of Panchayats. In other words, the entire cost of audit will be recovered from the funds of the Panchayat Boards.

Sri M. NAGI REDDI:—

ఇదివరకు డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లే యీ ఆడిట్ గాని check measurement కాని చేసేవాండ్లు. ఇపుడు check measurement తీసి వేయడం Engineering Department వేయడం మూలానా? ఇదికూడా తీసివేసినపుడు ఇక పంచాయత్ officersకు వున్న పనేమిటి? పైగా పంచాయితీలకు ఆదాయం చాలా తక్కువగా వున్న పరిస్థితులలో యీ ఆడిట్ fees తగ్గించడానికిప్రభుత్వం ప్రయత్నిస్తున్నాదా?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—
ప్రభుత్వమేమి భరించడానికి అవకాశములేదు. ఆవిధంగా Amended Act లో ఇదివరకే pass చేయబడింది.

Sri S. NARAYANAPPA:—

గ్రామములలో Class II పంచాయితీలు ఇపుడిపుడే జరుగుతున్నాయి కాని ఆర్థికంగా పంచాయతీలకు స్థోమతులేదు. ప్రభుత్వం కనీసం 3 సంవత్సరాల వరకైనా యీ audit fees exemption యిచ్చేందుకు ఏమైనా ఉత్తర్వులు పంపిస్తారా?

THE Hon. Sri A. B. NAGESWARA RAO:— పభుత్వంవారు 29-6 56 G.O.లో క్రొత్తగా ఏర్పడిన పంచాయితీలలో 3 సంవత్సరాల పాటు జిల్లా పంచాయత్ ఆఫీసర్లు, డెప్యూటీ పంచాయితీ ఆఫీసర్లు audit చేయాలని. 3 సంవత్సరాల తదనంతరమూ audit చేయాలని ఉత్తరువులు పంపారు.

An Hon. Members:—
వ్యవసాయ శాఖ మంత్రిగారికి పంపిన ప్రశ్నలకు సమాధానాలు ఈయడంలేదు

MR. SPEAKER:—When the Hon. Minister comes, I will bring them.

SRI P. GUNNAYYA:—Point of information, Sir.

MR. SPEAKER:—Order, Order.

SRI R. B. RAMAKRISHNA RAJU:-One submission, Sir. I find, that day after day, number of questions are being postponed because the concerned Ministers are not present in the House. May I know Sir, if advance intimation is not sent to the concerned Ministers that a particular question will be taken up in the House on a particular day and, if so, is it not necessary, Sir, that the concerned Minister should at least make alternate arrangement to see that the questions are properly answered and if it is not possible for them to do so for any unavoilable circumstances, is it not proper that they should take the permission of the Speaker?

THE HON. Dr. B. GOPALA REDDI:- Hon.Speaker's permission has been taken, and if it is the wish of the hon. Member that other Ministers should answer the absentee Ministers' questions, we have no objection. But you may not get the full information when you put supplementary questions. So, in order to facilitate your convenience, we are trying to postpone those questions so that they may be duly answered when the concerned Minister is present in the House.

MR. SPEAKER:—We will try to minimise this as far as possible.

II. Motion under rule 265 of the Assembly Rules.

Sri S. BRAHMAYYA:— Speaker, Sir, I beg to move:

That under rule 265 of the Andhra Legislative Assembly Rules, leave of absence be granted by this House to Sri B. G. M. A. NARASINGA RAO, Member,Andhra Legislative Assembly for two months from 8th August 1956."

MR. SPEAKER:— The Question is:

"That under rule 265 of the Andhra Legislative Assembly Rules, leave of absence be granted by this House to Sri B. G. M. A. Narsinga Rao, Member, Andhra Legislative Assembly for two months from 8th August 1956."

The motion is carried and leave granted.

[11th August 1956

## III DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS

Note:- An asterisk at the commencement of a speech indicates revision by the member

Sri S. BRAHMAYYA:—

అధ్యక్షా, గవర్నర్‌గారి ప్రసంగాన్ని ప్రశంసిస్తూ గౌరవ సభ్యులు శ్రీ వేమా రెడ్డిగారు ప్రతిపాదించిన అభినందన తీర్మానాన్ని నేను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాను. ఆంధ్ర రాష్ట్రం అవతరణ అయిన గత 34 మాసాలలో ఆంధ్ర ప్రభుత్వం సాధించిన ఘనకార్యాలను సింహావలోకనముచేస్తూ, సాధించనున్న అనేక విషయాలను సమీక్షచేస్తూ గవర్నర్‌గారు తమ ప్రసంగంలో ముచ్చటించడం ఎంతో ముదావహం. ప్రథమ పంచవర్ష ప్రణాళిక జయప్రదమై ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రథమదశలోనే ఎన్నో పథకాలను తయారుచేసి అనేక ఘనకార్యాలను చేయడానికి సంకల్పించి సాంఘిక సంక్షేమ కార్యక్రమాల ద్వారా, జాతీయ విస్తరణ కేంద్రాలవంటి మహోజ్వలమైన ఉద్యమాల ద్వారా రాష్ట్రాన్ని తీర్చి దిద్ది పునాదులు వేయడానికి పూనుకోవడం ఎంతో సంతోషకరమైన విషయం. గవర్నర్‌గారు తమ ప్రసంగంలో సభ్యుల యొక్క చర్చ వివరాలను సావకాశంగా పరిశీలిస్తుంటామన్నారు. సభ్యులుచెప్పిన వాటిని సభ్యుల ప్రసంగాలను ఏకించిత్తైనా ప్రభుత్వము వారు పరిశీలిస్తుంటే సభ్యులకు ఎంతో ఉత్సాహకరంగా వుంటుంది. ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదము కావాలంటే ప్రభుత్వము ప్రజా దరణను పొందాలి. ప్రజాభిమానాన్ని చూరగొనాలి. ఆంధ్ర ప్రజాప్రతినిధులమైన మా సభ్యుల ప్రసంగాలను విజ్ఞప్తులను తప్పకుండా పరిశీలిస్తుండాలి. నాగార్జునసాగర్ నిర్మాణానికి పూనుకున్నాము. 122 కోట్ల రూపాయలు దానికి వెచ్చించ బోతున్నాము. దానివల్ల గుంటూరు, నెల్లూరు, కృష్ణా జిల్లాలలో 310083 లక్షల ఎకరాలు సేద్యం కాబోతూవున్నదన్న సంగతికూడా మనకు తెలుసు. కాని ప్రక్కనవున్న పశ్చిమ గోదావరి జిల్లాకుకూడా లాభము కల్గేటట్లు చేయవలసిందని మేము విజ్ఞప్తులు పంపించాము. అది ఆలోచనలో వున్నదని మంత్రులు ఒకప్పుడు సెలవిచ్చారు. ఎడమకాల్వ నిర్మాణము జరిగినట్లైతే 180 మైళ్ళ పొడవున కృష్ణా జిల్లాలో నందిగామ తాలూకా, నూజివీడు తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లాలో ఏలూరు, చింతలపూడి, కొవ్వూరు తాలుకాలలో వేలకువేల ఎకరాలు సేద్యం కావడానికి అవకాశాలున్నాయి

గవర్నర్‌గారు కాలమానపరిస్థితుల దృష్ట్యా జులైలో కురిసిన వర్షాలవల్ల వరదలవల్లా ఎంతనష్టం జరిగిందో వివరంగా సెలవిచ్చారు. దీనినిగురించి ప్రత్యేకంగా అసెంబ్లీలో చర్చించడానికి అవకాశంమీరు కలుగజేయబోతున్నందున వివరాలను గురించి మాత్రము ఇక్కడ ఏకరువు పెట్టదలచుకోలేదు. ముఖ్యంగా ఒక చిన్న విషయం వున్నది. అది ఒక చిన్న పథకము. ఇది బుడమేరు తమ్మిలేరుకు సంబంధించిన పథకం. ఈరెండుకూడా పొంగి, కొల్లేరు భీభత్సమైపోయి ప్రతి సంవత్సరము శ్రీ పట్టు పరిసరప్రాంతాలలో ఒక వేయిఎకరాలకు నష్టము కల్గుతున్నది. ఈతమ్మిలేరు ఎక్కడ పుడుతుందో ఎక్కడ సమాప్త మౌతుందో తెలిసికొనే బాధ్యత ప్రభుత్వానిదై వున్నది. తమ్మిలేరు సమాప్త మయ్యేటటువంటి చోటు ఒక బారెడు అంటే రెండు గజాలు వెడల్పు మాత్రమే వుంటుంది. ఆప్రదేశంలో 25 వేల రూపాయల పథకం మంజూరుచేసినట్లైతే దానివల్ల వందల కొద్ది ఎకరాలు నష్టపడకుండా సేద్య

Sri S. BRAHMAYYA:—
మపడానికి అవకాశాలు వుంటాయి. ప్రతి సంవత్సరం అక్కడి ప్రాంతం యీ ముంపు నుంచి విముక్తి పొందవలసియున్నది. మరొక విషయం. విద్యను గురించి ఇపుడు ముచ్చటించ బోతున్నాను. ఇప్పుడు ప్రభుత్వంవారు క్రమంగా యీ సంవత్సరం 1-వ form కు, వచ్చే సంవత్సరం రెండవ form కు, తర్వాత 3-వ form కు ఉచిత విద్యా వసతి కలుగ జేయ బోతున్నారు. దీనికి ప్రభుత్వాన్ని అభినందింప వలసినదే. మన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కూడా విద్యాభ్యాసానికి లింగ,మత,కుల హోదాల విచక్షణ లేదని చెప్పినటువంటి ప్రభుత్వమే ఇపుడు ఒక చిన్న కారణాన్ని పురస్కరించుకొని ఒక కులముమీద ప్రభుత్వం చర్య తీసుకోబోతున్నది. మూడుదినాల క్రితమే ఆంధ్ర ప్రభ చదివాము, కొండ కాపు అని చెప్పి కొంతమంది కాపులు పేరు పెట్టుకొని దొంగతనంగా చదువుకున్నారని ఉద్యోగాలు సంపాదించు కుంటున్నారని వారిని గురించి retrospective effect తో చర్య తీసుకో బోతున్నామని అన్నారు. ఎప్పుడైతే ప్రభుత్వం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కులమత విచక్షణలు లేకుండా తగినటువంటి సదుపాయాలు విద్యాభ్యాసానికి చేయడానికి అవకాశము కల్పించినదో ఆ పరిస్థితులలో ఏవో కొన్ని కారణాలచేత ముఖ్యంగా ఆర్థికంగా వెనుక బడి వున్న కారణాన కడుపు కక్కుర్తికి కులాన్ని కూడా దాచుకొని కాపుబదులు కాపుకుండ అని పెట్టుకున్న కారణంచేత వారిమీద చర్యతీసుకోడానికి ప్రభుత్వం పూనుకోవడం సరియైనటువంటి విషయంకాదని నేను మనవి చేస్తున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఎవరైనా candidate దగాచేసి ఒక false certificate యిచ్చి ఏదో ఒక Scholarship తీసుకున్నాడని తెలిస్తే గవర్నమెంటు చర్య తీసుకోవాలా? లేదా? చెప్పండి.

Sri S. BRAHMAYYA:—

విద్యను ప్రోత్సహించడానికి ప్రభుత్వంకూడా పూనుకొంది. మనము కూడా ఆ విధంగానే వేదికలమీద ఉపన్యాసాలు యిచ్చాము. ఐతే దీనిలో చాల మంది involve ఔతారు. సభ్యులైన మేముకూడా సర్టిఫికెట్లమీద సంతకాలు పెట్టాము. ప్రభుత్వ అధికారాలు కూడా సంతకాలు పెట్టినవారున్నారు. కాబట్టి ఇంతవరకూ జరిగిన దానిని మాత్రం మన్నించి ఇకమీదట అటువంటిది ఏమైనా చేసినట్లైతే చర్య తీసుకొనడానికి పూనుకోవలసింది కాని ఇపుడు విద్యగురించి ఇంతగా ప్రోత్సహించే పరిస్థితులలో వారిమీద ఎట్టిచర్యకూడా తీసికోకూడదని ప్రభుత్వానికి నేను మనవి చేస్తున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఇపుడు విద్యార్థులు చదువుకొన్నారు. సరిపోయింది. వాండ్లను ఇపుడు ఏమీ చేయడంలేదు. కాని వారికి ఎవరైతే certificates యిచ్చినారో వారిని కొంచెము పట్టి చూస్తామని?

III DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS

11th August 1956]

Sri S. BRAHMAYYA:—

నాకేమీ అభ్యంతరంలేదు. సంస్కృత విద్యాభ్యాసం ప్రారంభించడానికి కొత్తగా ప్రాచ్యవిద్యా మాధ్యమిక పాఠశాలను ప్రారంభించడానికి కూడా అనుమతి ఇచ్చారు. గవర్నరుగారు తమ ప్రసంగంలో విద్యావిధానమును గురించి మాట్లాడుతూ సెకండరీ, కళాశాల విద్యను గురించి, సంస్కృత భాషనుగురించి కూడా మాట్లాడారు. కాని రాజ భాషగా పరిగణింపబడి. రేపోమాపో అందరు కూడ నిర్బంధంగా నేర్చుకొనవలసిన హిందీ భాషను గురించి ఒక్కమాట కూడ చెప్పక పోవడం శోచనీయమైన విషయం. హిందీభాషకు మన ముఖ్యమంత్రిగారు ఎంతో ఉత్సాహాన్ని కలుగచేస్తున్నటువంటి వారే, ఈ హిందీ మనకు త్వరితంగా నేర్చుకొనేటటువంటి పథకాలు మాత్రం తయారు చేయవలసిన అవసరం ఉంది, రేపోమాపో మనం హైదరాబాదు వెళ్ళబోతున్నాం. హైదరాబాదు శాసన సభలో కార్యకలాపాలు ఎక్కువగ, రాజభాష అయిన హిందీలోనే జరుగబోతున్నవనే విషయాన్ని మీ దృష్టికి ఒకప్పుడు నేను తీసుకొని వచ్చాను. తెలుగులోను జరుగుతుంది. హిందీలోను జరుగుతుంది. Hyderabad అంటే అది పంచవేణికి చెందినటువంటి పట్టణమని అక్కడ ముఖ్యమంత్రిగారు సెలవిచ్చారు. మీరు 'తెలుగు' తెలుగు అను కుంటూ కూర్చుంటే కుర్చీలో కూర్చోవలసిందే. గాని మీలో విశాలాంధ్ర దృక్పథం, సంస్కృతి శూన్యం. మావృష్టి కలగవని మిత్రులకు మనవి చేస్తున్నాను.

తర్వాత ప్రాథమిక విద్యనుగురించి కూడా వారేమి సూచ్చటించలేదు. ప్రాథ మిక విద్యావిషయంలో నిర్బంధ విద్యా విధానము అమలు పెట్ట వలసిన అవసరం ఎంతో ఉంది. 100కి 60 మంది మాత్రమే ప్రాథమిక విద్యచదువు కొనుటకు వస్తున్నారు. ఇక నూటికి 40 మంది చదువుకోవలసిన పిల్లలున్నారు. బీదరికం, దారిద్ర్యం వలన చాల మంది చదువుకొనుటకు ముందుకు రావటంలేదు. అటువంటి వారికి ఉచితంగా విద్యా వసతితోపాటు భోజనవసతులు గూడ ఏర్పాటు చేసినట్లయితే 100కి 100 మంది ప్రాథమిక విద్యచదువుకోడానికిముందుకు వస్తారని నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. ఇక వైద్య కళాశాలను గురించికూడా గవర్నరుగారు ప్రసం గించారు. మూడవ వైద్య కళాశాల కర్నూలు పట్టణంలో స్థాపించనున్నారనిఅన్నారు. మొట్ట మొదట ఇపుడు భవనాలు లేని కారణంచేత గుంటూరులో 50 మంది విద్యార్థులతో ఈ కళాశాల ఏర్పాటుచేశారు. అయితే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అంతిమ దశలో నాలుగవ వైద్య కళాశాల స్థాపనకు ఏర్పాటు ఉన్నది. ఆ 4 వ వైద్య కళాశాల మా ఏలూరు పట్టణంలో ఏర్పాటు చేయవలసినదిగ మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఏలూరులో కావలసిన హంగులన్నీ కలుగజేయడానికి సిద్ధంగా ఉన్నాము. ఇప్పటికే ప్రభుత్వం 30 లక్షల ధనం వెచ్చించి చక్కని ఆస్పత్రి భవనాలు కట్టారు. అక్కడ కావలసిన సదుపాయాలు అన్ని ఉన్నాయి. కాబట్టి కళాశాలను నెలకొల్పుటకు ప్రభుత్వం శ్రద్ధతో తగుచర్య తీసుకొంటుందని నేను ఆశిస్తున్నాను.

Sri. S. Brahmayya:—

ఆయుర్వేదం, Homeo వైద్యవిధానాన్ని గురించి వెనుక చాలాపర్యాయములు మాట్లాడి ఉన్నాం. ప్రోత్సాహం ఇవ్వడానికి ప్రభుత్వం సంకల్పించారు. బిల్లు రేపోమాపో ప్రవేశపెట్టబోతున్నారు. దానిని గురించి మనం వివరంగా చర్చించుకో వచ్చును.

మరి సంతోషకరమైన నాస్వవిషయం ఏమంటే, ఏలూరు మురుగునీటి- పారుదల పథకం ప్రభుత్వం వారు మంజూరుచేశారు. అది 90 లక్షల రూపాయల పథకం. అది ఎప్పుడో జరుగవలసింది. కొన్ని అవాంతరాల చేత అగిపోయినా ఈ పథకం ఇప్పటికైనా మంజూరు అయినందుకు నాకు చాల సంతోషం, వెంటనే నిర్మాణ కార్య క్రమం అమలు పరచాలి అని నేను కోరుతూ ఉన్నాను.

తర్వాత పురపాలక సంఘాలు బాధ్యతా రహితంగా నిర్వహించిన కారణంచేత గుంటూరు, బెజవాడ రెండు మునిసిపాలిటీలను కూడ రద్దుచేసినట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఇదిశోచనీయమైన విషయం. ఏవో కొన్నికారణాలను దృష్టిలో ఉంచుకొని విచారణచేయకుండా, ఆలోచన లేకుండా రద్దుచేశారా అని నాకు అనుమానం. ఇట్లా చిన్న అవకతవకలు చేసే మునిసిపాలిటీలు ఎన్నో ఉన్నాయి. కొన్నిటిని గురించి కూడ నేను ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చాను. కాని ప్రభుత్వం ఏమి శ్రద్ధ తీసుకొనలేదు. కాని ఎప్పుడుకూడ ప్రభుత్వం దూర దృష్టితో ఆలోచించి చర్య తీసుకొన వలెనేగాని, వెంటనే ఇటువంటి కఠిన చర్యలు తీసుకొవడంలో స్థానిక స్వపరిపాలనకు ఏక్కువ ముప్పు వస్తుందని నేను మనవి చేస్తున్నాను.

తర్వాత మధ్యపాన నిషేధ శాసనమును కఠినముగ అమ లుపరుస్తున్నాం అన్నందుకు సంతోషమును వెలిబుచ్చారు. కఠినంగా అమలు పరుస్తున్నారని నమ్మడానికి వీలులేని పరిస్థితి వచ్చింది. Prohibition వారిని పోలీసు శాఖకు ఒప్పగించారు, పోలీసు శాఖలోని పెద్ద ఉద్యోగులను నేను నిందించడంలేదు. గాని సామాన్యమైన ఉద్యోగులు ఎక్కువ లంచాలు తీసుకొని ఈమధ్య నిషేధం సరిగా అమలు పరచకుండా చేస్తూ ఉన్నారు. వేలకువేలు లంచాలు కల్లుసారాయి అమ్మేవారి దగ్గర నుంచి తీసుకొని సరిగా అమలు పరచడం లేదు.

ఇక ధరల పెరుగుదలను గురించిన విషయం చెబుతున్నాను. ధరలు నానాటికి విపరీతంగా పెరిగి పోతున్నాయి, గత బడ్జటు సమావేశంలో ముఖ్య మంత్రిగారు తమ ప్రసంగంలో ధరలు తగ్గుతున్నాయి. తగ్గకుండా మణుగు ఏడురూపాయలు చొప్పున స్థిరబఱచ బోతున్నాము. దానికి తగిన కట్టుదిట్టములు చేస్తుఉన్నాము అని చెప్పారు. మణుగు ఏడు రూపాయలు ఎక్కడ? నేడు మణుగు 14 రూపాయలు ఎక్కడ? ధాన్యం మణుగు 14 రూపాయలవరకు పెరిగి పోయింది. సామాన్యమైన జనం 14 రూపాయలచొప్పున కొనుక్కొనుటం చాల కష్ట తరంగా ఉంటుంది అందుచేత చౌక depots ఏర్పాటుచేసి ప్రతి జిల్లా కేంద్రములోనేగాక, అన్ని పట్టణాలలో గ్రామాలలో, ఈ చౌక depot లను ఏర్పాటుచేసి బీద ప్రజానీకానికి సరియైన ధరలకు బియ్యం, ధాన్యం అమ్మించడానికి ఏర్పాట్లు చేయవలసిందిగ

Sri. S. Brahmayya:—

మనవి చేస్తున్నాను. దానికి తగు చర్యలు తీసుకొంటామని ముఖ్యమంత్రిగారు అన్నారు. వెంటనే అమలు పరచవలెనని కోరుతున్నాను.

మత్స్య పరిశ్రమ అభివృద్ధికి ప్రభుత్వం subsidy లు ఇచ్చి దానిని ప్రోత్సహించ వలెననే ఉద్దేశంతో ఉన్నది. అది అట్లుండగా, నవీన పద్ధతులు అమలులోకి రాక మునుపే ఈ పారిశ్రామికుల అభివృద్ధి చెందక ముందే, ఎండుచేపలు వగైరాలు మీద ఈ sales tax (అమ్మకాల పన్ను) వేశేటట్లు నాకు తోస్తుంది, ఈ అధునాతన పద్ధతులకు అలవాటుపడి ఎక్కువ ఆదాయం సంపాదించుకొనే పరిస్థితులు ఏర్పడితే ఈ అమ్మకాల పన్ను వేయవచ్చును, గాని ప్రస్తుతం వాటిమీద అమ్మకాలపన్ను రుద్దవద్దని మనవి చేస్తున్నాను,

Sri P. SURYANARAYANA

అధ్యక్షా, గవర్నరుగారి ఉపన్యాసానికి నేను అభినందనాలు తెలుపుచున్నాను. గవర్నరుగారి ఉపన్యాసంలో ఆరోగ్యంకొరకు ఇంకా కొన్ని ఆసుపత్రులను ఏర్పాటు చేయదలచాము అని మొన్న చెప్పారు. శ్రీకాకుళం ఆరు సంవత్సరముల క్రిందట తాలుకాగా ఉండేటప్పుడు ఒక ఆసుపత్రి ఉండేది. ఆ ఆసుపత్రి నేటివరకు కూడా తాలూకా ఆసుపత్రిగానే ఉంది. District Head Quarters అయి షుమారు ఆరు సంవత్సరములైనప్పటికీ గూడ ప్రభుత్వంవారు దానినిగురించి శ్రద్ధ తీసుకోలేదు. మొన్నటిదఫా కళావెంకట్రావుగారు శ్రీకాకుళం పర్యటనకు వచ్చినప్పుడు D. M .O. గారితో కలసి ఆసుపత్రిని చూచారు. 36 ఎకరముల భూమినికూడా District Hospitalకు గాను acquire చేయడానికి పరిశీలనకూడా చేశారు. కాని అప్పటినుంచి కూడా పరిశీలన తాలూకు resultఏమీ తెలియలేదు. దానికి 18 వేల రూపాయల స్థలం ప్రభుత్వం sanction చేసింది. కాని ప్రభుత్వ department దాని యందు శ్రద్ధతీసుకొని acquire చేయడం యిప్పటివరకూ ప్రారంభించలేదు. ఇపు డైనా acquire చేయమని కలెక్టరుగారికి ఆర్డర్సు ఇచ్చి' వెంటనే acquire చేయించ వలసిందిగా ప్రజల తరఫుననేను ముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను.

శ్రీకాకుళం ఆసుపత్రిలో మందులు పూర్వము ఎంతకోటా ఇస్తూవచ్చారో నేటికికూడ అదే కోటానే ఇస్తూన్నారు. రోగులసంఖ్య నానాటికి ఎక్కువై పోతున్నది. నేనీ శ్రీకాకుళం ఆసుపత్రికి వెళ్ళి అప్పుడప్పుడు రోగులను చూస్తూ ఉంటే మందులు. injections లేవు బాబు అని రోగులు ఆందోళన చేస్తూన్నారు. అందుచేత ప్రస్తుతం ఆ మందుల కోటాలనైనా హెచ్చించే ఏర్పాటు చేయించ వలసిందని మనవి చేస్తున్నాను. నిన్న కళావెంకట్రావుగారు ప్రశ్నకు జవాబు ఇస్తూ కుష్ఠరోగ ఆసుపత్రి ఒకటి శ్రీకాకుళంలో నెలకొల్ప వలెనని ప్రభుత్వం ఆలోచిస్తున్నదని సెలవిచ్చారు. శ్రీకాకుళం తాలుకాలో కుష్ఠరోగం చాలా ప్రబలి ఉన్నది. గార దగ్గర కొర్లె అనే గ్రామంలో ఒక మహనీయుడు ఒక గడ్డిల్లు ఇచ్చి ఒక చిన్న కుష్ఠరోగ ఆసుపత్రిని నిర్మించాడు. శ్రీకాకుళం పట్టణంలోనే వర్తక

Sri P. Suryanaryana:— సంఘంవారు ఒక doctorను పెట్టి ఆసుపత్రిని నేటివరకు maintain చేస్తున్నారు. అక్కడకూడా కొంతమంది వెళ్ళి మందులు పుచ్చుకొంటున్నారు. శ్రీకాకుళం గవర్నమెంటు ఆసుపత్రిలో వారానికి ఒక రోజుచొప్పున ఈ కుష్ఠువ్యాధి మందులు ఇస్తున్నారు. ఎన్ని ఇచ్చినప్పటికినీ కూడ ఈ కుష్ఠువ్యాధి నానాటికి ప్రబలం అయిపోతోంది. కాబట్టి తప్పకుండా కుష్ఠురోగ నివారణకోసం ఒక ఆసుపత్రిని శ్రీకాకుళంలో ఏర్పాటు చేయించవలెనని ప్రజలందరి తరపుననేను మనవి చేస్తూ ఉన్నాను.

మొన్న news papers లో పోలీసువారికి గృహనిర్మాణ నిమిత్తం కొంత డబ్బును కేటాయించి నట్లుగా వార్తవచ్చినది. శ్రీకాకుళంజిల్లా ఏర్పడి 6 సంవత్సరాలు అయింది. నేటికి శ్రీ కాకుళం జిల్లా పోలీసు సూపరెండెంటు ఆఫీసు, రిజర్వు పోలీసు quartrs వగైరాలు యింకా విజయనగరంలోనే ఉన్నవి. శ్రీకాకుళ ంజిల్లా పోలీసు సూపెరెండెంటు ఆఫీసును ఈ రిజర్వుపోలీసువారికిని శ్రీకాకుళంలో Buildingsను ఏర్పాటు చేయవలయునని మనవి చేస్తున్నాను. తర్వాత శ్రీకాకుళంలో రెండు సంవత్సరముల క్రితము తాలూకా పోలీసు స్టేషన్ను ఏర్పాటు చేశారు. దానికి Police Constables కొంతమంది ఉన్నారు. Constables కు Quarters లేవు. ఈ తాలూకా పోలీసు స్టేషన్కు కూడా Office Buldings లేవు. అందుచేత వాటికి కూడా Buildings ను ఈ డబ్బునుంచే ఏర్పాటుచేసి సౌకర్యములు కలుగ చేయాలని మనవి చేస్తున్నాను. తర్వాత శ్రీకాకుళంలో Industries లేవు. ఆముదాల వలసలో ఒకపంచదార ఫ్యాక్టరీని ఏర్పాటు చేశారు. చాల సంతోషం. శ్రీ కాకుళం చాల పురాతనమైన పెద్దపట్టణం. దానికి Co-operative సంస్థల మూలంగాని లేక గవర్నమెంటు వారైనను శ్రీకాకుళంలో కొన్ని Industries ను నెలకొల్పి ఈ నిరుద్యోగ సమస్యను కొంతవరకైన బాగుచేయాలని ప్రభుత్వం వారిని కోరుతున్నాను. ఇప్పుడు Municipalities వగైరాలున్నాయి. మునిసిపాలిటీలు కొన్నికొన్ని పట్టణాలలో ఆర్థిక పరిస్థితి బాగా లేకుండా నడుస్తున్నవి. వాటికి ప్రభుత్వం కొంత అప్పు మూలంగా డబ్బును ఇచ్చి కొంతవరకు subsidy లను ఇచ్చి నడపమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అట్లు జరుగకపోతే ప్రజలు చాలా ఇబ్బందులకు గురికావలసి వస్తుంది ఇప్పుడు మా మునిసిపాలిటీ విషయము చెబుతాను. దానికి లారీలు చెత్త ఎత్తడానికి గానీ కుండీల నెత్తటానికి గానీ లేవు, మామూలు బండ్లే ఉన్నాయి. ఆ బండ్లతో చెత్తఎత్తడం అంటే, ఊరు పెద్దపట్టణం కాబట్టి ఎత్తడం సాధ్యం కాకున్నది. కుండీ నీరుకూడా ఎక్కడిది అక్కడే స్థభించి పోతున్నది. కాబట్టి ప్రభుత్వం దీనిని గమనించి వెంటనే కొంతడబ్బును 40 వేలో, 50 వేలో అప్పు మూలంగానో లేక Subsidy మూలంగానో ఇప్పించి లారీలతో తీయించునట్లు ఏర్పాటు చేయవలయునని కోరుతున్నాను. అనేక పట్టణాలలో లారీలున్నాయి. మా శ్రీకాకుళంలో మాత్రం ఇప్పటివరకూ ఒకలారీ కూడాలేదు, కుండీ నీరు ఎత్తడానికి ఒక బండిగానీ లేదు. అందుచేత లారీలను కొనడానికి తగిన అప్పును ఇప్పించమని నేను ప్రభుత్వం వారికి విన్నవించు కుంటున్నాను. పట్టణంలో పెద్ద Hostels అవీ ఎక్కువైపోయి నాయి. కాబట్టి మునిసిపాలిటీలో లారీలతో చెత్తను కుండీ నీటిని

Sri P. SURYANARAYANA:—

ఎత్తడానికి వీల్లేనపుడు మురుగు నీరు తగ్గకుండా గోతులు గుంటలు ఎక్కువ అయినాయి. ఆ పట్టణంలో sanitation చక్కగా లేదు. దాని కోసం మరల నేను ప్రభుత్వాన్ని కొంత అప్పు మూలంగానో, లేకపోతే కొంత subsidy మూలంగానో ధనం ఇమ్మన మని కోరుతున్నాను.

Sri N. RAMABHADRA RAJU:—

అధ్యక్షా, గవర్నరుగారిచ్చిన ఉపన్యాసం విని చాలా సంతోషించాను. వారి ఉపన్యాసంలో కొద్ది లోపాలున్నట్లు కనిపించాయి. గవర్నరుగారి ఉపన్యాసంలో future Policy ని గురించి చెప్పడం ఇదివరకు అలవాటుగావుంది. ఆ ఉపన్యాసంలో గత 2 సం॥ల నుంచీ మనం ఏమి చేసినామో అది చెప్పారు కాని future policy ని గురించి ఏమీ చెప్పలేదు. మన ప్రభుత్వం అనేక గొప్ప కార్యములను చేస్తోంది. నదులపైన ఆనకట్టలుకట్టి ఆహారోత్పత్తి విషయంలో పురోగమనం చూపుతున్నందుకు చాలా సంతోషం. కాని ప్రభుత్వ పరిపాలనలో కొన్ని లోట్లు ఉన్నాయి. పరిపాలన ఒక క్రమంలో లేదు. దేశంలోని corruption ను రూపుమాపాలనే సూచనలు లేవు. గవర్నరుగారు Prohibition ను గురించి మాట్లాడుతూ "ఇదియింతకు పూర్వం excise department వారు చూస్తూ ఉండేవారు. ఇప్పుడు దానిని Prohibition Department కు యిచ్చాము. ఇకముందు అది సక్రమమైన పద్ధతిలో వుంటుం"దన్నారు. ఆచరణలో మాత్రం సక్రమంగా లేదు. Excise Department లో వుండగా ఎంత అరాచకం ప్రబలిందో, ఇప్పుడు అంతకంటె ఎక్కువగానే వుందిగాని అరాచకమేమీ తగ్గలేదనుటలో ఏమాత్రమూ సందేహం లేదు. ఇటువంటివి అనేకరకాలుగా ఉన్నాయి. ప్రభుత్వం అనేక పనులు చేస్తూంటుంది. కాని అవి ఆచరణలో ఎంతవరకు సక్రమంగా అమలు జరుగుతున్నాయని కూడా పరిశీలించాలి.

చంద్రమౌళిగారు నదులకువచ్చిన వరదలను గురించి మాట్లాడుతూ ఒక statement ఇచ్చినారు.

Mr. SPEAKER:—

ఆ topic అంతా ఇప్పుడు చెప్పటానికి time లేదండీ !

Sri N. RAMABHADRA RAJU:—

గోదావరి వరదలను గురించి ఇచ్చిన ఉపన్యాసం వింటుంటే హాస్యాస్పందగా వుంది. గోదావరికి వరదలు ఎక్కువగా వచ్చాయి, ఆ యా ప్రాంతములలో drainage system బాగా లేకపోవడం వలన కొన్ని గ్రామాలలోని పైరులన్నీ మునిగిపోయాయి. మేము అనేక పర్యాయములు ప్రభుత్వానికి మనవి చేశాము. drainage system బాగాలేదని మేము చెప్పినప్పటికి ప్రభుత్వం వారు గుర్తించలేదని మాకు బాధగావుంది.

# DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS

[11th August 1956

SRI. N. RAMABHADRA RAJU:—

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆహారోత్పత్తిని నూటికి 35,40 పాళ్లు పెంచాలని ఆలోచిస్తున్నారు. దీనికి నీటి సదుపాయము, ఎరువులు ఎంత ముఖ్యమో drainage systemను బాగు చేయడంకూడా అంతముఖ్యమే.

మన బడ్జట్‌లోటును భర్తీచేయడానికి చాలాపనులు చేస్తున్నారు. తుంగభద్ర పైన ప్రాజెక్టు కట్టినారు. కృష్ణానదిపైన కృష్ణాసాగర్ ప్రాజెక్టు కటుతున్నారు. పూర్తి అవుతోంది. గోదావరి నదికి మాత్రం ఎప్పుడో కాటన్ దొరగారు కట్టిన చిన్న ఆనకట్ట తప్పసరైన ప్రాజెక్టు లేకపోవడం విచారకరం, గోదావరిపైన ఒక ప్రాజెక్టు కట్టాలని నేను గోపాలరెడ్డిగారిని కోరుతున్నాను.

మత్స్య పరిశ్రమ విషయంలో కొలంబో పథకం క్రింద నార్వే సహాయాన్ని అన్ని రాష్ట్రాలు పొందాయి. మనరాష్ట్ర ప్రభుత్వం శ్రద్ధవహించలేదు. గోదావరి జలాలు అమలాపురంలో ప్రవహించడానికి సదుపాయంలేదు. అమలాపురం పరిసరగ్రామాలలో ఎక్కువగా చేపలపరిశ్రమ సాగుతోంది. దానికి ప్రభుత్వం సహాయం చేయుటలేదు. మనం ఏపనైతే చేస్తామని ప్రజలకు హామీఇచ్చామో ఆ పనులన్నీ సకాలంలో చేసి ప్రజలచే గౌరవంపొందడం ప్రభుత్వంయొక్క బాధ్యత అని మనవిచేస్తూ నేను విరమిస్తున్నాను.

Sri S. JAGANNADHAM:—

అధ్యక్షా:గవర్నరుగారు ప్రారంభోపన్యాసంలో గతంలో మనంసాధించిన విజయాలు, ముందు చేయబోయే కొన్ని ముఖ్య విషయాలను విశదపరిచారు. 'ఆంధ్రప్రదేశ్' అక్టోబరు 1వ తేదికి యేర్పడుతుందని చెప్పారు. కాని అది నవంబరు 1వ తేదీ వరకు పొడిగింప బడినట్లు తెలుస్తున్నది. ఒక జీవనజ్యోతివలన మద్రాస్తు ఉమ్మడి రాష్ట్రంనుండి ఆంధ్ర రాష్ట్రమును సంపాదించుకోగల్గాము. మనదేశంలోని గొప్ప గొప్ప నాయకుల కృషివలన ఆంధ్రప్రదేశ్‌ను యేర్పాటు చేసుకొంటున్నాము. మనం తెలంగాణాతో కలియుటకు కేంద్ర ప్రభుత్వంవారు సమ్మతించి మనకు అనుకూలంగా నిర్ణయించారు. ఇది మనప్రజలకు చిరకాలంనుంచి వున్నట్టి వాంఛ.

అయితే ఈ విశాలాంధ్రప్రదేశ్ మన భారత రిపబ్లిక్‌లో, ప్రధాన స్థానాన్ని పొందడానికి చాల అవకాశాలు ఉన్నాయి. మన ఆంధ్రప్రదేశ్‌కు ఉజ్వల భవిష్యత్తు ఉన్నదని కూడా మనవి చేస్తున్నాను. అయినా దీనికి మన నాయకులు చాల కృషి చేయవలసి ఉన్నది. విశాలాంధ్రప్రదేశ్‌లో తమభవిష్యత్తును గురించి తెలంగాణా వారికి తాత్కాలిక ఏర్పాట్ల విషయంలో ఏవిధంగా హామీలు యిచ్చి వారికి విశ్వాసము కలిగించారో ఆవిధంగానే ఆంధ్రప్రదేశ్ అవతరించిన తరువాత తీసుకొనబడేటటువంటి చర్యలలో కూడా మన నాయకులు వ్యక్తిగత రాజకీయాలకు గాని ముఠా రాజకీయాలకు గాని తావుఇవ్వకుండా, రాజకీయాలతో రాష్ట్రాన్ని విచ్ఛిన్నము చేయకుండా, నాయకత్వమే ప్రధాన లక్ష్యంగా చూచుకోకుండా రాష్ట్రశ్రేయస్సు దృష్ట్యా, ప్రజల శ్రేయస్సు దృష్ట్యా, నాయకులంతా పరస్పర సుహృద్భావంతో సమస్యలను పరిష్కారం

Sri S. JAGANNADHAM:— చేసుకొని భారత republicలో మన ఆంధ్ర నాయకులు మార్గదర్శకులు కాగలర్రని నేను ఆశిస్తున్నాను.

ప్లానింగ్ విషయంలో మనదేశం చాల ముందడుగు వేసినదనే చెప్పాలి. మొదటి పంచవర్ష ప్రణాళిక ముగిసినది. రెండో పంచవర్ష ప్రణాళికలో మనం అడుగు పెడుతున్నాము. ఆంధ్రదేశం నదీలోయ ప్రాజెక్టురంగాలలోను, వ్యవసాయ, విద్యుచ్ఛక్తి రంగాలలోను చాల అభివృద్ధి సాధించింది. పారిశ్రామిక రంగంలో కూడా కొంతవరకు అభివృద్ధి చూపించింది. కాని ఈ అభివృద్ధి ఇంకా చాల దేమోనని మనవి చేస్తున్నాను. భారత ప్రభుత్వము ఆంధ్రదేశానికి 118 కోట్ల రూపాయలు కేటాయించింది. కాని ఆంధ్రదేశంపూర్తిగా అభివృద్ధి చెందాలంటే ఈ డబ్బుచాలకుండా ఉన్నది. అందుకుగాను మన ప్రభుత్వము తన ఆదాయాన్ని పెంపుచేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నదని మనవిచేస్తున్నాను. అయితే ఈ ఆదాయాన్ని పెంచేందుకుగాను రైతులమీద, బీద ప్రజానీకముమీద పన్నులు వేయకుండా, పెద్దపెద్దవర్తకులమీద, పెద్దపెద్ద పట్టణాలలో నివసిస్తూ తమ గృహాలను ఇష్టమువచ్చినట్లు అద్దెలకిచ్చుకునే లక్షాధికారులమీద ఏదో విధంగా పన్ను వేసి ఆదాయాన్ని పెంచవలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఎంతైన ఉన్నదని మనవి చేస్తున్నాను. Planning విషయంలో ప్రజలు కూడా చాల చైతన్యంగా పనులు చేస్తున్నారు. కాని వారికి ప్రభుత్వ సిబ్బంది చాల ఆటంకాలను కలిగిస్తున్నది. వాళ్ళకు ఎటువంటి ఆటంకాలు కలుగనీయకుండా, ఉత్సాహంగా పనిచేయడానికి తగినంత ప్రోత్సాహము ఇచ్చినట్లయితే మన ప్రదేశాలన్ని కొంత వరకైనా అభివృద్ధి చేసుకోడానికి అవకాశం కలుగుతుంది. Planning అని, Local Development Works అని ప్రతిదాంట్లోను ప్రజల దగ్గర contributions అడుగుతున్నారు. కాని ప్రజలకు కూడా కనీసపు కోర్కెలు అనేవి కొన్ని ఉన్నాయి. Contribution లేకుండనే ముఖ్యమైన అవసరాలను తీర్చవలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఉన్నది. కనుక contribution లేకుండా చేయవలసిందని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. Irrigation విషయంలో ఆంధ్రదేశం చాల అభివృద్ధి చూపించింది. ముఖ్యంగా శ్రీకాకుళం జిల్లాకు సంబంధించినటువంటి వంశధార ప్రాజెక్టు విషయంలో ఉప ముఖ్యమంత్రిగారి కృషి ఫలించినందుకు శ్రీకాకుళం ప్రజల తరఫున వారికి నా అభివందనలు తెలియజేస్తున్నాను. అయితే ఇందులో ఒక విషయం మాత్రం ఉన్నది. పాత పట్టణం తాలూకా వాస్తవ్యులు లక్ష్మణదాసుగారు గొట్టదగ్గర reservoir కట్టకూడదని regulator కడితే బాగుంటుందని మనవి చేసి ఉన్నారు. ఏదో అసెంబ్లీలో ప్రజలు తెలుసుకోవడానికి ఈ విధంగా లక్ష్మణదాసుగారు చెప్పినప్పటికి కార్యరంగంలో ఎటువంటి ఆటంకాలు లేకుండా గొట్టదగ్గర reservoir కట్టడానికి శక్తి వంచన లేకుండా పనిచేయాలని మనవిచేస్తున్నాను.

విద్యారంగంలో ఆంధ్ర ప్రభుత్వం చాల అమోఘమైన కృషి చేస్తుందని మనవి చేస్తున్నాను. గతించిన 7,8 సంవత్సరాలలో High schools, Middle schools Colleges అనేకం స్థాపించబడ్డాయి. అయినా విద్యా విధానంలో తగినటువంటి

Sri S. JAGANNADHAM:—

మార్పులు రాకపోయినట్లయితే schools, colleges స్థాపించినటువంటి ఫలితం శూన్యమని తెలియ జేస్తున్నాను. మన ముఖ్య మంత్రిగారే అనేక దఫాలు ఈ Assembly Hall లోనే Educational standard తగ్గిపోతోందని మనవి చేసి ఉన్నారు. అయితే ఈ విషయంలో ఒక మనవి మాత్రం చేయదలచుకొన్నాను. రాబోయే కాలములో English యొక్క importance తగ్గిపోవు నప్పటికి S. S. L. C.లో ఇంగ్లీషులో percentage of marks for pass ఎందుకు తగ్గించకూడదనే విషయం మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను Service Commission పరీక్షకు కూర్చో డానికి ఇంగ్లీషులో 100కి 40 మార్కులు ఉంటేనే తప్ప కూర్చోడానికి వీలులేదని కూడా G.O ఉన్నది. అందుచేత percentage of marks ఇంగ్లీషులో తగ్గించి లెక్కల్లో గాని, మాతృభాష తెలుగులోగాని 40% పెట్టవలెనని మనవి చేస్తున్నాను. విద్యా శాఖలో పనిచేస్తున్నటువంటి సిబ్బందికి కలుగుతున్న ఇబ్బందులను కొన్ని ముఖ్య మంత్రిగారికి మనవి చేయదలచుకొన్నాను. college లలో పనిచేస్తున్నటువంటి తాత్కాలికోద్యోగులు చాలమంది ఉన్నారు. వేసంగి సెలవులలో వారికి జీతాలు ఇవ్వకూడదని, మళ్ళీ సెలవుల తర్వాత dutyలో join అయినప్పుడు రెండు మాసాల జీతాలు ఇమ్మని ఒక G.O. ఉన్నట్లు కన్పిస్తున్నది. అదే నిజమైనట్లయితే అటువంటి ఇబ్బంది వారికి కలుగజేయడం చాల అన్యాయమని మనవి జేస్తున్నాను. 20 తారీఖు వచ్చేసరికే అప్పుడు చేసుకునే పరిస్థితులలో వారున్నప్పుడు రెండు మాసాలు జీతంలేకుండా వారు ఎలా జీవించాలో మంత్రిగారు ఆలోచించాలి. High schools లోని ఉపాధ్యాయుల promotion విషయములో B. Aతో సహా B.Ed సర్వీసు 7 సంవత్సరములు ఉంటేనే గాని Head master పదవికి అర్హులు కారని చెప్పి ఉన్నది. 1955 లో శ్రీకాకుళం జిల్లాలో Head Masters Panel వేసేటప్పుడు 7 సంవత్సరముల సర్వీసు గలవాళ్ళు తగినంత మంది లేనందువల్ల retire అయిన వాళ్లనే continue చేయాలని చెప్పి ఉన్నారు, ఆ తరువాత మళ్లీ 7 సంవత్సరముల సర్వీసు చాలదు, B.Ed సర్వీసు 10 సంవత్సరములు ఉంటేనే తప్ప Head Master చేయడానికి అర్హులు కారని క్రొత్త G.O తీసుకువచ్చారు. ఆవిధంగా ఎందుకు తీసుకరావాలో అర్థం కావటంలేదు. ఉపాధ్యాయులకు తగినటువంటి ప్రోత్సాహము లేకపోయినట్లయితే ఉపాధ్యాయుడుగా పని చేయడానికి ఏ graduate వస్తాడు? M. A. First class వచ్చిన వాళ్లు B.A. Hons., First class వచ్చిన వాళ్లు I. A. S. recruitment కి పోతున్నారు.

The Hon. Dr. B. GOPALA REDDI:—

మొదట నుంచి కూడా 10 సంవత్సరముల service ఉంటేనే గాని Head Masterగా promote చేయకూడదనేటటువంటి G.O ఉన్నది. అటువంటి వారు లేకపోతే 7 సంవత్సరములవరకు తగ్గించవచ్చునని ఉన్నది. ఇప్పుడు ఆ ఏడు సంవత్సరములు తగ్గవచ్చుననే మాట తీసివేసినాము. కొంత అనుభవం కలిగినవారు Headmaster లుగా ఉంటే schoolకు మంచిదనేటటువంటి ఉద్దేశ్యముతో చేశాము.

Dr. B. GOPALA REDDI:—

ఏమి తెలియకుండా నిన్నకాక మొన్న B. Ed, pass అయిన వాళ్లు Headmaster అయితే dicipline ఉండదేమోననే ఉద్దేశ్యంతో చేయబడినటువంటి rule అది.

Sri. JAGANNADHAM:—ముఖ్య మంత్రిగారు B. Ed; service 10 సంవత్సరాలు ఉంటేనే తప్ప Head master పదవికి అర్హులు కారని అంటున్నారు. ఆ విధంగా ప్రతి department లోను చేస్తున్నారా? I. A. S. recritment లో 10 సంవత్సరాలలోపుగానే priority లేకుండా Service లేకుండా జిల్లాకలెక్టరుగా, Deputy Secretary గా నియామకం చేస్తున్నారు. B.Ed service 10 సంవత్సరాలు ఉంటేనే తప్ప Head master లుగా పనికి రానటువంటి వారు తక్కిన departments లోఏవిధంగా పనికి వస్తారని మంత్రిగారిని అడుగుతున్నాను.

Sri. L. LAKHMANA DAS:—

అధ్యక్షా, జగన్నాధంగారు వంశధారా ప్రాజెక్టు విషయంలో మాట్లాడుతూ నేనేదో Platform పైనుంచి ప్రజల గురించి మాట్లాడినట్లు చెపుతున్నారు. నేను నిన్న చెప్పాను. ఇంతకు ముందు కూడా చెప్పాను, గొట్టదగ్గర reservoir వల్ల 30 వేల ఎకరాలు మునిగి పోతున్నాయి. వాళ్లకేదైన ఉపాధికల్పించి, ఇళ్ల కట్టించినపుడు మాకేమి అభ్యంతరంలేదని శ్రీకాకుళం ప్రజలందరు కూడా ఒప్పుకున్నారు. ఆ నాటి సభకు వారే అధ్యక్షత వహించారు. ఆ సభలో చేసిన తీర్మానానికి కట్టుబడి ఉండాలనేదే నా ఉద్దేశ్యము. అట్లాకాకుండా 30 వేల ఎకరాలు ఎక్కడా ఇచ్చుకో లేని పరిస్థితి ఏర్పడి, వాళ్లకు ఇళ్లు వాకిళ్లు ఇవ్వలేని పరిస్థితిలో ఉన్నప్పుడు reservoir కు బదులు regulator కట్టాలని చెప్పాను. అంతకు తప్ప మరేమి లేదని మనవి చేస్తున్నాను.

Sri. K. VENKATARATNAM:—

అధ్యక్షా, గవర్నరుగారు ఇచ్చిన ఉపన్యాసమునకు అభినందన తీర్మానమును నేను బలపరుస్తున్నాను. కాని గవర్నరుగారి ఉపన్యాసములో కోట్లకొలది నష్టము కలుగజేసినటువంటి బుడమేరు వరదలు గురించి ఒక్కమాట కూడ చెప్పనందుకు నిజంగా చాల విచారముగా నున్నది. అధిక వర్షాల వలన మురుగుకాల్వలు సరిగా లేనందువలన P. W. Department వారు తగినటువంటి చర్య తీసుకోలేనందు వలన మురుగు కాలవలన్నీ చాలా మెరకవేసిపోయి, పారుదల లేనిదాని వలన చేలంతా నీరుతో నిండిపోయినాయి. ఇదంతా యీ సంవత్సరం కురిసిన అధిక వర్షాల వల్ల జరిగింది. ఇంతేకాకుండా, దాదాపు లక్ష ఎకరాలు బుడమేటి వరదల వల్ల కూడా సర్వనాశనం అయిపోయింది. కనీసం ఎకరాకు 10 బస్తాలు ప్రకారం లెక్కవేసు కొన్నప్పటికి లక్ష ఎకరాలకు కనీసం రెండుకోట్ల రూపాయలు నష్టము రైతులకు కలిగింది. ఈ వరదల వల్ల రైతులు రెండు కోట్ల రూపాయల ఆదాయాన్ని పోగొట్టు కోవలసిన స్థితి పట్టింది. నిజంగా బుడమేటి reservoir గురించి ఒక సమగ్రమైన పథకం కొరకు చాలా కాలమునుంచి జరుగుతున్న ఆందోళన ననుసరించి Central

Sri. K. VENKATARATNAM:—

[11th August 1956]

Government sanction చేసి నటువంటి సమగ్ర పథకాన్ని అమలుజరుపనందుకు ఈనాడు రైతులు పైనుదహరించినఆధాయాన్ని పోగొట్టుకో వలసిన గతి పట్టింది

Mr. SPEAKER:—వరదల గురించి వేరే చర్చ జరుగుతుందని మీ దృష్టికి తీసుకు వస్తున్నాను.

Sri. K. VENKATARATNAM:—వరదల గురించి వేరే చర్చ జరుగుతుందని అంటున్నారు. అయినా ఈ సందర్భంలో ఒక్క విషయము మనవి చేయదలచుకొన్నాను. ప్రభుత్వము సరియైన చర్య తీసుకొని దానివలన, ఈనాడు వరదల వల్ల లక్ష ఎకరాల భూమి జలమయమై రెండు కోట్ల రూపాయల సంపద రైతులకు దక్కకుండా పోయిందనేటటువంటి విషయము ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను, ఇదీ నేను ముఖ్యంగా మనవి చేసేది.

రెండవది, జిల్లాబోర్డులు, స్థానిక సంస్థల పరిస్థితికూడా చాలా విచారకరముగా యున్నది. వీటికి సలహాసంఘాలు పనిచేయవని నేను ఆనాడే చెప్పాను. ఈ సలహా సంఘాలవల్ల కొంచెము కూడ ఉపయోగములేదు. జిల్లాబోర్డులు దాదాపు మూడు సంవత్సరాలనుంచి Special officers చేతుల్లో ఉన్నాయి. ఈనాడు special officerతానే administrator అని, ఎవరుకూడ తన administrationలో జోక్యము కలుగ జేసుకోకూడదని అంటున్నాడు. జిల్లాబోర్డులలో గ్రామాలకు సంబంధించినటువంటి elementary education ఉన్నది. secondary education ఉన్నది, చిన్న చిన్న మట్టిరోడ్లు ఉన్నాయి, metal roads ఉన్నాయి. వీటన్నిటి విషయములోను Special officer తాను ఏదో జిల్లా కలెక్టరుగా ఉన్నాను అనుకొని ఎవరుకూడ తన administrationలో జోక్యము కలుగజేసుకోకూడదు అనేటటువంటి స్థితిలో ఉన్నాడంటె ఇది నిజంగా సహించ వలసినటువంటి విషయము కాదు అనేది ముఖ్యమంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. ఎందుకంటె అనుదినము జరుగుచున్న పరిపాలనవలన ప్రజలకు కలుగుతున్న కష్టాలు, ఇబ్బందులు చెప్పవలసిన బాధ్యత M. L. A. లైన మూదై ఉన్నది. ఆయా నియోజకవర్గానికి సంబంధించిన M. L. Asకూడ ఏదైనా చెప్పితే విననటువంటి కలెక్టర్లు special officers గా తయారైతే, అక్కడి పరిస్థితులు ఏవిధంగా ఉంటాయో యోచించండని అంటున్నాను. ఈనాడు జిల్లాబోర్డు రోడ్లు విషయంతీసుకొంటె, అవి ఎందుకు పనికిరాకుండా పాడైపోతున్నాయి. మట్టిరోడ్లు గాని, metal roads గాని, అన్నీ కూడ గోతులుపడి వాటిపైన కదలడానికి వీలులేకుండా అయిపోయినాయి. దానికిగ్రాను కొంతడబ్బు, చూపించామని గవర్నరుగారి speechలో ఉన్నది. Ten percent ఇస్తామన్నారు. ఈ ten percent వల ఏమి అవుతుందో అర్థం కావడంలేదు. Highways లో నుంచి ten percent తీసి ఇచ్చినప్పటికి కూడాను ఈ రోడ్లు బాగుపడవు. నిజంగా ఈ రోడ్లు చెప్పలేనటువంటి దుస్థితిలో ఉన్నాయి. మన గవర్నమెంటుకు ఆర్థికంగా లోటు ఉన్నప్పటికి, రోడ్లు, రవాణా సౌకర్యముల విషయం నిర్లక్ష్యం చేయకూడదు. సరియైన రోడ్లు, రవాణా సౌకర్యాలు లేకపోయినట్లైతే ప్రజ

Sri. K. VENKATARATNAM:—

లకు ఎంత ఇబ్బందిగా ఉంటుందో అనుదినము ఈ కష్టాలు స్పష్టంగా అందరికీ కనుపిస్తూనే ఉన్నాయి. అదేవిధంగా education విషయంలో ఈ special officer అనుసరిస్తున్న విధానాన్ని గురించి చెప్పాలంటె చాలా ఉన్నది. అదంతా ఇప్పుడు చెప్పుటకు టైములేదు. కాని, ఈరోడ్ల విషయంలో మాత్రము నిజంగా గవర్నమెంటు చూడవలసిన బాధ్యత ఉన్నది అంటున్నాను. ఏదోకొంత భాగము ఇస్తే ఈపని జరుగుతుంది అంటే మాత్రము చాలదు అంటున్నాను. ఈ జిల్లాబోర్డులకు ఆదాయము లేదంటారా, వాటికి ఇంకో మార్గము వెతకండి. జిల్లాబోర్డులను నిజంగా ప్రజాప్రాతినిధ్యంగా చేయాలంటె, వాటికి పంచాయితీ బోర్డుల ద్వారానైనా elections జరిపించండి. పంచాయతీ బోర్డులకు elections పెట్టి, వాటిద్వారానైనా, లేక చౌకగా, తేలికగా ఎన్నికలు జరిగేటటువంటి విధానము ఉంటె, ఆ విధంగా జరిపించండి. వీటిని ప్రజాప్రాతినిధ్యం గలిగినటువంటి స్థానిక సంస్థలుగా చేయకపోయినట్లైతే ప్రజలకు సంబంధించినటువంటి వ్యవహారాలలో చాలా చిక్కులు వస్తాయి. అవన్నీ తీసుకువచ్చి ఇక్కడ అసెంబ్లీ భవనములో కూర్చొని అదిచేయలేదు, ఇది చేయలేదు అంటె, స్థానిక సంస్థల మంత్రిగారికి ఇబ్బందిగా ఉంటుంది, చెప్పడానికి సభ్యులకు కూడ ఇబ్బందిగా ఉంటుంది. కనుక ఈవేళ పంచాయితి బోర్డులకు ఎన్నికలు జరిపించండి. ఆ పంచాయితీబోర్డులద్వారా వీటికి ఎన్నికలు పెట్టించండి. ఆ ఎన్నికలలో ఎవరో ఒకరు వస్తారు. వీటి పరిపాలన జరుగుతుంది. ఈ విధంగా special officers వల్ల ప్రజలకు జరుగుతున్నటువంటి ఇబ్బందులను నివారించాలని మనవిచేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

SRI N. K. LINGAM:—

అధ్యక్షా! గవర్నరుగారి ఉపన్యాసమునకు ప్రతిపాదింపబడిన ఈఅభినందన తీర్మానమును నేను బలపరుస్తున్నాను. గవర్నరుగారు తమ ఉపన్యాసములో, ఆంధ్రప్రభుత్వము ఇప్పుడు చేసినటువంటి పనిని, చేయబోయేటటువంటి కార్యక్రమాన్ని వారు సూచించారు. కాని కొన్ని ముఖ్యమైనటువంటి విషయాలు ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. ఈ రవాణా విషయములో, నందికొట్కూరుకు సంబంధించినంతవరకు ఎంతో కాలమునుంచి చేయలేనటువంటిపనులు ఈరోజు ఉప ముఖ్యమంత్రిగారు సాధించారు. నందికొట్కూరు నుంచి నంద్యాలకు రోడ్డు, శ్రీశైలమునకు చక్కని రస్తా, కర్నూలు నుంచి గుంటూరుకు రోడ్డు తారువేయుట మొదలైనపనులు చేశారు. ఇవి ముఖ్యంగా రైతులకు గాని, కూలీలకు గాని అంతఉపయోగకరంగా ఉండకపోవచ్చు, కానిఇవి cars, buses, lorries తిరగడానికి ఎక్కువ ఉపయోగకరంగా ఉంటాయి. కనుక వారికి మా ధన్యవాదాలు. కాని ఎక్కువ భాగము పల్లెప్రజలు నివసించేటటువంటి ప్రాతకోట, ఆత్మకూరు ఫిర్కాలలో బాధ పడుతున్నటువంటి ప్రజానీకానికి కొన్ని రోడ్డు సౌకర్యాలు మొదటి పంచవర్ష ప్రణాళికలో సూచించాము. ఆపల్లెలకు ఏదైనా చేస్తామని ఈ ఉపన్యాసంలో కన్పడలేదు. కనుక ఈ రెండవ పంచ

Sri. S. K. LINGAM:—



వర్ష ప్రణాళికలోనైనా ఆ పల్లెప్రజలకు ఎక్కువ సౌకర్యము కలిగేటటువంటి రస్తాలు ఏర్పాటు చేస్తారని నేను ఆశిస్తున్నాను.

రెండవది irrigation విషయంలో ఒక కడప-కర్నూలు కాలవకు మా తాలూకాలో ఎక్కువడబ్బును ఖర్చుపెట్టి తయారుచేశారు గాని, అది మాకు, ఎక్కువగా పల్లెలకు ఉపకరించకుండా ఉన్నది. ఈ కాలవ మొదటినుంచీ ఉంటున్నదే. దానికి ఎక్కువడబ్బు వినియోగించారు. కాని, 30 గ్రామాలలో నివసించేటటువంటి రైతులు, కూలీలు అనుభవించ బోయేటటువంటి ఒక ప్రాజెక్టు, వరదరాజ ప్రాజెక్టు అనే దాన్ని గురించి అనేక రోజులనుంచి ఆందోళన చేయుచున్నాము. మేము ప్రభుత్వానికి మహజర్లుకూడ పంపాము ఈ ప్రభుత్వము దానినికూడ ఈ ఉపన్యాసములో సూచించ లేదు. కనుక ఇకముందైనా ముఖ్యమంత్రిగారు ఎక్కువ శ్రద్ధతీసుకొని మనము విశాలాంధ్రలోకి చేరకముందే ఈ విషయములో ఏదైనా కృషిచేస్తారని ఆశిస్తున్నాను.

పైగా, హరిజనుల యిళ్లస్థలాల కొరకు యిదివరకు యిచ్చిన రెండులక్షలు కాకుండా, వారి యొక్క ఉదాసీన హృదయముతో దానిని నాలుగు లక్షలవరకు ఎక్కువ చేశారు. అందుకు యీ రోజున హరిజన లోకమంతయు వారికి కృతజ్ఞతను తెలుపు తున్నారు. కాని ఆ మొత్తమంతయు ఒక్క జిల్లాకు కూడా చాలదని మా అభిప్రాయము. ఎన్నో ఏండ్లుగా నలుగుతున్న యీ సమస్యను పరిష్కరించి వేయటానికి ఒక trust fund మాదిరి బడ్జటులోనే యీ సొమ్మును కేటాయించి యీ సమస్యను పరిష్కారము చేసివేస్తే మంచిదని అంటున్నాను. ఇదిగాక మా తాలూకాలో ఉన్న అన్ని High schools లోకి పెద్దది అయిన ఆత్మకూరు హైస్కూలులో సుమారు వెయ్యిమందికి పైగా విద్యార్థులు చదువుతున్నారు. వారికి సరియైన accommodation లేకుండా యిబ్బంది పడుతున్నారు. ప్రతి సంవత్సరము ముప్పై, నలభై కొట్టములు అగ్ని దేవునికి ఆహూతికావడము. దానిమీద గ్రామములకు పోయి తడికల కోసము, గడ్డికోసము బిక్షము ఎత్తడము జరుగుచున్నది. ఒక్కొక్కప్పుడు బోదగడ్డి కప్పడము కూడా జరుగుచున్నది. ఈ పరిస్థితి అంతాచూచి విద్యాశాఖవారు గాని, జిల్లాబోర్డు అధిపతులుగాని ఏమైనా శ్రద్ధ తీసుకున్నారాంటే, నాకు జ్ఞాపకము ఉన్నంతవరకు చూస్తూ, తీసుకున్నారని ఏ మానవుడు కూడాచెప్పడు. ముఖ్యమంత్రిగారు ఆప్రాంతాలకు పర్యటనకు వచ్చి సుమారు 1½ సంవత్సరములు కావచ్చింది, మరల ఆ ప్రాంతానికి వారు వచ్చినట్లు కనబడదు. ఏ కారణముచేతనో గాని వారు ఆ ప్రాంతానికి రానేలేదు. ఇప్పుడైనా ఆ విద్యార్థుల యందు దయవుంచి ఒక పర్యాయము ముఖ్యమంత్రిగారు ఆ ప్రాంతానికి వచ్చి చూస్తారని ఆశిస్తున్నాను. ఒక పర్యాయము చూస్తే, ఆ హైస్కూలు యొక్క దుస్థితి చూడగలరు. హరిజన విద్యార్థులకు వసతి గృహములు సుమారు నాలుగు వందల దాకా కలుగ జేశారు. అందులో బాల బాలికలు కూడా ఉంటున్నారు. అందుకు యీ కాంగ్రెసు ప్రభుత్వానికి, ఆంధ్ర ప్రభుత్వానికి నా ధన్యవాదాలను అర్పిస్తున్నాను. ఈ మధ్య అక్కడ కాలేజీలలో చదువుతున్న విద్యార్థులు డబ్బు కట్టనందువల్ల, వారిని హస్టల్సులో చేర్చుకోక పోవడమువల్ల చాలా యిబ్బంది పాలైనారు. అట్లా జరుగకుండా వారికి scholarships యిస్తామని, కాక

Sri N. K. LINGAM:— పోతే.వారికి అయ్యేఖర్చు యిస్తామని ప్రభుత్వము వెంటనే తెలియపరచి నట్లయితే వాళ్లను చేర్చుకునే అవకాశము కలుగుతుంది. ప్రభుత్వము ఆ విధముగా ఉత్తర్వులు జారీచేయవలసిందిగా కోరుతున్నాను. లేకపోతే అక్కడ స్థానికంగా ఉన్న హరిజన విద్యార్థులను హాస్టళ్ళలో admit చేసుకుంటే వారికి ప్రత్యేకమైన గ్రాంటుయిస్తామనియైనా ప్రభుత్వము తెలియ జేయాలని అంటున్నాను.

పైగా, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చేయవలసిన పనులలో ఎక్కువ భాగము యీ హరిజనులకు గాని, పేదప్రజలకుగాని, లభించలేదు. దానికి ఒక పరమ సూత్రము ఉన్నది. అది యేమిటంటే, ఎవరైతే డబ్బుయిస్తారో, ఆ ప్రాంతములో ఆ ఊరిలో, ఆవీధిలో, ఆ యింటిదగ్గర పని చేస్తామని అంటున్నారు. కాని నూటికి 70 మంది పేదప్రజలు యీ డబ్బును అనుభవించ లేక పోతున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోనైనా హరిజనులకు ఎక్కువగా డబ్బుకేటాయించి, కావలసినంత మటుకు వసతులు ఏర్పాటు చేస్తారని ప్రభుత్వాన్ని కోరుతూ, యీ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షుల వారికి నా ధన్యవాదాలను అర్పిస్తున్నాను.

SRI B. V. SUBBA REDDI :—Mr. Speaker, Sir, while I am very glad to support the motion before the House of offering thanks to the Governor for the lucid, forciful and effective way it was delivered to this House I am unable to agree with most of the things that are stated in the address. Sir, as all the hon. Members are aware, though the Governor's address is purely a formal affair still it becomes important as reflecting the policy and programme which the Government intend pursuing in the near future. Sir, the Governor's address reads like the lullaby of a mother rocking a child to sleep, and it left every member of this House in a stupor and in a feeling of drowsiness. Sir, the address is a comprehensive resume of all that has been achieved by the present Government ever since the inception of the Andhra State in October 1953, and particularly in the preivious year and states what the Government propose to do in the near future during the period of the Second Five Year Plan. Sir, I am fully alive and conscious of the several handicaps and

difficulties of the Government. I am also alive to the prevailing circumstances at the present time. I am also conscious of the vastness and complexity of the problems facing Government, and with the full responsibility that I owe to this House and the people at large I wish to make a few observations.

Sir, I do not wish to waste the precious time of the House by referring seriatum to the several subjects dealt with in the address. I only wish to confine myself to the programme and policy of the Governmet and the administration in general.

Sir, judged by the standard which you people (addressing the Treasury Benches have set before yourself. judged by the several promises wich you people made in your speeches to the electorate and in your election manifesto and judged by the socialistic pattern of society which you peple have set before yourselves judging most liberally and very leniently I am constrained to observe that your performance is very poor, if not miserable, and all your performance pale into insighificance viewed in the light of all the extravagant promises which you have made to the electorate.

THE HON DR. B. GOPALA REDDI:— You address the Chair, speak in the third person; otherwise 'you' will mean the Speaker. (Laughter)

MR. SPEAKER:—Please carry on.

SRI. B. V. SUBBA REEDI:—Sir, I ask the Government: What have you done to improve the lot of the common man? As I have just now stated, your ultimate goal is the establishment of a socialitic pattern of society. But you have not so far defined what it means. One leader defines it in one way, another leader defines it in another way; and each leader defines it in is own way and according to his own convenience

While one leader would have it as reducing the gulf between the lowest income man and the highest income man, another leader would have it as increasing the standard of living of the common man. Whatever that may be, Sir, the common man in the street feels that with the advent of the socialistic pattern of society he is going to live free from want and suffering, in a state in which he can keep his body and soul together. Sir, I ask, what is it the Government have actully done to improve the lot of the common man economically? Sir, while it is true that that the Goverment have laid a road here and a road there constructed a school building here and dug a well there, I am sorry to say that what they have done is very poor. While it is true that thay have spent vast sums of money for improving towns and cities—perhaps to impress the foreign tourists who frequently visit these places, what is it they have done to improve villages? You go to the villages, and what is the spectacle you see there? Squalor, wretchedness, misery, disease and hunger. These are still, widespread and rampant and are eating into the very vitals of the human beings there. Sir, while what has been done is practically precious little and negligible, the common man is not able to feel the difference between the previous British Government and the present Government. Sir, you have only to visit the village to be convinced of what I am saying here to-day.

Now, Sir, I go to the subject of administration in general. I hope I am not far wrong if I say that the Britisher bequeathed to us a sound and efficient adminisdrtion, if not anything else. But to-day you see a feeling of laxity, a feeling of looseness has crept into the system of administration and the evils of corruption, nepotism and leakage of public funds in public works—all these still prevail and are on the increase. I am sorry to say that the condition is not much

better now than what it was prevailing during the British regime. While it is true that Man has made vast strides in conquering Nature, particuarly in inventing destructive weapons which will devastate and extinguish humanity in the twinkling of an eye, still any student of human nature can easily see that there is now degeneration, deterioration and degradation common in very walk of life. Sir, while we may be feeling proud for having abolished exploitation by zamindars and princes, you have let loose on society an army of parasites who are to-day exploiting people in all ways and that too unconsciously and unknowingly. Sir, I am not referring to one particular class. There are hundreds and millions of people in all the parties, and that is the state to which we have been reduced at the present time.

Sir, while there might be many reasons for this state of affairs, mainly the blame rests on the Government which is torn asunder with groups and rivalparties for power. It is true that ever since the dawn of humanity, power, wealth and glory have been the ambition of every human being. But, at least in the past people had some regard for the means to achieve these ends, whereas today people have absolutely no regard for the means and they want to achieve these ends at any cost by foul or fair methods. Sir, if we are not alive to all these realities, I am afraid that the gathering storm and catastrophe towards which we seem to be moving, will certainly overtake us much sooner than we expect and inspite of all the Hericulean efforts of leaders like Pandit Nehru it cannnot be avoided.

Lastly, Sir, I would only refer to a few of the items to which a number of hon. Members have given expression. As Mr. T. Ramachandra Reddi said yesterday, I must congratulate him for his plain speaking, so far as land reforms are concerned, I feel we should not bypass it. It is

better they are decided soon one way or the other. So far as the administration of district boards and the special officers' regime are concerned, it is a very sad commentary and the least said about it the better.

And so far as the taxation measures are concerned, they are causing very severe headache to everybody and particularly to the agriculturist. I would only advise the Government to devise some permanent measure of taxation and be done with it at least for some years to come. Sir, I might tell the Government that this kind of dilly-dallying and shilly-shallying way of doing things does no fair to the Government nor good to the people at large. Sir, Government should rise to great heights both intellectually and morally and act boldly and fearlessly. I hope, very piously hope, that in the new state of things which we are going to get, we will have certainly a Government which can act boldly and fearlessly and do something to improve the lot of the common man. Thank you Sir.

SRI K. V. RAMANAYYA NAIDU:— Mr. Speaker, Sir, I am glad to support the motion moved by Sri K. V. Vema Reddi thanking the Governor for the address given by him. Though he is considered to be a titular head, still I am glad he has taken real and keen interest in every branch of administration of this State. And I think our Government and our Ministers must feel thankful to him for what he has done and what he is trying to do. The Governor was pleased to mention very clearly what has been achieved by this Government after the attainment of a separate State. He has also envisaged what is likely to be done in the very near future. Even though he has mentioned certain important things, my feeling is that it does not go far enough. There are many things which have been omitted to which I would like to make a reference.

Now, certain new railway lines are going to be taken up in our State and no specific mention is made about this in the Governor's address. With reference to Kristna district in particular, it is proposed, as has already been announced by the General Manager of the South Indian Railway and the Superintendent at Bezwada, to extend the mixed gauge up to Gudivada. I know, Sir, that our Government has recommended to the Railway Board and to the Central Government that the mixed gauge should be between Guntur and Masulipatam and we thought that it would be taken up as a single unit. But now, we find that it is not going to be taken up as a single unit for the time being and that the mixed gauge will be only up to Gudivada. My point is this. Kristna district is considered to be one of the granery districts of our State, if not of the whole of India. Because of this particular difficulty of metre-guage, the ryots of Kristna district have been suffering all these years. Their produce has to be exported to outside districts and to other States. In particular, most of the surplus paddy and rice of Kristna is being exported to Malabar which is on the broad guage. The people and especially merchants are anxious to export their produce to Malabar. But the railway line connecting Kristna district with the main line is of metre guage. So merchants find it very difficult and costly to purchase their requirements from rice centres on the metre guage. For this reason they always prefer to purchase their stocks from Tenali, Vijayawada or Tadepalligudem in West Godavari district, because if paddy is purchased at Gudivada or Gudlavalleru or Masulipatam, they have to tranship it at Tadepalli into broad guage and this transhipment entails great trouble, wastage of material, leakages and pilferages. In order to avoid all these difficulties, the merchants prefer to confine their purchases at places on the broad guage only

There is another reason also. In two months' time the Telangana area is going to be merged with our State and our State then would be one of the big States, if not the biggest. Telangana area also is a deficit area and the surplus produce in Kristna district has to be taken to Hyderabad. When the Nizam was in power, he was entitled under a treaty with the British Government to have goods delivered at Masulipatam port free of excise duties and he tried his level best to secure the port of Masulipatam for himself, to facilitate import of goods from foreign countries to Hyderabad direct. He fought the matter out even up to the parliament of England and the English Government did not yield. Then he asked for a corridor or at least for a seprate broad guage railway line up to Masulipatam. That was also denied by the British Govenment. Now, Hyderabad and Andhra are going to be one State and We will have plenty of mineral resources and they will have to be exported to foreign countries only through the port of Masulipatam which is the nearest port to Hyderabad. Therefore, for these reasons if the line from Masulipatam to Bezwada is not converted into a mixed guage, there will continue this difficulty of transhipment which would involve additional expenditure and labour. I know that our Govenment has suggested to the Union Government that there should be a mixed guage between Guntur and Masulipatam. But that is not going to be done now. This morning I had a discussion with the Planning Minister, Sri Kala Venkata Rao, and he told me that the question of mixed guage between Guntur and Masulipatam is not given up. The line between Gudivada and Bhimavaram is going to be converted into broad guage. That being the case, I do not know why the line up to Masulipatam, which is the district head-quarters, should not be converted into broad guage. Of the two important minor ports of Andhra, Masulipatam is one, the other being Kakinada and there is no scope for the development of Masulipatam port

if the railway line is not converted into broad guage. Also Masulipatam port is very convenient for Rayalaseema people and it is going to be of greater use to the present Hyderabad area. Taking all these into consideration, I feel it is the duty of our Government to see that the mixed guage is extended up to Masulipatam. Otherwise, if we want to go to Hyderabad, we will have to get down at Gudivada or Bezwada and get into another train and that would involve lot of inconvenience to the people. So I request the Government, and particularly the Hon. Chief Minister, to take up the matter with the Govenment of India and see that the mixed guage is extended right up-to Masulipatam port. This will also improve the port and facilitate export of the mineral wealth of Hyderabad.

Then, Sir, Masulipatam is also the headquarters of Kristna district. The district headquar.ers hospital is in a dilapidated and antediluvian state. It has been there for the last 400 years and every year the P. W. D. authorities repair it but they could not stop the leakage. Whenever there is rain, there is leakage and patients are shifted from place to place I think the Hon. Chief Minister is also fully aware of the condition of this hospital. Inspite of its being a headpuarters hospital, it has been neglected. Even though provsion is made in the budget for the improvement of other district headquarters hospitals, this hospital has not figured prominently in their view. I hope that in the Second Five-Year Plan out of the amount allotted for hospitals, a major portion of it would be utilized for this hospital. Through private contributions and donations, we have been able to raise about Rs. 3.0 lakhs and with it we have constructed a maternity ward, an operation theatre and one blood bank, all at a cost of Rs. 3.0 lakhs. I request that improvements should be done as early as possible.

11th August 1956

Sri K. V. Ramanayya Naidu:—

It is also mentioned that so many irrigation schemes have been taken up. We are glad for it. But the point is, most of us may not survive to see these irrigation schemes. Whatever it is, apart from the irrigation sources, the drainage sources are completely neglected in the Kristna district. There are certain drainage channels which have never been repaired for the last 40 years. If irrigation sources are not improved, what earthly use is it to the ryot. When he is able to take the produce in December or February, if monsoons breakout or there are heavy rains, all his produce is wasted or the land is submerged. Therefore I request the Government to direct the P. W. D. authorities to repair drainage channels also. The P. W. D. subordinates are very callous and the way they carry on the administration is certainly deplorable; they are like **archakas** not giving the boon even though God gives it. I request the Government to improve the drainage channels also along with new irrigation sources.

All our Ministers, the Chief Minister, the Revenue Minister, the Planning Minister and the Public Work Minister, were all pleased to come and visit to the flood affected areas and see what havoc has been wrought in the Krishna District. The loss is estimated to be about Rs. 2.0 crores. I would once again request the Government to take early steps to see that what is given by one hand is not taken away by the other hand on account of intervention nature of the P. W. D. subordinates.

SRI R. JAGANNADHAM:—

అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగమును నేను అభినందిస్తూ వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధిని గురించి కొన్ని సూచనలు ప్రభుత్వదృష్టికి తీసుకుని రాదలచాను. ప్రథమ

Sri R. Jagannadham:—

పంచవర్ష ప్రణాళికలోనూ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోనూ మన రాష్ట్రములో వెనుకబడిన ప్రాంతాలలో జరిగిన పనులను గురించి గవర్నరుగారి ప్రసంగములో చెప్పనందులకు వాటిని గురించి నేను కొన్ని సూచనలు ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. విశాఖపట్టణము జిల్లా ముఖ్యంగా చాలా వెనుకబడినజిల్లా. ఆ జిల్లాలో ప్రవహించే నదులు జీవనదులు కానందువల్ల, అక్కడ పండే పంటలు ముఖ్యంగా చెరుకు, వరి అయి ఉంటున్నవి. ప్రతిసంవత్సరము డిశంబరు నెల తరువాత వరిసశ్యములకు నీరుచాలక పోవడమువల్ల రైతులు చాల యిబ్బంది పడుతున్నారు. కాని అక్కడ ఉన్న గడ్డలకు, యీ నదులకు చిన్నచిన్న Reservoirs కట్టించి, నీటి సౌకర్యాలు కలుగజేయవలసిన అవసరమున్నది. జిల్లాలో రాకపోకల సౌకర్యాలు లేకపోవడంవల్ల జిల్లాలో రైతులు పండించిన సరకునంతను సుమారు 18, 20 మైళ్ళ దూరము మార్కెటుకు తీసుకొనిపోవలసి యుంటున్నది. ధాన్యము, చెరుకనగ, బెల్లం వగైరాలు విశేషంగా మార్కెటుకు తీసుకొని వెళ్ళవలసియున్నది. రోడ్డుసౌకర్యాలు, వైద్యసహాయము, రహదారిసౌకర్యాలు బొత్తిగా అనుకూలముగా లేవు. పేదప్రజలకు చాలా కష్టముగా ఉంటున్నది. ఆ జిల్లాలో ఎక్కువగా భూములున్నవారు చాలా తక్కువ. పేదప్రజలు మెండు. వైద్యసహాయముకొరకు పేదప్రజలు ఎక్కువగా యిబ్బంది పడుతున్నారు. డబ్బుగల భూస్వాములు ఏదోవిధముగా సౌకర్యములు పొందుతున్నారుగాని, పేదవాళ్ళకు బొత్తిగా అందడములేదు. దీనికంతటికి రహదారి సౌకర్యాలు లేకపోవడమువల్లనేనని అంటున్నాను. కాబట్టి ఆ జిల్లాలో వెంటనే రాకపోకలకు రహదారి సౌకర్యాలు, పంటలకుగాను నీటిసౌకర్యాలు, వైద్యసహాయము కలుగజేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇదివరకు ఎన్నోసార్లు యీ విషయము ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చాను. గోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలలో మాదిరి సమానంగా డెల్టాభూములకు ప్రభుత్వము వసూలుచేసే water rates మా జిల్లాలో గూడ వసూలుచేస్తున్నారు. నీటివసతులు వగైరా సౌకర్యాలు లేకపోగా ప్రభుత్వం యీ మాదిరి అన్ని కోస్తాజిల్లాలతోబాటు water taxes, Surcharges, Road cess వగైరాలు సమానస్థాయిలో పూర్తిగా వసూలుచేయడం అధర్మం అని మనవి చేస్తున్నాను. నా నియోజకవర్గం చోడవరం. అందులో 10, 15 మైళ్ళవరకు రోడ్డు District Board Road అయి ఉన్నది. ఈ రోడ్డుకు మరమ్మతులు లేవు. జిల్లా బోర్డు special officer కు యీ రోడ్డు మరమ్మతులు చేయించమని ఎన్నోసార్లు నేను స్వయముగా విన్నవించాను. కలెక్టరుగారితో గూడ చెప్పాను. యీ విషయమై ఇప్పటికి 7 సంవత్సరాలనుంచి రహదారి సౌకర్యాలు బాగుచేయించమని ప్రజలు కోరుతూ వస్తూంటే, యింతవరకు రోడ్డు బాగుచేయించడమనేది తలపెట్టడము లేదు.

Sri B. Rama Reddy:—

ప్రజలు చెప్పగా చెప్పగా, నేను కూడ స్వయముగా చెప్పగా, యీనాటివరకూ ఏవిధ మైన మరమ్మతులు చేయించలేదు. నేను యిక్కడికి వచ్చేరోజున కాబోలు రోడ్డు మరమ్మతు మొదలుపెట్టినట్లు కనబడింది. ప్రజలు సరుకులు యీనాటివరకు ఇరవై మైళ్ళ దూరములో ఉన్న అనకాపల్లి మార్కెటుకు తీసుకొని పోతున్నారు. మార్కెటు యింతదూరములో ఉన్న కారణముచేత, సరకులు సకాలములో చేరక పోవడమువల్ల, అమ్మకోటానికి వీలుపడక, నష్టపడి పోతున్నారు. మార్కెటుకు అందరితోబాటు సరుకులు తీసుకునివెళ్ళితేనే, సరుకులకు సరియైన ధర రాబట్టుకొన గలరు. లేకపోతే నష్టపడ్డమే జరుగుతున్నది. గ్రామయజమానులు సౌకర్యాలు చేయించ మని ముఖ్యమంత్రిగారితో చెప్పారు.

తరువాత గ్రామనౌకర్ల విషయము చూస్తే, ముఖ్యంగా తలయార్లకు Village Police అని పేరుపెట్టారు. వారు కడుపేదవారు. వారికి కనీసము రెండుసెట్లు dress లయినా సప్లయి చేయాలని అంటున్నాను. ప్రభుత్వం ఈ విషయంలో శ్రద్ధ వహిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri N. GOVINDARAJULU:—

అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగంపై తేబడిన వేమారెడ్డిగారి తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను. మన ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు విద్యాశాఖలో చేసిన కృషికిగాను వారిని కూడా అభినందిస్తున్నాను. ముఖ్యమంత్రి పన్నులు వెయ్యడములో చూపిన దక్షత ఖర్చుచేసేదానిలో చూపలేదని మనవిచేస్తున్నాను. వారు క్రిందటి మార్చిసమావేశ ములో ఈ సంవత్సరమునుంచి III ఫారంవరకు ఉచిత విద్యాసౌకర్యములు కలుగ చేస్తామని వాగ్దానము చేసినారు. కాని అమలుకు వచ్చేసరికి కొద్దిగా గారడీ జరిగింది. ఇప్పుడైనా ఈ III ఫారంవరకు ఉచిత విద్యను ఏర్పాటుచేసి తమ వాగ్దానాన్ని నిలుపుకొనవలెనని కోరుచున్నాను.

ఆంధ్ర ప్రభుత్వంవారు ఆర్థిక సమానత్వం తేవాలనే దృక్పథంతో అప్పుడే భూ సంస్కరణల బిల్లును తేనున్నారు. గాని అప్పుడే గారడీ ఏర్పడుతుందని ప్రజలలో కలవరం ఏర్పడింది. ఈ భూ సంస్కరణ బిల్లు ఆంధ్రలో 236 మంది రైతులకుమాత్రం వర్తిస్తుంది. వారి వద్దనుండి 2 లక్షల 80 వేల ఎకరాల భూమి విడగొట్టబడుతుంది. ఆంధ్రఅసలు వ్యవసాయదేశము. ఆర్థిక సమానత్వం కావలె

Sri N. Govindarajulu:—

నంటే ఇటువంటి బిల్లులు తీసుకురావలసి ఉన్నది. గాని 236 మందికి వర్తిస్తుంది అంటే అదిసమంజసముగా లేదు అని చెప్పవలసి ఉన్నది. ఆంధ్రదేశములో 100 కి 20 మందికి అయినా ఈ చట్టము వర్తించేటట్లు చెయ్యవలెనని కోరుచున్నాను. మన ఆంధ్ర శాసనసభలోను, కాంగ్రెసు పార్టీలోను ఎక్కువమంది భూస్వాములు ఉన్నందున ఈ భూ సంస్కరణల బిల్లుకు ఈ విధమైనగతి పడుతుందని అనుమానించకుండా, అపవాదులేకుండా చూడవలెనని ప్రభుత్వంవారికి మనవి చేస్తున్నాను.

నాగార్జునసాగర విషయములో కుడి కాలవకు 24,500 క్యూ సెక్కుల నీరు ప్రవహించేటట్లు చూడవలెనని ఖోస్లా కమిటీ సూచించగా ఇప్పుడు ఉన్నవారు అవసరంలేదు అక్కడి భూములకు రెండవ పంటకుకూడా 11000 క్యూ సెక్కుల నీరు చాలును అంటున్నారు. ఇందువల్ల అక్కడి రైతులకు కష్టముగా ఉంటుంది. అక్కడి భూమి రాతి ప్రదేశము కాబట్టి రెండుపంటలకు పనికిరాదు. కాబట్టి ఖోస్లా కమిటీ రికమండేషను ప్రకారము కాకపోయినా కనీసం 21000 క్యూ సెక్కుల నీరు అయినా ప్రవహించేటట్లు చూడవలెనని ప్రార్థిస్తున్నాను.

మా వినుకొండ తాలూకా చాలా వెనుకబడిన ప్రాంతము. అక్కడ రహదార్లు బాగుగా లేవు. క్రిందటి ఎన్నికలప్పుడు మన గోపాలరెడ్డిగారు కాంగ్రెసు అధ్యక్షుడుగాను, కాసు బ్రహ్మానందరెడ్డిగారు కార్యదర్శిగాను వచ్చి అక్కడి రహదార్లను చూచేరు. ఇప్పుడు వినుకొండ తాలూకాలో వినుకొండ ముప్పరాజువారి పాలెంమధ్య మట్టిరోడ్డు 8 సంవత్సరాల క్రిందట కరువుకాలంలో నిర్మించారు. ఇంతవరకు కంకర వెయ్యలేదు. కంకర వెయ్యవలెనని కోరుచున్నాను. గుంటూరు, నెల్లూరు, కర్నూలుజిల్లా ప్రజల సౌకర్యముకోసము గుండ్లకమ్మమీద బ్రిడ్జికట్టించవలెనని మనవి చేస్తున్నాను.

ఫారెస్టు డిపార్టుమెంటువారు మేకల కోసము ఫారెస్టు కొంత భాగము విడగొట్టి బ్లాక్కు ఏర్పాటుచేసి ఈ కష్టమైన సమస్యను తొలగించవలెనని మనవి చేస్తున్నాను.

వినుకొండ తాలూకాలో బావుల subsidy ఎప్పుడో బావులు పూర్తిఅయిపోయినా వసూలు చేస్తున్నారు. Wells Tahasildar పోయిన తరువాత రివెన్యూ తాసిల్దారు వచ్చి వాటిని తణఖీ చేయలేదు. కాబట్టి తక్షణం ఈ వసూలు నిలిపివెయ్యవలెనని కోరుచున్నాను.

Sri N. Govindarajulu:—

వినుకొండ తాలూకాలో ఒక్కటే హరిజన హాస్టలు ఉంది. దానిలో 34 మంది పిల్లలు ఉన్నారు. వారిలో 11 మంది బాలురకు గ్రాంట్లు మాత్రం ఇస్తున్నారు. సరి అయిన గ్రాంట్లు ఇప్పించ వలెనని పార్థిస్తున్నాను. ఈ అవకాశం ఇచ్చినందులకు స్పీకరుగారిని అభినందిస్తున్నాను.

Sri E. NAGAYYA:—

అధ్యక్షా, మొన్న గవర్నరుగారి ప్రసంగముపైన రెడ్డిగారు తీసుకువచ్చిన ప్రతిపాదనను బలపరస్తూ కొన్ని విషయాలు తమకు మనవిచెయ్యవలసిఉన్నది. మన ఆంధ్ర ఏరియాలో సుమారు 11 జిల్లాబోర్డులు ఉన్నవి. గవర్నరుగారి ప్రసంగములో కేటాయించిన మొత్తము 10 లక్షలు మాత్రమే. ఆ పదిలక్షలతో మనకు ఏమి imp-rovement జరుగుతుందో అనే అనుమానంపై నేను మాట్లాడదలచుకున్నాను. కారణం ఏమిటంటే; విశాఖపట్నం జిల్లాలో జిల్లాబోర్డువారు పూర్వము వేసినరోడ్లు ఇంతవరకు repair లేకుండా ఉండడముచేత 10 లక్షలు ఒక్క విశాఖ జిల్లాకే సరిపోదుఅని మనవిచేస్తున్నాను.

తరువాత గవర్నరుగారి ఉపన్యాసములో పెద్ద పెద్ద ప్రాజెక్టుల విషయమై కొంత amount ప్రత్యేకింపబడినట్లు కన్పిస్తున్నది. కాని విజయనగరం, బొబ్బిలి ఎస్టేట్లలో మైనరు ఇర్రిగేషను చెరువుల మరామత్తు గురించి ఏమీ కనబడలేదు. వీటి ripairs గురించి కొంత ప్రత్యేకించితే రైతులు పండించుకొనేందుకు అవకాశం ఉంటుంది కాబట్టి ఇప్పుడైనా కొంత amount ఏర్పాటు చెయ్యవలయును. ఆంధ్ర areaలో కొన్ని employment exchange offices ఉన్నవి. పనిలేని వారికి ఈ ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీలద్వారా పనులు సెక్యూరు చేస్తారని గవర్నరుగారి ప్రసంగములో ఉన్నది. ఇప్పుడు ఎక్స్ఛేంజి వారు కొంతమందివ్యక్తులను recommendచేసి హిందుస్థాన్ షిపియార్డు వారికి కాల్టెక్సు వారికి పంపితే వారిని తీసుకొనకుండా పైన Direct recruitment చేస్తున్నారు. అట్లా జరుగకుండా చెయ్యవలెనని మనవిచేస్తున్నాను.

ఇక labour విషయంచూస్తే labour union అంటూ కొంతమంది వ్యక్తులు contractors తో combine అయి contract పద్ధతిలో labour union నడిపిస్తున్నారు. ఆ labour unions అన్యాయముగా నడువకుండా చేయడానికి గవర్న

మెంటు ఒక labour కమిటీని ఏర్పాటుచేసి అన్యాయాలు జరుగకుండా కాపాడ వలసిందని నేను మనవి చేస్తూ సెలవుతీసుకుంటున్నాను.

Sri B. RAMA REDDI:—

అధ్యక్షా, గవర్నర్‌గారి ప్రసంగమంతా చూస్తే జరిగినది ఏదో అప్ర సంగములోవుంది. కాని జరుగనున్నదనే విషయంమాత్రము ఎక్కడా అగుప లేదు. కనుక గతమును తలచుకుంటే ఏమి ప్రయోజనంలేదని నా అభిప్రాయం. అధ్యక్షులవారు యిచ్చిన స్వల్ప వ్యవధిలో విషయాలన్నిటినీ విపులీకరించమంటే సాధ్యముకాదు. Headings చదివే పద్ధతికి రావలసి యున్నది. కాబట్టి సాధ్య మైనంతవరకూ తగ్గించుకొని మాట్లాడదలచుకున్నాను. గవర్నర్‌గారి ప్రసంగము వరుసలో చూస్తే మొదట రైతులమీద పడుతుంది. అది ధాన్యాల ధరలను అరి కట్టడమే. భారతదేశము వ్యవసాయికదేశమని అందరమూ ఒప్పుకుంటున్నాము. వ్యవసాయానికి సిరస్సుతో సమానమైనవాడు రైతు. రైతులకు సంబంధించినంత వరకూ పన్నులు వేసే దానిలో మాత్రము శ్రద్ధవుంది కాని రైతురక్షణ యందుఅంటే అది మాత్రము శూన్యము. రైతులు పండించిన పంటకు ధర తగ్గించినట్లయితే వారిపైన వేసే పన్నులు ఏవిధంగా కట్టుకొనగలరనే విషయాన్ని ముఖ్యమంత్రిగారు కాని ఇతర ప్రభుత్వ అధినేతలు కాని గమనించినట్లులేదు. ముఖ్యమంత్రిగారు రైతు కుటుం బానికి చెందివుండికూడా రైతుపైన ఇటువంటి దండయాత్ర చేయడము ఎందుకో నాకు అర్థముకాకుండావుంది. మరొకటి కూడా వారికి మనవి చేయదలచుకున్నాను. దేశానికి సిరస్సుగా వున్న రైతురక్షణ మానుకొని మిగతాహంగులన్నీ చేసినట్లయితే సిరస్సును కడగాబెట్టి, మొండానికి అలంకారముచేసినట్లు వుంటుం మోనని నేను భావిస్తున్నాను. కాబట్టి ధరలు స్థిరీకరణకు వచ్చేవరకు రైతుకు సేద్యానికి సంబం ధించిన వస్తువుల ధరలను కూడా హద్దులో పెట్టడానికి కొంచెము శ్రద్ధవహిస్తే బాగుంటుందేమోనని వారికి సలహా యిస్తున్నాను. ఇక ముఖ్యమైంది వ్యవసాయానికి సంబంధించిన నీటి పారుదల. దానివిష యమై గవర్నర్‌గారు తమ ప్రసంగములో గొప్ప గొప్ప ప్రాజెక్టుల మధ్యతర గతి ప్రాజెక్టుల విషయమై ప్రస్థావించినారు కాని ముఖ్యంగా కొండప్రాంతా లలో వున్నటువంటి బీదప్రజలకు సంబంధించినంతవరకూ minor irrigation projects విషయమై వారు ప్రస్తావించకపోవడము. ఇది ముఖ్యమైన విషయమనే సంగతిని గవర్నర్‌గారు మరచిపోవడము శోచనీయంగా వున్నదని కూడా చెప్పుతూ వున్నాను. రవాణా సౌకర్యాలకు కేంద్ర రోడ్డునిధి సహాయముతో

కొండ ప్రాంతాలలో వున్నవాటికి కూడా రోడ్ల నిర్మాణానికి యిచ్చే పథకము తయారు చేయమని కోరుతున్నాను. బద్వేల్ తాలూకాలో చెర్లోపల్లి valley లో వుండేవారు లంకలో వున్నట్లు వున్నారు. కేంద్రనిధి సహాయంతో అక్కడ రోడ్డు నిర్మించే దానికై P.W.D. మంత్రిగారులేరు. ముఖ్యమంత్రిగారికి కొంచెము శ్రద్ధ వహించమని మనవి చేస్తున్నాను. ముఖ్యంగా సాంఘిక సంక్షేమశాఖ మనజీవితవ్యవస్థలో ప్రధానమైంది. అటువంటి సాంఘిక సంక్షేమశాఖలో ఏదేదో చేసినారని అన్నారు. గవర్నర్‌గారు సాంఘిక సంక్షేమ పథకములో అంత అభివృద్ధి లేదనికూడా చెప్పి వున్నారు. సంఘానికి ఏ విషయాలు ముఖ్యమైనవో ఆలోచించలేకుండా వున్నారు. మనకు ముఖ్యంగా సంఘానికి తలవంపులు కల్గించేటటువంటిది, విచారకరమైనటువంటిది సిగ్గు కల్గించవగునటువంటిది సంఘములో వున్న భిక్షుక సమస్య. యీ నాడు అంతముఖ్యమైన సమస్యపైన కూడా ప్రభుత్వముయొక్క దృష్టి కేంద్రీకరింపబడ దములేదు. ఎందుకో తెలియడంలేదు. కేవలము పొట్ట కూటి కోసమువ్యభిచార వృత్తిలో వుండినటువంటి స్త్రీల సముద్ధరణకు ఏపాటి శ్రద్ధకూడా వహించతములేదు.

THE HON. Dr. B. GOPALA REDDI :—

బిల్లు తెస్తున్నామండీ.

Sri. B. RAMA REDDI:—

సంతోషము. త్వరలో వారిని సముద్ధరించమని నేను ముఖ్యమంత్రిగారికి ప్రార్థనా పూర్వకంగా మనవి చేసుకుంటున్నాను. ఇపుడు దేవదాసిబిల్లు తీసుకొస్తున్నాము. సినిమాలలో అర్ధనగ్న దృశ్యాలు మరీ విచిత్రమైన దృశ్యాలు చూస్తే సినిమాలను ఎందుకు నిషేధింప కూడదో నాకు అర్థము కావడంలేదు. విద్యాభ్యాసము విషయమై మన బ్రహ్మంగారు చెప్పినారు దొంగపేరు పెట్టుకొన్న వాండ్లను మన్నించమని. విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించవచ్చును. గాని ఆకారణాన దగాను మాత్రము ప్రోత్సహించవద్దని నేను మనవి చేసుకుంటున్నాను. గ్రామాలలో Hospitals పెట్టే అంతవరకు mobile vans పెట్టి గ్రామీణులకు వైద్యసహాయం చేయమని మనవి చేస్తున్నాను. ఇక జిల్లాబోర్డువుంది. దానికి సలహా సంఘాలు పెట్టినారు. యీ సలహా సంఘాలను పెట్టేదానికంటే జిల్లా బోర్డులను పూర్తిగ తీసివేయడం మంచిది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక వుంది. దానిలో చాలమంది అధికారులున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదము కావాలంటే అందులోవున్న అధికారులను సేవాతత్పరత కలిగిన వారినివేస్తేనే తప్ప జీతముకోసము వున్నవాండ్లనువేస్తే ఏమీ

Sri B. Rama Reddi:—

ప్రయోజనము వుండదు. ఇక ప్రజలను నాయకులుగా చేయడానికి శిక్షణ కేంద్రాలు పెట్టుతున్నారు. యీ Scheme జయప్రదము కావాలంటే ముందు గ్రామాలలో కక్షలు పోవాలి. యీ శిక్షణ తరగతులు నామ్కేవాస్తే తరగతులవుతాయి కాని వీటి వల్ల ఏమీ ప్రయోజన ముండదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదం కావాలంటే సేవాతత్పరులైన officers ను వేసి గ్రామాలలో కక్షలు లేకుండాచేస్తేసాధ్యపడు తుందని మనవి చేస్తూ యీ అవకాశమిచ్చినందులకు ధన్యవాదాలు అర్పిస్తు సెలవు తీసుకుంటున్నాను.

Sri. P. VENKATARAVANAPPA :—

అధ్యక్ష మహాశయా, ఈ తృతీయ సమావేశ సందర్భమున గవర్నరుగారిచే గావింపబడిన ఉపన్యాసాన్ని నేను హృదయపూర్వకంగా అభినందించుచున్నాను. ప్రభుత్వానికి కొన్ని సూచనలు చేయదలచాను. ఇదివరలో నామిత్రులు కొందరు ఆహారధాన్యాల ధరలు, రైతులు పండించు ఇతరవస్తువుల ధరలు హెచ్చినవనియు, వాటి ధరలు స్థిరీకరణ చేయవలసిందని కోరారు. అయితే ఇప్పటి పరిస్థితులలో రైతులకు కావలసిన ప్రతివస్తువు, ముఖ్యంగా గుడ్డ, ఇనుప పనిముట్లు వగైరాల ధరలు ఎక్కువగా ఉన్నాయి. వాటిని రైతులకు సరియైన ధరలకు అందుబాటులో ఉండేటట్లు ప్రభుత్వంవారు చేయలేదు. అందువల్ల రైతులు పండించు పంటలకు ధరలను తగ్గించిన ఎడల రైతులు, కూలీలు, జాస్తిగా ఉండే ప్రాంతాలలో దెబ్బ తిందురు. కాబట్టి ప్రభుత్వంవారు తగుచర్య తీసుకొని రైతులకు కావలసిన ఇనుప సామగ్రిని, ఇతరవస్తువులను సాధ్యమైనంతవరకు సరసమైన ధరలకు అందుబాటుగ్గ ఉండేటట్లు చేయవలెనని ప్రభుత్వం వారిని కోరుతున్నాను. మనదేశం ముఖ్యంగా వ్యవసాయంపై ఆధారపడి ఉందే విషయం అందరికి తెలిసినదే. వ్యవసాయానికి గాను మన దేశంలో వ్యవసాయ దార్లు పశువులమీద ఆధారపడి ఉన్నారు. పశువులపైన ఆధారపడి ఉండడంవల్ల మన దేశంలో పశు సంపద హెచ్చిన గాని మనం వ్యవసాయంలో అభివృద్ధి పొందలేము. కాబట్టి ఈ పశుసంపద ఏ విధంగా పెంపొందించవలెను? ఇందుకుగాను మేతకు పచ్చిక బయళ్ళు ఉండవలెను, అదీగాక వాటిని సంరక్షించుకొనుటకు గాను అనేకమైన పశువైద్యశాలలు కావలసి యున్నవి. అయితే దురదృష్టవశాత్తు మన దేశంలో ఇపుడు ఉంచబడిన వైద్యశాలలు చాల తక్కువ అని మనవిచేయవలసి యున్నది. కాబట్టి ప్రభుత్వంవారు ఇప్పటికైనా శ్రద్ధవహించి కనీసం ప్రతి ముఖ్య గ్రామంలోను పశువుల ఆసుపత్రులు ఏర్పాటు

చేసి, సౌకర్యములు కలుగజేసి పశు సంపదను పెంపొందించవలసినదిగ ప్రార్థించుచున్నాను. మరియు మా అనంతపురం జిల్లాలో ఏ ప్రాజెక్టుయొక్క ఫలితాన్ని పొందుటకు మార్గాలులేవు. కొన్ని మెట్టతాలూకాలు హిందుపురం, పెనుకొండ, మడకసిరా వగైరా తాలుకాలకు ఈ తుంగభద్ర కాల్వయొక్క ఫలితంకూడ అందుబాటులోలేదు. ఇక్కడ మెట్ట తాలుకాలలో ఎండిపోయినటువంటిచెరువులు, చిన్నచిన్న కుంటలు, కట్టకాల్వలు అనేకములున్నాయి. ఇవికూడా చాల తెగిపోయి శిథిలములై ఉన్నవి. ప్రభుత్వంవారు శ్రద్ధవహించి, వాటిని మరామ్మతు చేయించి వర్షం వచ్చినపుడు ఆనీటిని నిలువచేసుకొని తద్వారా పంటలు పండించుకొనుటకుగాను చర్యతీసుకోవలసినదిగ కోరుతున్నాను. ఈ తాలుకాలలో కనీసం 50, 60 అడుగులలోతు వరకు త్రవ్వినభావులు అనేకములు ఉన్నాయి. కపిలద్వారా ఈ భావులనుండి నీరు బయటికి తీస్తున్నారు. ఈ కపిలతో నీళ్ల తోడడం చాల కష్టమైనవని. ఇందుకుగాను కనీసం మూడు జతల ఎద్దులు కావలసి ఉంది. కాడిఎద్దులు కనీసం 5, 6 వందల రూపాయల వెల చేస్తుంది. సాధారణమైన రైతుకు ఇటువంటి కష్టతరమైన పని చేయుటకు సాధ్యంకాదు. ప్రభుత్వంవారు భావులు అనేకంగా ఉండే తాలూకాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసి ఈ రైతులను ప్రోత్సహించవలెనని కోరుతున్నాను.

మరియు మన దేశాభివృద్ధికి ప్రభుత్వంవారు అవలంబించు చున్నటువంటి పథకములు పద్ధతులు మిక్కిలి అమూల్యములైనవి. అయితే అవి ఆచరణలోనికి వచ్చేటప్పటికి ప్రజలు నిరాశచెందు తున్నారు. దీనికి కారణం ఏమంటే అమలు జరుపుట ప్రారంభించేసరికి ఇందులోగల ఉద్యోగస్తులు కొంతమంది లంచగొండితనమునకు పాల్పడి ప్రభుత్వానికి అయ్యే ఖర్చుకు తగినంత ఫలితం రైతుకు అందజేయలేక పోతున్నారు. కాబట్టి దయవుంచి ప్రభుత్వంవారు ఈ విషయమై తగు చర్యలు తీసుకొని ప్రజలకు ఉపకారము గావింతురని ప్రభుత్వంవారిని ప్రార్థించుచున్నాను.

Mr. SPEAKER:—The House will now rise for lunch and meet again at 2-30 p. m.

After lunch—2-30 p. m.

Sri B. RATNASABHAPATHY

అధ్యక్షా ! శ్రీ వేమారెడ్డిగారు గవర్నరు address విషయమై ప్రతిపాదించినటువంటి thanks giving motion నున్నా, నేను support చేయలేక పోయినందులకు చాల విచారిస్తున్నాను. ఈరోజు ఆంధ్రదేశంలో కొత్త కొత్త సమస్యలు

ఎదుర్కొంటూంటే వాటి ప్రశంసను కొంచమైనా గవర్నరు అడ్రసులో సూచిస్తారని మనమంతా ఆశించాము. కానీ అటువంటి వాటినిగురించి దేనినిగూడా వారు ప్రస్తావించక పోవడం చాలా నిరాశాజనకంగా ఉన్నది. అందులో ప్రత్యేకించి అటువంటి సమస్యలో. ఈరోజు ఆహార ధాన్యాల ధరలు మితిమీరి పెరగడం, వాటిని గురించి కేవలం ఒక సూచనగా మాత్రం ప్రశంస చేశారుగానీ ఎక్కువగా ధరలను తగ్గించడానికి, అంతకంటే ఎక్కువ పెరగకుండా అరికట్టడానికి వారు చేయబోయే ప్రయత్నాలేమిటో వారు అందులో సూచించలేదు. కాకపోతే ధరల పెరుగుదలను మాత్రం సూచిస్తే వాటిని మేము watch చేస్తున్నామని మాత్రం తెలియచేశారు వారు దేనిని watch చేస్తున్నారు? ధరలు పెరుగుతూ ఉంటే watch చేస్తున్నారా లేక వారు వేరేఏమన్నా చేస్తున్నారా, అన్న విషయమును మాత్రం వారేమీ ప్రస్తావించలేదు. ఇప్పుడు ఆహార ధాన్యాలు పండినప్పటినుంచి అంటే జనవరినెలలో వరికోతలను పట్టినప్పటినుంచి, ఇప్పటివరకూ పెరిగినటువంటి ధరలను చూస్తే సుమారు నూటికి నూరు పాళ్ళు ఎక్కువగ పెరిగినయి. జనవరిలో ఈ ఆహార ధాన్యాల price index 329 points ఉంది. June నాటికి 429 వరకూ పెరిగింది. అవి మనప్రభుత్వం అందచేసినటువంటి figures. తరువాత Retail ధరలనుబట్టి చూస్తే ఆ రోజులలో ఒకబస్తా ధాన్యం 13 రూ. 14 రూ. కు అమ్మకం అయి ఉంటే ఈరోజు అవే retail market లో బియ్యం ధరలు 63 రూపాయల వరకూ పెరిగింది. ఆ రోజులలో బియ్యం 30 రూపాయల వరకూ అమ్మకం అవుతూ ఉంటే ఈరోజు సుమారు 8 మాసాలు జరగటంవల్ల అప్పటికీ ఇప్పటికీ 30 రూపాయలుధర పెరిగింది. ఈ ధరను ఏ విధంగా అరికట్టాలనే సూచనను ఇందులో సూచించలేదు. అంతేకాకుండా ఈ ధరలు పెరగటంవల్ల చిన్న రైతులకే కాకుండా పెద్దరైతుల కైనను ఏమన్నామేలు కల్గిందా అంటే ఏమిలేదు. అట్లామేలు కల్గి ఉంటే సంతోషించేవాళ్లం. ఆ రోజులలో వాళ్లు పండించిన ధాన్యాన్ని అవసరనిమిత్తం తక్కువ ధరలకు అమ్మకంచేశారు. వాటిని పెద్దపెద్దరైతులు, ధనమున్నవాళ్లు, డబ్బు లున్న వ్యాపారస్తులుకొనేసి, అప్పుడేవాటిని market లకు వదలకుండా hoard చేసి, ధరలను పెంచే అవకాశాన్ని చూపించారు. ఆ విధంగా ఆ రోజులలోకూడా consumers కుఅందచేసి నటువంటి ధాన్యానికి ధరలు పెరగటం, వాళ్లు అందుకొఱకై కొంత అందోళన జరపడం, రైతులకు ధరలు తగ్గటం వారు అందోళన చేయటం ఈ విధంగానే ఈ 8 మాసాలూ జరుగుతూ వచ్చింది, కానీ ప్రభుత్వం అలా పెరిగే ధరలను అరికటి consumers కు కొనుగోలు దార్లకు అందుబాటులో

నుండే ధరలను, ఇటు ఉత్పత్తి చేసేవారికి అనుకూలమైన ధరలను సిద్ధపరచి ఒక పథకాన్ని తయారుచేసి, శాశ్వతంగా (Inflation) ధరలు పెరగటాన్ని అరికట్టి రైతులకు, ఇటు consumersకూ మేలును చేకూర్చే అవకాశాన్ని కల్పించే పథకాన్ని ఇంతవరకూ తయారుచేయలేదు.

మనం ఈ విధంగా చేయుటవలన మధ్యవర్తులు, ధనవంతులు, వ్యాపారస్థులు ఈ అవకాశాన్ని పురస్కరించుకొని రైతులను దోపిడీ చేస్తున్నారు. ఈవిధంగా జరుగుతోంటే ప్రభుత్వం పరిశీలిస్తుందని గవర్నరుగారు ఉపన్యాసంలో చెప్పారు. దీనిని అరికట్టడానికి చర్యలు తీసుకొనుటలేదు. ప్రభుత్వం ఇట్టి చర్యలను అరికట్టడానికి పూనుకొనేవరకు ఈ అక్రమములు జరుగుతూనే వుంటాయి. ఇప్పుడైనా ప్రభుత్వంవారు శ్రద్ధవహించి దీనిని అరికట్టుటకు ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. మన ప్రభుత్వం 2సం॥ క్రిందట నియమించిన land commission ఒక నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. దానిలో చాలా అమూల్యమైన విషయాలున్నాయని గవర్నరుగారు ఆ నివేదికను ప్రశంసించారు. వ్యవసాయకూలీల సమస్యలను పరిశీలించి అవి పరిష్కరించుటకు తగిన మార్గాలను చూపించనంతవరకు అది సంపూర్ణమైన నివేదిక కాజాలదు అని ఇదివరకు మన పెద్దలంతా చెప్పారు.

1948 సం॥లో జె. సి. కుమారప్ప అధ్యక్షతన నియమించిన అగ్రేరియన్ కమిటీవారు అగ్రికల్చర్ లేబర్‌కు సంబంధించిన సమస్యలకు పరిష్కారమార్గం చూపించనంతవరకు అది సంపూర్ణమైన నివేదికకాదని చెప్పియున్నారు. సుబ్రమణ్యం కమిటీవారు కూడా అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఒక నివేదిక సమర్పించారు. ఆ కమిటీ రిపోర్టులోకూడా Agriculture Labourను గురించి పేర్కొన్నారు. వారు కొన్ని సూచనలు చేశారు. లక్కరాజు సుబ్బారావుగారి రిపోర్టులో మాత్రం వారిని గురించి ఏమీ కనబడదు. Agriculture labourను గురించి ఒక్క విషయంకూడా లేకపోవడం హాస్యాస్పదంగా వుంది. మన దేశంలో సుమారు 41 లక్షలమంది కూలీలు వున్నారు. ఇంతపెద్ద జనాభాగల వారి సమస్యలను పరిష్కరించుటకు మార్గాలను సూచించకపోవడం చాలా విచారకరం. ఈ labour సంఖ్య సమయానుకూలంగా ఒక్కొక్కప్పుడు ఎక్కువ కావడం, ఒక్కొక్కప్పుడు తగ్గుతూ ఉండడం వ్యవసాయపు పనులు లేనిరోజుల్లో వారికి కూలి దొరక్కపోవడం మున్నగు వారి కష్టములను మనం చూస్తూనే ఉన్నాము.

గవర్నరుగారి ప్రసంగంలో వారిని గురించి ఏమిలేకపోవడం చూస్తే చాలా విచారంగా వుంది, ఇటువంటిలోపాలు గవర్నరుగారి ఉపన్యాసంలో చాలా ఉన్నాయి. అందుచే నేను వారిని అభినందించలేక పోతున్నాను.

SRI P. BASI REDDI: Mr. Speaker, Sir, the Governor's Address gives quite an imposing list of the achivements of the Government since the formation of this State. They are really substantial achievements of which the Government could well feel proud. I am however concerned for the time being with the achievements of the Government in the backward areas of the State, especially the famine striken area of Rayalaseema. I express my gratitude on behalf of Rayalaseema for all what the Government has done for the betterment of this area. During the last one hundred years of the British regime, nothing like a developmental work has been done in this unfortunate part ofthe State. But since the advent of the Congress regime, especially after the formation of Andhra State, we have been seeing all round development in this area. We have now got a university of our own, an Engineering College, a training college and we are likely to get a medical college; we are told we are getting a polytechnique too; and the four districts of Rayalaseema can now boast of an arts college; several high schools have been started in this area after the advent of the Congress regime and a much larger number of elementary schools have also been opened. Of course, there is still great need for more high schools in the area. I understand the Government has only made a provision for 30 schools or so for the entire State during the second Five-Year Plan. I submit that this is quite inadequate and 30 Schools would not be sufficent even for Rayalaseema. I therefore urge that a much larger number of high schools may be provided in the Second Five-Year Plan.

In regard to communications also, appreciable progress has been registered. A number of causeways have been constructed on all the important roads in Rayalaseema area and some bridges also have been constructed, most important of them being the bridge over Pennar near Chennur, It is being constructed at a cost of Rs. 25.0 lakhs and it is gratifying to note that it will be completed are long. By and large the condition of the roads also has been improved appreciably. I understand that the allotments made for the maintenance of roads during the current year is very inadequate and I am afraid, if that is correct, the condition of the roads may suffer serious deterioration. I therefore urge upon the Government to find out ways and means to make increased provision for maintenance of the roads. Of course, the condition of the district board roads is as bad as ever, if not worse. The present hopeless financial position of the district boards cannot make it possible for them to improve the roads. There are still some important roads under the control of the district boards, Of course, the Government are gradually taking over these roads to highways, but I am afraid the pace of this process is rather tardy. I appeal to the Government that these important roads should be taken over by the Highways Department in the quickest possible time. The argument of financial difficulty may be advanced by the Government and that plea has become ubiquitious nowdays. My answer is, the taxes have been multiplied at a very fast rate and they can multiply a little more to meet the needs such as the present.

Then, Sir, what is most gratifying, so far as the Rayalaseema area is concerned, is the execution of irrigation projects in the frequently famine stricken area of Rayalaseema. The most important project, so far as this

area is concerned is the Tungabhadra High Level Canal. It runs entirely through the worst famine areas of Rayalaseema and it is likely to be taken up on hand very soon. Several medium size projects have also been executed in that area. There is also the widening of the K. C. Canal. And all these projects cover a major portion of the famine area of Rayalaseema and they are likely to irrigate about 5 lakhs of acres and eliminate famine from a considerable area.

The Government have been resorting to increased taxation measurs. Of course, nobody can dispute the need for these measures in view of the Five-Year Plan. But the Government should create a proper atmosphere for reception of these taxation measures. They should first try to eliminate the inequalities in the taxation measures. I refer to one glaring inequality, i. e. water tax on lands under river channels and spring channels. I have been referring to this subject as often as I had occasion to speak in this House. But the Government do not seem to have moved in this matter. The one correct step so far they have taken in this direction is the land revenue standardisation proposal that is likely to come before this House very soon. But even under this proposal, watertax on lands under river channels does not seem to have been touched at all. Of course they have made an exemption in favour of lands under river channels so far as the enhanced land revenue is concerned. I submit, Sir, it is not enough. The Government should do away with the tax completely and then place all the lands covered by this tax under the appropriate class of lands for being dealt with under the enhanced land revenue proposal. I thank you, Sir, for having given me this opportunity.

Sri C. SUBBARAYUDU:—అధ్యక్షా, నేను శ్రీ వేమారెడ్డిగారు ప్రతిపాదించినటువంటి తీర్మానాన్ని బలపరుస్తున్నాను. శ్రీ గవర్నరుగారి ప్రసంగంలో తుంగభద్ర ఎగువ కాలవనీటి పంప

కాన్ని గురించి వారు సంతోషాన్ని వెలిబుచ్చారు. ఆ పంపకంలో ఆంధ్ర రాష్ట్రానికి 65 వంతులు, మైసూరు రాష్ట్రానికి 35 వంతుల చొప్పున ఒప్పందం కుదిరినట్లు చెప్పారు. ఎగువ కాలవ నీరు పారుదల అయ్యేటటువంటి ప్రాంతంఇదివరకే investigate చేసి ప్లానింగ్ కమీషన్‌కు పంపించినారని, ఆయకట్టు విషయంలో తగాదాలు ఉండవని హామీ ఇవ్వడంకూడా జరిగింది. అయితే 65 వంతులు; 35 వంతులు అనే భాగ పరిష్కారం ఆంధ్ర రాష్ట్రానికి న్యాయం జరిగిందా? లేక అన్యాయం జరిగించా అనేటటువంటి విషయం గురించి చెప్పక తప్పదు. వాస్తవానికి 65 వంతులు అనేది మనకు న్యాయమైనటువంటి వాటాకాదు. ఈ ఎగువకాల్వ నీరు పారుదల అయ్యేటటువంటి ప్రాంతం, ఇతరనీటి సదుపాయములు లేనటువంటి ప్రాంతం గండికోట ప్రాజెక్టునీరు పారుదలయ్యే ప్రాంతానికి ఎగువ భాగమున ఉండేటటువంటి ప్రాంతంలో దాదాపు 2 లక్షల ఎకరాలు ఈ scheme నుంచి మినహాయింపబడినాయి. తాడిపత్రి తాలుకాలో పెన్నకు ఉత్తర భాగమున గల యాడికి ప్రాంతము తక్కున వర్షపాతము ఉన్నటువంటి ప్రాంతము. 100కి 6 వంతుల భూమిసాగు జరుగుతున్నప్పటికి 50 వేల ఎకరాలు ఆయకట్టులో చేర్చే అవకాశం ఉన్నప్పటికి ఆ ప్రాంతము ఈ scheme నుంచి మినహాయించ బడింది. ముద్దనూరు ప్రాంతంలో కూడా 80 వేల ఎకరాల ఆయకట్టునుండి మినహాయించబడింది. ధర్మవరం, అనంతపురం తాలుకాలలో కూడా మినహాయించబడింది. మన Deputy chief Minister ఎగువ కాలవ గురించి చాల శ్రద్ధతీసుకొన్నారు. ఇది ఎంత తొందరగా తెచ్చుకొంటే అంత మంచిదనే అభిప్రాయంతో investigation పూర్తి కాకమునుపే p'annig comnssion కూడా మెకంజీ investigation ను ఆధారంగా తీసుకొని పెన్నార్ గండికోట ప్రాజెక్టు యొక్క Previous investigations ఆధారంగా తీసుకొని 4 లక్షల ఎకరాలు అయతేర్చి పంపించినటువంటి కారణముచేత ఇంకా ప్రాంతాలకు పారుదల కావడానికి అవకాశం ఉండేటటువంటి ప్రాంతం ఈ scheme నుంచి మినహాయించ బడింది. బళ్లారి ప్రాంతం మైసూరు ప్రభుత్వానికి పోయిందన్న విషయం అందరికి తెలుసు. చిత్రావతి, పెన్న, పాపాఘ్ని నీటిని ఏనాటికైనా ఉపయోగానికి తీసుకు వస్తారు: ఆ నీటి పంపకాన్ని గురించి తగాదాలు పెడతారనేటటువంటి విషయమై ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడే ఆ సూచనలన్నీ అవుపడ్డాయి. కనుక ఆనాడే స్థానికంగా ఉండేటటువంటి నీటిని లెక్కపెట్టకుండా వాటి గుండా పారుదల అయ్యేటటువంటి ప్రాంతాల్ని మినహాయించి ఇతర ఆధారము లేనటువంటి ప్రాంతాన్నంతా ఈ scheme క్రిందికి తెచ్చి

ఉంటే ఈనాడు ఈ దౌర్భాగ్యపుస్థితి పట్టేదికాదు. మద్రాసుకోస్తా అంతటిలో వర్ష పాతము తక్కువగా ఉండి ఇతర ఆధారము లేనటువంటి ప్రాంతాన్ని ఈ scheme నుంచి మినహాయించ వలసినటువంటి దౌర్భాగ్యము మనకు పట్టి ఉండేది కాదు. ఎగువ కాలవ వస్తుందనే సంతోషమే గాని న్యాయం మాత్రము జరగటం లేదు. ఇప్పుడు ఈ పంపకంలో 80 వంతులకన్న తక్కువ వచ్చింది. మైసూరు రాష్ట్రంలో 72 మైళ్లనుంచి మన ప్రాంతానికి వచ్చేటటువంటి కాలువ యొక్క capacity ని తగ్గించడం తటస్థిస్తుంది. ఇప్పటికైనా దీనిని మార్చడానికి అవకాశం ఉంటే ప్రయత్నం చేయడంగాని లేక తుంగభద్ర నీటి పంపకంలో మనకు వచ్చేటటు వంటి వాటాలో దిగువకాలవలకు కావలసిన నీటిని తగ్గించినట్లయితే 80వేల ఎకరా లకు అదనంగా నీరు పారుదల అవుతుంది. అటువైపు హైద్రాబాద్ భాగం కూడా కలసి ఒకే రాష్ట్రంగా ఏర్పడింది కనుక వానిని గూడా మినహాయింపుచేసి దిగువ కాలువకు సంబంధించిన వాటినికూడా రాజులబండ ఆనకట్టగుండా 80 వేల ఎకరాలకు పారుదల చేసి అక్కడనుండి ఎగువ కాలవకు పారుదలచేసి మినహాయింప బడిన ప్రాంతాలను అందులో చేర్చినట్లయితే శాశ్వతమైన పరిష్కారం కాగలదు. ప్రభుత్వానికి ఎన్నోమార్లు ఈ విషయమై representation చేయడం జరిగింది. కాని ఇంత వరకు ఏమి చేశారో, మాకు అర్థం కాకుండా ఉన్నది. ఈ అవకాశంకూడా పోయి నట్లైతే, ఒక మారు కాలువ capacityని నిర్ణయంచేసి దాని lining అంతా చేయక పోయినట్లైతే ఇకముందు వస్తుందనేటటువంటి ఆశకూడా ఉండదు. ఇప్పటికైన ప్రభుత్వము దీనిని గురించి శ్రద్ధ తీసుకొని ఒక long range plan పెట్టుకొని శాశ్వతమైన పరిష్కారం చేయవలెనని మనవి చేస్తున్నాను. 4, 5 మాసాలు reservoirలో నీరు surplus గా ఉంటుందనేటటువంటి విషయం previous investigation, report, ఇప్పటి investigtion report చెప్పుతున్నాయి 4 వేల క్యూసెక్కుల capacity ఉన్నదల్లా lining చేసినట్లయితే 6 వేల క్యూసెక్కులు అవుతుంది. ఆ 4,5 మాసాల surlus period లోను నీరు క్రిందకుపోయి కృష్ణలో కలిసేదానికి బదులు reservoir కట్టినట్లయితే ఈ ప్రాంతమంతా పారుదల చేయ డానికి అవకాశం ఏర్పడుతుంది. దీనినిగురించి శ్రద్ధ తీసుకోవాలని ప్రభుత్వానికి ఎన్నిమార్లు చెప్పినా, కాలువ వచ్చిన తర్వాత చూద్దామన్న దృక్పథమే ఈ ప్రమా దానికి దారి తీసిందని మాత్రము చెప్పకతప్పదు. ఈ అవకాశం కూడా పోయినట్లైతే దీనికి ఆంధ్రప్రభుత్వమును నడిపిన పెద్దలే బాధ్యులు అవుతారు. తొందరగా తెచ్చు కుందామనే ఆతురతతో ఈ పొరపాటు జరిగింది. ఇప్పటికైనా సరిదిద్దుకొని న్యాయం కలుగచేయాలని మీ ద్వారా ప్రభుత్వానికి మనవిచేస్తున్నాము.

Sri C. RAMASWAMI REDDI:— అధ్యక్షా, శ్రీ పేమారెడ్డిగారు ప్రతిపాదించిన తీర్మానమును నేను బలపరుస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగంలో Planning కు సంబంధించినంతవరకు ఏవో కొంత విశదీకరించారు. అయితే Local Development works మాత్రము చాలా మంద కొండిగా జరుగుతున్నాయి. రెండు, మూడు సంవత్సరముల క్రిందట ప్రారంభించిన schools అసంపూర్తిగానె ఉన్నాయి. ఇటీవల కేంద్ర ప్రభుత్వంవారు ఈ Local Development works ను ఆపవలసిందని circular పంపించినట్లుగా అక్కడ జిల్లా Planing అధికారులు చెప్పుచున్నారు. ఈ circular వల్ల ఇటువంటి స్థానికాభివృద్ధి కార్యక్రమాలు కూడ అసంపూర్తిగా నిలచిపోయి, ఇదివరకు ఖర్చుపెట్టిన మొత్తము కూడ కేవలము నిష్ప్రయోజన మగుచున్నది, కాబట్టి ఈ L. D. works త్వరగా ప్రారంభించేటట్లు circular జారీచేయవలసిందని కేంద్రప్రభుత్వాన్ని కోరవలసిందని ఈ ప్రభుత్వాన్ని కోరుతున్నాను. Planning కు సంబంధించినంతవరకు, Village level workers అని, Social Education Organaizers అని ఇంకా అనేక రకాలైన officersను వేస్తున్నారు. ఇదంతా ఈ officers కేవలం వృధాగా డబ్బు తినేసే పద్ధతిగానె ఉన్నది గాని ప్రజలకు దీనియొక్క సత్ఫలితాలు అందడం లేదని ఈ సభవారి దృష్టికి తీసుకు రావలచుకున్నాను. Village level workers కు కేవలం educational qualifications అవసరం లేదని నా అభిప్రాయము, గ్రామాలలోని ప్రజలలోకి వెళ్లి, వారిని ఉత్తేజపరచి, ప్రజలలో సహాయ సహకారాన్ని కలుగజేయుటకు కావలసిన జ్ఞానము ఈ Village local workers కు కావలసియున్నదని నా ఉద్దేశము. కనుక దీనికి విద్యార్హతలు ఏమాత్రము అవసరంలేదని నా ఉద్దేశము. అనేక మంది యువకులు ఈ శక్తి సంపన్నులు. విజ్ఞానముగల యువకులు ప్రజలను educate చేయగలవారు ఉండగా, S. S. L. C వారు Intermediate వారు కావాలని అటువంటి విద్యార్హతలు కలవారినే తీసుకోవడం చాలా అసమంజసంగాను, అసమర్ధకంగాను ఉన్నది. వీరికి విద్యా అర్హతలు ఉండవలసిన అవసరం లేదు గనుక ప్రభుత్వము ఈ విషయాన్ని విచారించవలసిందని కోరుచున్నాను.

తరువాత Madras Educational Rulesను మార్చి, ఇదివరకు Headmaster కు ఉన్న discretion ను D. E. O. లకు ఇచ్చారు. ఏ విద్యార్థికైనా కొద్దిమార్కులు తక్కువ వచ్చినవో, అతనిని promote చేసేటటువంటి అధి

Sri C. Ramaswamy Reddy:—

కారము, ఆ discretionary power, D. E. O. కు ఇచ్చివేశారు. ఆ విద్యార్థి యొక్క శక్తి, సంపన్నము, విజ్ఞానము ఆ Headmaster కే తెలుసును గాని D. E. O. S కు తెలియదు. కనుక ఈ discretionary powerను Headmasters కే ఇవ్వాలని కోరుతున్నాను.

తరువాత గుంటూరులో లాంఫారం వద్ద ప్రభుత్వ Veterinary college కట్టుటకు estimates అన్నీ ఇదివరకే ప్రభుత్వమునకు వచ్చాయి. కాని ఎందుకనో ఇప్పుడు అది sudden గా మారిపోయిందని తెలుస్తున్నది. దానికి లాంఫారం చాలా అనుకూలంగా ఉన్నది. అంతేకాకుండా గుంటూరుకు ఆరుమైళ్ళ దూరములో. main roadలో ఇదివరకే అక్కడ ఒక Live stock Research station ఉన్నది. కాబట్టి ఇది ఒక ప్రత్యేక అర్హతగాకూడ ఎంచి, అక్కడనే ఈ Veterinary college పెట్టడం మంచిదని, దీనికి తగిన చర్యలు వెంటనే తీసుకోవలసిందిగా కోరుతున్నాను.

అటు తర్వాత, ఇటీవలను, ఇప్పుడు కూడా ఘోరాతి ఘోరంగా జరుగుతున్న వరదల ప్రమాద నివారణను గురించి మనమేదో ఈ అసెంబ్లీలో కూర్చొని మామూలు ధోరణిలో అజాగ్రత్తగా చూస్తున్నట్లుగా కన్పిస్తున్నది.

Mr. SPEAKER:-You will have another chance to speak on that. We will have a separate debate on it.

Sri. C. RAMASWAMI REDDI:- ఇకపోతే, నాగార్జునసాగర్ ఆనకట్టలో సత్తెనపల్లితాలూకాలో కొంతభాగము, గుంటూరు తాలూకా, ఈ ప్రాంతాలు మినహాయించబడినవని ఈ సభవారికి ఇదివరకే అనేక సందర్భాలలో చెప్పిఉన్నాము. అవకాశము అందుబాటులో ఉండి కూడా ఈ రెండు ప్రాంతాలను మినహాయించడం చాలా అన్యాయంగా ఉన్నది. కాబట్టి సాధ్యమైనంతవరకు ఈ ప్రాంతాల వారికి కూడా ఈ వసతి కలుగజేయవలసిందిగా కోరుతూ ఈ అవకాశము కలుగజేసి నందుకు అధ్యక్షులవారికి నా ధన్యవాదాలు.

SRI T. GOPALAKRISHNA GUPTA:— అధ్యక్షా, మదనపల్లి Sub Division నుంచి 6, 7 మంది శాసనసభ్యులు ప్రత్యేక కారణములచేత ఈ సమావేశానికి ఇప్పటివరకు రాని కారణంచేత నాకు అయిదు నిమిషాలు కాలము ఎక్కువ ఇవ్వవలెనని మిమ్ములను ప్రార్థిస్తున్నాను.

శ్రీ వేమారెడ్డిగారు తెచ్చినటువంటి అభినందన తీర్మానాన్ని నేను బలపరుస్తూ, సాంప్రదాయసిద్ధంగా గవర్నరుగారిని అభినందిస్తున్నాను. గవర్నరుగారు వారి ప్రసంగంలో చాలామట్టుకు ఇప్పటివరకు చేసినటువంటి అభివృద్ధికరమైనటువంటి పనులూ, చేయబోయేటటువంటి కార్యక్రమాలను గురించి కూడ విపులంగా తెలియ పరచారు. అయితే ప్రతిఒక్కరికి కూడ తన వీపు తనకు కనపడదు అన్నట్లుగా వెనుకబడినటువంటి ప్రాంతాలను గురించి, ఆ ప్రాంతాలవారికి కన్పడకుండా ఉండ వచ్చును. లేక వాటిని గురించి వారు మరచిపోయినారేమో తెలియదు. అంతేకాక ప్రతినిత్యము చచ్చేవానికి ఏడ్చేవారెవరు అన్నట్లు ఎప్పుడూ కూడా క్షామముతో బాధ పడుతున్నటువంటి ప్రాంతాల గురించి ప్రత్యేకంగా ప్రస్తావించవలసినటువంటి అవ సరం కనపడలేదేమో వారికి అనుకొంటాను. ముఖ్యంగా చిత్తూరుజిల్లాలో, 8, 9 లక్షలు ప్రజానీకముతో కూడినటువంటి మదనపల్లి Sub Division లో 1946వ సంవత్సరంనుంచి వర్షాలు లేవు. ముఖ్యంగా పేదలకు, కాయకష్టము చేసుకొని జీవించేవారికి జీవనోపాధి లేక బాధపడుతున్నారు. పనిలేక, కూలిలేక ఉపవాసాలు ఉంటున్నారు. అటువంటి పరిస్థితులలో ముఖ్యంగా వారికి ఏదైన ఒక పని కల్పించ వలసినటువంటి బాధ్యత ప్రభుత్వానికి ఉన్నదని నాయొక్క అభిప్రాయము. నేడు వరదలతో ఏవిధంగా ఒకవైపు బాధపడుతున్నారో అదేప్రకారంగా నిత్యము, అను దినము మా ప్రాంతములో ప్రజలు బాధపడుతున్నారు. అటువంటి ప్రజలకు సహా యము చేయవలసినటువంటి బాధ్యత ప్రభుత్వముపైన ఉన్నదని నా అభిప్రాయము. అక్కడ ముఖ్యంగా ప్రజలకు పని కల్పించేందుకుగాను కనీసం ఈ జాతీయవిస్తరణ ప్రణాళికలనైనా ప్రవేశపెట్టవలసిందని ప్రార్థిస్తున్నాను. కనుక Community Project సమీపములో ఉన్నటువంటి లేదా ఆనుకొని ఉన్నటువంటి ప్రదేశాలలో ఈ జాతీయ విస్తరణ ప్రణాళికలను ప్రభుత్వము వెనువెంటనే ఏర్పాటుచేస్తారని ఆశిస్తు న్నాను. ఎట్లా అయినప్పటికినీ ఈ Community Project కు ఆనుకొని ఉన్నటు వంటి మదనపల్లి తాలూకాలో ఈ జాతీయ విస్తరణ ప్రణాళికలను వెంటనే అమలు జరుపవలెనని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను. మరిన్ని, నేను ఇదివరకు చెప్పి నట్లుగా ఇక్కడ మాకు 15, 20 సంవత్సరాలకు ఒక్కసారి కొద్దిగా వర్షము పడు తుంది. కాబట్టి పశువులకు త్రాగేదానికి నీళ్ళు కూడా లేవు. చెరువులకు మరమ్మతులు చేయడం లేదు. Minor Irrigation కు ఇచ్చినటువంటి డబ్బు చాలా కొద్దిగా ఉన్నది. కాబట్టి ముఖ్యంగా ఈ Minor Irrigation పనులకు ఎక్కువపైకము మంజూరుచేయవలెనని ప్రార్థిస్తున్నాను. ఇదివరకు ప్రతితాలూకాలోను, త్రాగేనీళ్ళకు

గాను కొన్ని కొన్ని బావుల పనులు తీసుకొనేవారు, కాని ఇప్పుడు Intensive Water Rural Supply Scheme క్రింద ఒక్కొక్క తాలూకా మాత్రము తీసుకొంటున్నారు. మా తాలూకాలో 1 మైలు, 1½ మైళ్ళు, ¾ మైలు దూరము నడచి త్రాగేనీరు తెచ్చుకొనేటటువంటి పరిస్థితులు మాత్రం పోలేదు. కాబట్టి ఈ ప్రాంతంలో ఆ Intensive Water Supply Scheme అయినా పెట్టవలెనని కోరుతున్నాను.

తరువాత, మదనపల్లి పట్టణములో Electric Thermal Station ఉన్నది. కాని, "ఆవు మాత్రము మీ ఇంటిలోనే ఉండనీ పాలుమాత్రము పితుకొని పోతాము" అన్నట్లుగా దానియొక్క ఉపయోగము మా తాలూకాకు లేకుండా బయట ఉపయోగపడుతున్నది. ఈ త్యాగానికి మేము ఒప్పుకొంటున్నాము గాని తన్నుమాలిన ధర్మము అవుతుందేమోనని భయముగా మాత్రము ఉన్నది.

మరిన్ని, కొద్దిగా చదువుకొన్నటువంటి నిరుద్యోగుల సంఖ్య కూడ ఎక్కువగా ఉన్నది. రాయలసీమలో ఒక Poly-technic School పెడతామని అంటున్నారు. విజ్ఞాన కేంద్రమైనటువంటి మదనపల్లిలోనె ఆ poly-technic Institution పెట్టవలసిందని కోరుతున్నాను.

జమీందారీ abolition అయిన తరువాత, Estatesలో forest lines వేస్తున్నారు. ముఖ్యంగా మదనపల్లి పుంగనూరు తాలూకాలకు సంబంధించి, ఇప్పుడు వేస్తున్నటువంటి boundariesవల్ల తీరనినష్టము కలుగుతుందని అనేకమార్లు ముఖ్యమంత్రిగారు ఆ port folio లో ఉన్నప్పుడు గూడా చెప్పుకొన్నాము. ఆ విషయం గురించి వారు శ్రద్ధతీసుకొనవలెనని కోరుతున్నాను. ఇప్పటికి సుమారు నూరు సంవత్సరములుగా మా ప్రాంతములోని ప్రజలలో ఒకరైలుమార్గము గురించి ఒక అభిప్రాయము ఉంటూ ఉన్నది. ఒంగోలునుండి పొదిలి, బద్వేలు, కడప, మీదుగా మదనపల్లి బెంగుళూరు సిటీకి రైలుమార్గము వేయవలెనటువంటి అభిప్రాయము ప్రజలలో ఉన్నది. అది వేయడంలో, వెనుక బడినటువంటి ప్రాంతాలలో పండేటటువంటి పదార్థాలకు, ముడివస్తువులకు రవాణా సౌకర్యము ఎక్కువ ఉంటుందని, ముఖ్యంగా అజ్ఞాన వంతులుగా ఉన్నటువంటి ప్రజలలో ఎక్కువ జ్ఞానోదయము కలిగించేందుకు అవకాశాలు ఏర్పడతాయని అనుకొంటున్నాము. అయితే మా తాలూకాలోగాని, మా జిల్లాలోగాని, ఎవరూ మంత్రులు లేరు. అయినప్పటికీ కూడా, తక్కిన వారితో పాటు మమ్ములనుగూడా న్యాయమైన దృష్టితో

చూచి ముఖ్యమైనటువంటి ఈ రహదారిని కేంద్రప్రభుత్వానికి సిఫార్సు చేయవలసిందని నేను కోరుతూ ఉన్నాను.

తరువాత co-operative institutions కు controlled cammidities కు Building Societies కు గాను సిమెంటు, ఇనుము సప్లైలేకుండా, రైతులకు బండ్లకట్లు లేకుండా చాలాబాధపడుతున్నారు. వాటినిగురించి కూడా తక్షణమే చర్యలు తీసుకోవలసిందని ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI SHAIK MAHAMMAD RAHAMATHULLAH:— అధ్యక్షా, శ్రీగవర్నరుగారి ప్రసంగమును బలపరుస్తూ కొన్నివిషయాలలోమాత్రము నేను ప్రభుత్వముదృష్టికి తీసుకొనిరావలచుకున్నాను. మురుగుపారుదల పథకముమీదనే ముఖ్యంగా రెండుమాటలు చెప్పవలచుకున్నాను. ప్రభుత్వముతెచ్చిన పథకము చూస్తే యిప్పటికినాలుగు పనులు మాత్రమే ప్రారంభించి యున్నారు. ఒక్క విశాఖ పట్టణము పూర్తిఅయింది. రెండవది విజయవాడ ప్రారంభించబోతున్నారు మూడవది ఏలూరులో కూడ ప్రారంభించబోతున్నామని చెబుతున్నారు. అందులో ముఖ్యంగా కొన్ని జిల్లాల మునిసిపాలటీలలో Anti-Malaria scheme ను పెట్టి చాలా మటుకు డబ్బు ఖర్చు చేస్తున్నారు. కడప జిల్లాకూడా మలేరియా ఉన్నప్రాంతమే. యీ Anti-malaria scheme ను పరిశీలించుటకు 1946 వ సంవత్సరములో 3600 రూపాయలు ప్రభుత్వము ఉత్తరువు ప్రకారము allot చేశారు. ఇప్పటికి 1956 వ సంవత్సరము జరుగుచున్నది. ఇంతవరకూ ఆస్కీమును గురించి ఏమాత్రముకూడా పరిశీలించనేలేదు. ఏమి అయిందిన్నీకూడ తెలియడము లేదు. Malaria అని చెప్పినట్లయితే, దానికి ఆఫీసర్లను వేయాలి అని అన్నప్పుడు, కడపకుపోవాలి అని అంటే పోయి పనిచేయటానికి భయపడుతున్నారు. ఇంతేకాకుండా మూడు నాలుగు చోట్లలో ప్రారంభిస్తున్నామని గవర్నరుగారి ప్రసంగములో చెప్పబడి యున్నది. అందులో ఒకటి కడప జిల్లాకూడ తీసుకుంటారని ఆశిస్తున్నాను. ప్రభుత్వము కడప జిల్లానుగురించి శ్రద్ధ తీసుకోవటానికి ప్రార్థిస్తున్నాను.

రెండవది Pumping Irrigation అనేది కాకినాడలో ఒకటి, వుయ్యూరులో ఒకటి ఏర్పాటుచేశారు. విశాఖపట్టణములో ఒకటి మొదలుపెట్టబోతున్నారు. రాయలసీమలో కూడ మొదలుపెట్టుతామని చెప్పారు. Rationing పెట్టినప్పుడు కూడ రాయలసీమలోఉన్న అన్నిజిల్లాలలో కల్లా కడపజిల్లాయే సెంటరుగా ఏర్పాటుచేసి

యున్నారు. ఇటు కర్నూలుగాని, అటు నెల్లూరుగాని, చిత్తూరుగాని, అనంతపురం గాని, ఎటుచూచినా కడపకు 120 మైళ్ళదూరములో ఉన్నవి. కడప యీ జిల్లాల కన్నింటికి మధ్యగా ఉన్నది కాబట్టి దీనికి సంబంధించిన పాఠశాల కడపలోనే తప్పకుండా స్థాపించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత విద్యను గురించి కొంతమంది సభ్యులు చెప్పారు III Form వరకూ బాలురకు, బాలికలకు అందరికి గూడ ఉచిత విద్య నేర్పించుతామని మొదట్లో చెప్పారు. ఇప్పుడు అది మార్చి ఒక్క బాలికలకు మాత్రమే III form వరకు ఉచిత విద్య అని అంటున్నారు. మొదట్లో చెప్పినట్లుగా III form వరకూ అందరికి ఉచిత విద్య యిప్పించాలి. మునిసిపాలిటీలకు Tollgate compensation క్రింద, Entertainment tax క్రింద యిచ్చే సొమ్ము పూర్తిగా తీసుకుంటామని అంటున్నారు. ఆ విధముగా చేసేటప్పుడు ప్రభుత్వము మునిసిపాలటీల నుంచి కూడ మొదట సంవత్సరము బాలురకు I form వరకూ అన్నప్పుడు కంపెనేషనులో మూడవవంతున్నూ, రెండవ సంవత్సరమున II form అన్నప్పుడు, ⅔ మూడవ వంతున్నూ, మూడవ సంవత్సరము III form అంటున్నప్పుడు పూర్తిగాను తీసుకుంటే బాగా ఉంటుందని నా అభిప్రాయము. ఇంతేకాకుండా ముఖ్యమంత్రిగారు ఆలోచించవలసిన విషయము మరొకటి ఉన్నది. కడపలో Muslim Orphanage ఉంటున్నది. అది యిప్పటికి చాలా ఏండ్లుగాఉన్నది. అందులో ఉండే పిల్లలుతల్లిగాని, తండ్రిగాని లేనివాళ్ళు. తల్లితండ్రులు లేని యీ Orphans ను పోషించాలంటే చాలా కష్టతరముగా ఉన్నది. దినమునకు ఒక్కొక్కరికి కనీసము నాలుగు అణాల విలువగల అన్నము పెట్టాలని నెలకు 7,8 రూపాయలు యిస్తున్నారు. ప్రభుత్వం గంజి కేంద్రాలు ఏర్పాటుచేశారు. అవి యిప్పుడు పోయినప్పటికినీ, యీ Orphanages మాత్రము పోలేదు. నెలఒకటింటికి ఒక్కొక్కరి 7,8 రూపాయలు యిస్తే, యీ రోజులలో తిండి గింజలు వగైరాలకు ఖరీదులు ఎక్కువైనప్పుడు, యీ సొమ్ము ఏమి సరిపోతుందో ఆలోచించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈ నాటి ఖరీదులను బట్టి ఒక్కొక్కరికి కనీసము 15 రూపాయలైనను యిస్తే, కొంతవరకు సౌకర్యముగా ఉంటుంది. ఈ orphans కడుపునిండా తిండి తినగలరు. అట్లా చేయకపోతే, ప్రభుత్వము యీ పిల్లలకు అర్ధభోజనమే పెట్టుతున్నట్లవుతుంది ఇతర జాతుల విద్యార్థులకు 15 రూపాయలకు తక్కువ యివ్వడములేదు. ఆ విధముగా చూచినా, వీళ్ళకు గూడ 15 రూపాయలు యివ్వమని ప్రభుత్వాన్ని వేడుకొనుచున్నాను.

ప్రభుత్వము యీ Orphans మీద దయయుంచి, వీరికి యిప్పుడు యిచ్చే డబ్బును 15 రూపాయలవరకు పెంచమని కోరుతున్నాను. అధ్యక్షులవారు నాకు యీ అవకాశము యిచ్చినందులకు కృతజ్ఞుడను వారికి నా అభివందనములు అర్పిస్తూ విరమిస్తున్నాను.

SRI M. BAPINEEDU:— అధ్యక్షా, గవర్నరుగారు చేసిన ప్రసంగములో నాకు ఏమి హెచ్చుగా కనబడలేదు. ఇదివరకు చెప్పిన పాతపాటలే మరల యీ ప్రసంగములో కనబడ్డవి. అయితే సుమారు రెండు సంవత్సరములనుంచి మనము ఈ ఎసెంబ్లీలో ఉన్నప్పటికినీ administration లో మార్పేమీ కనబడలేదు. అంతా పాతపాటలు, పాతపంథాయే. ఏవిచూచినా పాతలెక్కలే కనబడుతున్నవి. అక్కడ ప్రజలందరు వరదలమూలంగా చచ్చిపోతున్నట్లుగా Revenue Inspectors, Tahsildars, డిప్యూటీ కలెక్టర్లు పాతరిపోర్టులు యిస్తూ, పాత పంథాలో అంతా వెనుకటి bureaucratic element, redtapism పోనివ్వకుండా, అంతా మునిగిపోతున్నట్లుగా రిపోర్టులు పంపడము తగ్గలేదని చెప్పటానికి నాకెట్టి సందేహములేదు. అయితే కొత్తగా యీ అయిదు సంవత్సరాలలో వచ్చిన కలెక్టర్లు I.A.S. officers కూడ తోడు అవుతున్నారని చెప్పటానికి సందేహము లేదు. మరీ, ఎక్కువగా రెండు సంవత్సరాలను ంచిగోలపెట్టుతున్నారు ప్రజలు. ఈ I.C.S. లు, I.A.S.·లు Secretariat లో files ను బాగా dispose of చేయగలరేగాని. వీరు జిల్లాలలో పనిచేయటానికి ఉపయోగించరు. ప్రజలకు వొత్తిగా ఉపయోగము లేదు. జిల్లాలలో administration సరిగా నడపలేరు. వీరు ఎక్కువగా ఆఫీసులలో ఉపయోగిస్తారు. ప్రజలయొక్క సౌకర్యాలు బొత్తిగా ఆలోచించరు. ప్రజలకు ముఖ్యంగా కావలసిన irrigation facilities యివ్వలేనిస్థితిలో ఉన్నారు. ప్రజలయొక్క యిబ్బందులు పాటించరు. పోనీ కనీసము తెలుసుకోటానికైనా ప్రయత్నించరు. ఈ విషయము వారికి బొత్తిగా బోధపడడము లేదు. అయితే ఈ సందర్భములో ఒక్క ఉదాహరణ మాత్రము చెప్పదలచుకొన్నాను. పశ్చిమగోదావరి జిల్లాలో మొన్న వచ్చిన వరదలను గురించి కలెక్టర్లు వ్రాసిన రిపోర్టులలో పదివేల ఎకరాల నష్టము అయింది అని వ్రాశారనుకొండి. కాని నిజంగా ఆయాప్రదేశాలకు వెళ్ళి చూస్తే, నేను స్వయముగా వెళ్ళి చూచాను కూడా—పదివేల ఎకరాలు కాదు 20 వేల ఎకరాలలో పంట నష్టము అయింది. నేను స్వయముగా చూచాను గనుక నేను నిజస్థితి తెలుసుకోగలిగాను. కలెక్టర్లు వ్రాసిన రిపోర్టులు వాస్తవమైనవి

కాదు. కారణమేమిటంటే Revenue Inspectors, Tahsildars వ్రాసిన రిపోర్టులమీద ఆధారపడి కలెక్టర్లు ప్రభుత్వానికి తమ రిపోర్టులు పంపిస్తున్నారు. ఈ రిపోర్టులలోని విషయములు, లెక్కలు సరియైనవి కావని చెప్పటానికి సందేహములేదు. వాస్తవముగా అక్కడ రైతులయొక్క భూములు ఎంతవరకు మునిగిపోయినవి ఒక్కొక్కరికి పంట ఎంత నష్టమయింది. అని, యిటువంటి విషయాలు అన్నీ కలెక్టర్లు స్వయముగా వెళ్ళి చూడకుండా రిపోర్టులు ప్రభుత్వానికి పంపితే, అవి ప్రభుత్వము నమ్ముతున్నది, మిగతా విషయాలు చూస్తే, ప్రభుత్వోద్యోగులలో యింతవరకు corruption అనేది పోనేలేదు. పోలీసువారికి prohibition అప్పగించామని ప్రభుత్వం సంతోషిస్తున్నదేగాని, యిందులో యిదివరకటికంటే improvement ఎక్కడా కనబడదు. మరింత చెడిపోయిందని చెప్పగలను. Police Department లోగాని, P.W.D లోగాని corruption తగ్గలేదు సరికదా, ఉన్నచోటున అయినా ప్రభుత్వము గమనించి punish చేయడము లేదు. పెద్దపెద్ద ఆఫీసర్లే corruption తో మునిగి తేలుతున్నారు, వీరిని ఏమిచేయటానికినీ వీలులేకుండా పోతున్నది. ప్రభుత్వ కార్యకలాపాలలో మరింత విలంబన జరుగుచున్నది. ఎవరైనా పెద్దమనుషులు వెళ్ళి మొరపెట్టుకున్ననూ, వారిని లక్ష్యపెట్టడము లేదు. ప్రజల యిబ్బందులు గమనించకపోయిన తరువాత, యిక యీ ఆఫీసర్లు ఉండి ప్రయోజనము లేదు. మొన్న ఈ మధ్య మన ముఖ్యమంత్రిగారికి యీ విషయాలన్నీ చెప్పాను. వారు విచారించి action తీసుకుంటానని మాత్రము చెప్పారు. తప్పకుండా శ్రద్ధతీసుకుంటారని ఆశిస్తున్నాను.

తరువాత ప్రాంతీయ బోర్డులు అని పెట్టుతున్నారు. Medical colleges విషయములో కూడా ఒక దానిని ఏర్పాటుచేశారు. ఇవి చాలా అసంతృప్తిగా పని చేస్తున్నవి. వ్యక్తిగతాభిమానములతోనూ, ప్రాంతీయాభిమానములతోను పని జరుగుచున్నది. వారు చేసేది అంతా అన్యాయమేనన్నట్లుకన్పిస్తున్నది. సర్కారు జిల్లాలలో 330 మార్కులు వచ్చినవారికి యీ కాలేజీలలలో సీట్లుయివ్వక, రాయలసీమ జిల్లాలలో 235 మార్కులు వచ్చిన వారికి సీట్లు యిచ్చారు. రాష్ట్రములో అందరినీ సరిసమానముగా చూడవలసిందిగాని, యీ ప్రాంతీయబోర్డులు ప్రాంతీయ దురభిమానముతో పనిచేస్తున్నవి. ముందుముందు రాబోయే నవంబరు నెలనుంచి యింకా పెద్దగోల అవుతుందని నా అభిప్రాయము. ఈ కాలేజీలలో సీట్లు యిచ్చే విషయములో మాత్రము చాలా అక్రమాలు, అన్యాయాలు జరుగుతున్నవి. ప్రభుత్వము

యిదంతా గమనించి ఆవిధముగా జరగకుండా అరికట్టించాలని అంటున్నాను. రాష్ట్రములో మాత్రము చాలామందికు అసంతృప్తి బయలుదేరింది. విద్యార్థులయొక్క parents లోగాని, విద్యార్థులలోగాని చాలా అసంతృప్తి ఏర్పడ్డది. 335 మార్కులు వచ్చినవారికి సీట్లు రాకపోవడమేమి? 235 మార్కులు వచ్చినవారికి రావడమేమి? ఇందులో ఉన్న లోపము ప్రభుత్వము గమనించాలని అంటున్నాను. ఇందులో మాత్రం న్యాయము జరగడము లేదు. ప్రభుత్వం యిది గమనించాలి.

తరువాత పన్నుల విషయములో చూస్తే, యీ ఎసెంబ్లీ ఏర్పడ్డ తరువాత పన్నులు పూర్తిగా అనేక రూపములలో పెంచివేశారు అయితే యీ పన్నుల హెచ్చింపుకు alternative సౌకర్యాలు ప్రభుత్వము కలుగజేస్తారని ప్రజలు ఎదురు చూడడము లేదు. కాని ప్రభుత్వం కొంతవరకు మంచి చేశారని చెప్పవచ్చు. అదేది అంటే ఎరువులు మాత్రము కోఆపరేటివ్ డిపార్టుమెంటు ద్వారా ప్రభుత్వము సప్లయి చేస్తున్నది. అవి మాత్రము సక్రమంగా అందుతున్నవి. ఇదికూడ కోఆపరేటివ్ డిపార్టుమెంటుకు hand over చేసిన తరువాతనేనని గట్టిగా చెప్పగలను. కాని ఒక్కవిషయము మాత్రము ప్రభుత్వం గమనించవలసి ఉంటుంది. నిరుటి పాత ఎరువులు అక్కడక్కడ అమ్ముతున్నారు. ఇది వాస్తవము అవునోకాదో విచారించవచ్చును. ఈ పాత ఎరువులు private dealers చేతులలో ఉన్నవి. ఈ విషయము రిపోర్టు చేయబడ్డది. ఎరువుల ఫ్యాక్టరీలు యితరరాష్ట్రములలో కట్టుతున్నారు. మనరాష్ట్రములో ఒక్కటి అయినాలేదు. మనము హైద్రాబాదు వెళ్లిన తరువాతనైనా ఒకచోట యీ ఫ్యాక్టరీ ఏర్పాటుచేస్తే, మనది ముఖ్యం వ్యవసాయము చేసే రాష్ట్రముగనుక, మనకు ఎక్కువ ఉపయోగముగా ఉంటుంది. ప్రజలకు యీ ఎరువులు అందుబాటులోనూ, చౌకగాను దొరికితే చాలా సంతోషిస్తారు. విశాలాంధ్ర ఏర్పాటుజరిగే విషయములో ఎక్కువగా ప్రాంతీయాభిమానములతో జరుగుతున్నట్లు మన ప్రధానమంత్రి anouncement వల్ల తెలుస్తున్నది. అడుగుఅడుగుకునూ తగాదాలు కనబడుతున్నవి. విశాలాంధ్ర ఏర్పాటులో ఎవరి మటుకు వారు జాగ్రత పడవలసిన అవసరం ఉంటుందని చెప్పటానికి సందేహములేదు. ఇంకా అనేక విషయములు మాట్లాడవలెనని నేను అనుకున్నాను. కాని టైము అయిపోయి నందున నాకుయిచ్చిన యీ కొద్ది సావకాశమునకు అధ్యక్షులవారికి అభినందనలను అర్పిస్తూ సెలవుతీసుకుంటున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU:— అధ్యక్షా, గవర్నరుగారి ఉపన్యాసము, గవర్నమెంటు సాధించిన విజయాలు అన్నికూడా క్రోడీ

రించి పబ్లిషుచేసిన రిపోర్టుగా తయారయింది. మొదటినుండి తీసుకొని ఏవేవి సాధించిందో వ్రాసుకువచ్చేరు. దానితోపాటు గవర్నమెంటు ఏమేమి సాధించలేక పోయిందో real picture వ్రాస్తే బాగా ఉండేది. ప్రభుత్వ ప్రకటనలుగాని గవర్నరుగారి ప్రసంగములో ప్రజలకు educative value ఇచ్చేటట్లు ఉండవలెను. గ్రామాలకుపోయి చూస్తే ఇంకా ఏమీ జరగలేదని వారి పార్టీసభ్యులే మంత్రిగారివద్దకు తిరిగి రావచ్చును. గవర్నరుగారి ఉపన్యాసములో అనేక విషయాలు ఉన్నవి అని చెప్పినా కూడా సభ్యులందరు వారి వారి అభిప్రాయములు తెలియచేసినపుడు ప్రజలలో ఉన్న అసంతృప్తి ఏవిధముగా ఉన్నదో మాట్లాడవలసిన అవసరం వచ్చింది.

ఈ విజయాలలో మొదట విశాలాంధ్రవచ్చిందన్నారు. ఆంధ్రప్రదేశ్ అవతరించబోతున్నది. ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత ఎప్పుడు విశాలాంధ్ర ఏర్పడుతుందని ఆశించినాము. విశాలాంధ్ర ఆంధ్రప్రదేశ్‌గా రూపొందింది ఈ నవంబరు ఒకటవ తేదీన ఏర్పడబోతున్నందుకు ఈ ప్రాంతములో అన్ని పార్టీలవారు అభినందించుకొనవలసి ఉన్నది. పార్టీ విభేదాలు లేకుండా అన్ని పార్టీలవారు కూడా విశాలాంధ్ర కావలెనని అనుకొన్నాము. ఏవిధమైన reservations లేకుండా capital కావాలని అడగలేదు. హైకోర్టు కావాలని అడగలేదు. అన్నికూడా హైద్రాబాదులో ఉండవలెనని అన్నాము. అందరము కూడా విశాలాంధ్ర కావలెనని కోరినాము. అయితే రంగాగారు మాత్రము విశాలాంధ్ర ఎందుకు అన్నారు.

SRI D. KONDIAH CHOWDARY:- వారు అసెంబ్లీలో లేనప్పుడు వారిని attack చెయ్యడం న్యాయంకాదు. వారు అలా అనలేదు. కావాలంటే ప్రత్యక్షముగా వారితో సంప్రతించండి.

SRI PILLALAMARRI VENKATESWARLU:- అలా అంటే ఏమి లాభము There are facts. వారితో చర్చించవలసిన అవసరం నాకు మాత్రం లేదు.

మొత్తముమీద యావత్ ఆంధ్రదేశము విశాలాంధ్ర సాధించుకొనగల్గినందులకు చాలా సంతృప్తి వెల్లడిచేస్తున్నాను. ఈనాడు ఆంధ్రప్రదేశ్ ఒక భాషారాష్ట్రముగా ఉద్భవించినందున ఏవిధమైన తగాయిదాలు లేకుండా పోయింది. ఆ విధముగా కాకుండా ఈనాడు బొంబాయిలో చూస్తే ద్విభాషారాష్ట్రం ఇవ్వడంవల్ల అక్కడ అహమ్మదాబాదులో, కాల్పులు, అనేకమంది చనిపోవడం జరుగుతూ ఉంది. భాషారాష్ట్రాలే సరైన నిర్మాణపద్ధతి అని రుజువైనది. బీహారు, బెంగాలు ముఖ్యమంత్రులు

బీహారు బెంగాలు మెర్జరు కావాలని కోరినారు. గాని అసెంబ్లీలో పార్టీ అభిప్రాయాన్ని చూచి భాషారాష్ట్రాన్నే ఏర్పాటు చెయ్యవలసి వచ్చింది. అదేవిధముగా కేంద్ర ప్రభుత్వము కూడా బొంబాయిరాష్ట్రాన్ని మళ్ళీ విభజించుతారని ఆశించుచున్నాను. ఇప్పుడు ఉందే అల్లరి అసంతృప్తి లేకుండాచేస్తారని పూర్తిగా ఆశిస్తున్నాను. అక్కడ జరిగిన కాల్పులకు మనమందరము బాధపడవలసినదే అని నేను తెలియజేస్తున్నాను.

తరువాత మన ప్రభుత్వం హైద్రాబాదు ప్రభుత్వంతో కొన్ని agreements చేసుకొని వచ్చింది తప్పనిసరే. దానికేమీ కూడా మనము ఆక్షేపణ చూపవలసిన పని లేదు. గాని ఒక విషయము ఉన్నది. 5వ పాయింటు. అక్కడ ఉన్న legislature కి ప్రాంతీయసంఘానికి తగాయిదా వచ్చినప్పుడు గవర్నరుతీర్పు final అని చెప్పడము ఏమాత్రం సరిగాలేదు. ఆ provision మార్చడానికి ప్రయత్నంచెయ్యవలెను. ముఖ్యమంత్రిగారికి ఈ సూచన చేస్తున్నాను.

ఇంకొక విషయము మద్రాసు ప్రభుత్వంతో సరిహద్దుల నిర్ణయానికి ప్రయత్నం చేసినా సాధించలేకపోయినాము. మనప్రభుత్వం తీసుకొన్న వైఖరి Border Disputes ఒకేసూత్రం మీద పరిష్కారం కావలెను అన్నది సరైనది. ఆసూత్రం చెప్పవలసి ఉన్నది. Contignity, Village unit, simple majority group తీసుకుంటే బార్డరు సమస్యలు పరిష్కారము చేసుకుంటే ఏవిధమయిన తగాయిదాలు ఉండవు. ఒక గ్రామం ఎటుపోతుంది అన్నది సమస్య కాదు. ప్రశాంత పరిస్థితులు ఏవిధముగా కలుగజేస్తాము అనే ఉద్దేశముతో Border Disputes పరిష్కారము జరుగవలెను అని మేము కూడా అంటున్నాము.

నాగార్జునసాగరు అమలు జరుపబోతున్నందులకు సంతోషము "గాని గవర్నరుగారి ఉపన్యాసములో And the coffer Dam on the Andhra side has been completed." అన్నారు. ఆంధ్ర side కూడా త్వరగా complete చేస్తారు అని అన్నారని నేను అనుకుంటాను.

THE HON. Dr. B. GOPALA REDDI :— Type mistake కావచ్చు.

Sri PILLALAMARRI VENKATESWARLU:— అదే విధముగా తుంగభద్ర High Level Canal విషయములో ఏ విధముగా నష్టం

వస్తుందో చల్లా సుబ్బారాయుడుగారు చెప్పేరు. ఇది త్వరగా నిర్మించబడుతుందని మన అందరము ఆశించిఉన్నాము. ఉపముఖ్యమంత్రిగారు ఈ తుంగభద్ర హై లెవెలు కెనాలును త్వరగా నిర్మించడానికి పూనుకుంటారని ముఖ్యమంత్రిగారు సహాయం చేస్తారని మేము ఆశిస్తున్నాము.

వరదలలో గ్రామాలు కొట్టుకు పోతున్నప్పుడు బుడమేరు స్కీముగురించి గవర్నరుగారి ఉపన్యాసములో ఏమీలేదు. తప్పకుండ ప్రస్తావించి ఉండవలసినది. అది అమలుజరుపుదామని చెప్పి ఉండవలసినది. అదిగొప్ప లోపమేఅని చెప్పక తప్పదు.కాంగ్రెసు సభ్యులుకూడా మంత్రివర్గం దృష్టికి తీసుకువచ్చేరు. దాని విషయమై అభిమానములు, దురభిమానములు పెంచుకోకుండా దానిని నిర్మించడానికి పూనుకొనవలెను. దాదాపు రెండుకోట్ల ఆదాయమువచ్చే పంట ధ్వంసం అయిపోతూ ఉన్నది. బుడమేరు ప్రతిసంవత్సరము పొంగి అనేక లక్షలరూపాయల పంట నాశనము చేస్తున్నది. దానిలో అతిశయోక్తిగాని ఆవేశ ఉద్రేకాలుగాని పడము. దానిని త్వరగా నిర్మించడానికి పూనుకొనవలెనని నేను సూచిస్తున్నాను.

రెండవప్లాను గురించి చెప్పారు. ఇదివరకు మేము కూడా చెప్పాము. ఆంధ్రకు కేటాయించవలసిన మొత్తము కేటాయించలేదని చెబుతూ వచ్చాము. Population బట్టి ఆర్థికముగా వెనుకబడి ఉండడముచేతను మన ఆంధ్ర రాష్ట్రానికి ఎక్కువ మొత్తం కేటాయించే ఉండవలసినది. కేంద్రప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకువచ్చి ఎందువల్ల మన ప్రభుత్వము ఎక్కువ మొత్తం సంపాదించలేక పోయిందో గవర్నరు గారి ఉపన్యాసములోగాని, మంత్రిగారుగాని చెప్పకపోవడము చాలా శోచనీయమైన విషయము. ఏ ప్రభుత్వమైనా సరే ప్రజానాయకులు తమ అవసరాలను గురించి లిఖితముగా చెప్పుకున్నప్పుడు మనము సాధించుకొనగలము. గాని మన గోపాలరెడ్డిగారు ఉదాసీనముగా కూర్చుంటే, అడగనిదే అమ్మైనా పెట్టదనే సూత్రం వర్తిస్తుంది. మనకు ఏమీ రాదు. మన దురదృష్టవశాత్తు మన వెంకట్రావుగారు తక్కువ ఇస్తూ ఎక్కువ ఇచ్చినట్లు చెబుతున్నారు. ఎవరిని మభ్యపెట్టడానికి ఎవరిని మోసం చెయ్యడానికో మద్రాసువారు ఇంకా ఎక్కువ రాబట్టడానికి తలక్రిందులా ప్రయత్నం చేస్తున్నారు. యదార్థమైన పరిస్థితులను చూసినా, population backwardness చూసినా రెండవప్లానులో చాలా తక్కువ వచ్చింది అన్న విషయం మనకు స్పష్టముగా అగుపడుతుంది.

అధ్యక్షా 2-3 వివరాలు మాత్రం చెప్పుతాను. బొంబాయితో పోల్చిచూచిన ట్లైతే మనకు చాల అన్యాయం జరిగింది. బొంబాయి రాష్ట్రంలో Population 396 లక్షలు వుంటే అక్కడ మొదటి పంచవర్ష ప్రణాళికకు 181.4 కోట్లు ఖర్చు పెట్టారు. రెండవ పంచవర్ష ప్రణాళికకు 264 కోట్లునిర్ణయించారు. మొదటి దాని కంటే రెండవ plan కు 54% ఎక్కువైంది. Population ప్రకారం వాండ్లకు 66% ఖర్చు పెట్టారు. పారిశ్రామికంగా బొంబాయి రాష్ట్రము ముందుకు పోయి నంతగా మరొక ప్రాంతములేదు. అలాంటిచోట Population ప్రకారం దానికి 66% ఖర్చు పెట్టడమేమిటి పారిశ్రామికంగా చాల వెనుకబడిన మనకు Population ప్రకారం 51% ఖర్చు పెట్టడం ఏ విధంగా సబబో నాకు బోధపడడం లేదు. పోని అస్సామ్. Population తీసుకుంటే 98.2 లక్షలు మాత్రమే వుంది. మొదటి పంచ వర్ష ప్రణాళికకు 28 కోట్లు పెట్టారు. యీ ప్రణాళికకు 56 కోట్లు ఖర్చుపెట్టబోతున్నారు. double ఖర్చుపెట్టారు. ఆంధ్రప్రదేశము అస్సామ్‌కంటే ఏవిధంగా ముందున్నదో చెప్పగలరా? మనకు పెద్ద ఆదాయమొచ్చే పెద్ద పరిశ్రమ ఒకటి కూడా లేదే. In-Come Tax ఎక్కువ వచ్చే అవకాశాలు లేవు. ఈ విధంగా వుండే పరిస్థితులలో అస్సామ్‌కు వచ్చేటటువంటి భాగము కూడా మనకు రాలేదే. అంతేకాదు మధ్యప్రదేశ్ విషయం తీసుకున్నా కూడా మనకు జరిగిన అన్యాయం బోధపడుతుంది. రెండుకోట్ల 21 లక్షల జనాభా వున్నది. మన ఆంధ్రదేశంయొక్క జనాభా 2 కోట్ల 27 లక్షలు. మధ్యప్రదేశ్‌కు 193 కోట్ల రూపాయలు యిచ్చారు. మన ఆంధ్రదేశానికి ఇప్పటి లెక్కల ప్రకారం 116 కోట్ల రూపాయలు యిచ్చారు. ఎందువల్ల ఈ అన్యాయం జరిగింది. దానికి మన మంత్రులు గర్వపడాలా లేకపోతే యెందుకు ఎక్కువ తీసుక రాలేకపోయారో ఆలోచించమని నేను కోరుచున్నాను. యీ లెక్కలన్నీ Eastern Economist, మిగిలిన పత్రికలలో చూచినపుడు ఎందుకు ఇంత అన్యాయము జరుగుతుందంటే సమాధానము మాత్రము వుండదు. వెంకటరావుగారి దగ్గరనుంచి ఎన్నితడవలు సమాధానము సంపాదించడానికి ప్రయత్నము చేసినాసరే దానిని తప్పించడానికి ప్రయత్నం చేస్తారేకాని యీ నాటి పరిస్థితులను explain చేయు టకు మాత్రం ప్రయత్నం జరుగలేదని చెప్పవలసిన అవసరముంది. పంజాబ్‌లో చూచినాసరే. ఒకకోటి 34 లక్షల జనాభావుంటే 126 కోట్ల రూపాయలు వాండ్ల కిచ్చారు. మనకు 116 కోట్ల రూపాయలే. అందువల్ల వీటి అన్నింటిని బట్టిఒకటి మనకు స్పష్టంగా బోధపడుతున్నది. ఆంధ్రదేశానికి ఎన్నాళ్ళనుంచో జరుగుతున్న అన్యాయం వేరే రాష్ట్రమువచ్చినా కూడా అదేవిధంగా అన్యాయం కొనసాగుతున్న దనే విషయం మనకు స్పష్టంగా బోధపడుతుంది. అంతేకాదు, ఫైనాన్స్ కమిషన్

రికమెండేషన్సు వున్నాయి. ఆ కమిషన్ రెకమెండేషన్సు ప్రకారం కొన్ని రాష్ట్రాలకు ప్రత్యేకమైనgrantయిచ్చారు అన్ని రాష్ట్రాలకి genral source of revenue కోసము కోటి రూపాయలు యిచ్చారు. Primary Education కు ఏమీ యివ్వలేదనుకోండి. ఒరిస్సాకు General source of revenueకు 75లక్షలు primary education కోసం 97 లక్షలు యిచ్చారు. పంజాబుకు General source of revenue కు 125 లక్షలు, Primary Education కు 84లక్షలుయిచ్చారు. బీహార్‌కు general source of revenue కు ఏమీ యివ్వలేదుకాని primary education కు 2 కోట్ల 48 లక్షలు యిచ్చారు. ఆంధ్రదేశానికి ఎందువల్ల యివ్వలేదు ? మధ్య ప్రదేశ్‌కు కూడా 150 లక్షలు యిచ్చారు.

The Hon. Dr. B. GOPALA REDDI :— Finance కమిషన్ 5 సంవత్సరముల క్రిందట recommand చేసినపుడు ఆంధ్ర రాష్ట్రము మద్రాస్‌లో అంతర్భాగంగా వుండినది.

Sri PILLALAMARRI VENKATESWARLU:- ఆనాడు అంతర్భాగముగా వుంది. మద్రాస్‌నుంచి విడిపోయి ఆంధ్రరాష్ట్రంగా వెలువడిన తర్వాత మన financial resources ఏ విధంగా వుండాయో మనకు తెలుసు. వాంఛూ తన రిపోర్టులో చెప్పాడు—5 కోట్ల రూపాయల deficitతో క్రొత్తగా ఏర్పడే రాష్ట్రం వుంటుందని. కమిషన్ రిపోర్టులో లేకపోవచ్చును. President Orderతో కమిషన్ రిపోర్టును సవరించి మరొక రూపములో యీ విధమైన గ్రాంటును యివ్వడానికి అవకాశము వున్నదని ముఖ్యమంత్రిగారికి తెలియజేస్తున్నాను. యీరోజున మనము కేంద్ర ప్రభుత్వముమీద తీవ్రమైన ఒత్తిడి తీసుకు రావలసియున్నది. మనము ఇప్పటికే ఎక్కువ taxation వేసుకున్నాము. మంత్రిగారు చేసిన పెద్దపనులలో taxation అనేది ఒకటి. రెండుకోట్ల 75 లక్షల రూపాయలు అధికంగా పన్నులు వేసుకున్నాము గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రి అయినతర్వాత. యీ పన్నులు భరించేటటువంటి శక్తి ప్రజలలోవున్నదా లేదా అనేదానిని ఆలోచించాలి. లేదనే అభిప్రాయంలో మేమున్నాము. ఏ పట్టాభిరామరావుగారి లాంటివారిమీదో పన్ను వేయడానికి అవకాశము వుంటే వుండవచ్చునుగాని రైతాంగముమీద వేస్తే మాత్రం వారు భరించలేరు అనే విషయం మనకు స్పష్టంగా బోధపడుతుంది. ఇపుడు మనకు ఇంకా మూడుకోట్ల చిల్లర deficitలో వున్నాము. ఈ deficit పూర్తిగ wipe out ఔతుందనుకోవడం మాత్రం చాల పొరపాటు. Deficit వున్నంత మాత్రాన

కంగారు పడవలసిన అవసరంలేదు. ప్రజల కొనుగోలు శక్తి పెరిగినపుడే మనకు ఎక్కువ ఆదాయము లభిస్తుంది. మనకు Sales tax ఎక్కువౌతుంది. ప్రజల కొనుగోలు శక్తిని ఎక్కువచేయకుండా అదనంగా వేసే పన్నును ఎక్కువగా పెంచుతూ పోయినట్లైతే వచ్చేటటువంటి ఆదాయం inverse Proportionలో రావడము జరుగుతుంది. అందువల్ల కేంద్ర ప్రభుత్వం మీద ఒత్తిడిచేసి General resources of revenue కు కోటి 25 లక్షల రూపాయలు Primary Educationకు రెండు కోట్లు 50 లక్షలు తప్పకుండా రావాలని మనము తీవ్రంగా ఒత్తిడి చేయాలని నేను అనుకుంటున్నాను. Education లో మనము చాలా వెనుక పడ్డాము. మనము ముందుకు పోవాలంటే కేంద్ర ప్రభుత్వం grant యిచ్చినపుడే సాధ్యపడుతుంది, లేకపోతే సాధ్యపడదు. మరొకవిషయం ఆలోచించాలి. Allocation of Union excise duties వుంది. పొగాకు, అగ్గిపెట్టెలు, vegetable oils యీ మూడింటిని మాత్రమే కలిపి కలిపి దేశానికి అంతటికి పంచుతున్నారు. పొగాకు excise dutyలో కొంతభాగము మాత్రమే యిస్తున్నారు. గుడ్డమీద 26.5 కోట్లు ఆదాయం వస్తూవున్నది, Sugar మీద 10 కోట్లు వస్తుంది. మోటార్ Spirit మీద 21 కోట్లు వస్తుంది. ఇవన్నికూడా కలిపి వీటిని (divide) చేయవలసిన అవసరముంది. అంతేకాకుండా మొత్తం 16-17 items మీద Union excise duties వసూలు చేస్తున్నారు. మొత్తం అంతాకల్పితే 127 కోట్ల రూపాయలు ఔతుంది- అనుకుంటాను. దీనిని అంతాకూడా వివిధరాష్ట్రాలకు population నుBackwardness in economyని దృష్టిలో వుంచుకొని పంచవలసిన అవసరముంది. మనము యీపద్ధతిమీద కేంద్రప్రభుత్వముపై ఒత్తిడి తీసుక రావాలని మాత్రము చెప్పుతున్నాను. ఒక్కపొగాకుమీద 35 కోట్ల పైచిల్లర కేంద్రప్రభుత్వానికి మన ఆంధ్రదేశము నుంచి పోతున్నది. కేంద్రప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకొచ్చి యీ deficitను పోగొట్టుకోడానికి ప్రయత్నించాలి. కేంద్రప్రభుత్వం తగిన grantsను ఏవిధంగా అస్సామ్ మధ్యప్రదేశ్‌లకు యిస్తుందో మనరాష్ట్రానికి అవిధంగా పొందడానికి ప్రయత్నం చేయవలసిన అవసరమున్నది. అంతేకాదు. యీ సందర్భంలో మరొకవిషయంకూడా చెప్పాలి. ఇక్కడవుండే పొగాకువ్యాపారం ఎక్కువగా బ్రిటిష్ వాండ్ల చేతులలోవుంది. అనేక సంవత్సరాలనుంచి మేము చెప్పుతూనే వున్నాము, బ్రిటిష్‌వాండ్లు మనదేశంనుంచి వందకోట్ల రూపాయలను దోచుకుపోతున్నారు, ఇంకా ఎక్కువగనే తీసుకపోతున్నారు. దానిని అరికట్టడానికి ప్రయత్నం చెయ్యమని కోరుతున్నాను. ఈలా కోరుతున్నందున కమ్యూనిస్టులను విమర్శచేయడం జరిగింది.

మొన్నటి పత్రికలలో చూచాము- Mica, iron, తదితర వాటిల్లో స్టేటుప్రభుత్వమే ఇట్టి trading చేయాలనే నిర్ణయానికి వచ్చిందని, 2/3 ప్రైవేటు owners కు వదలి వేసి 1/3 వంతు తాను వ్యాపారంచేయాలని ప్రకటించింది. అది కాకుండా పూర్తిగ ఈ trade ను ముఖ్యంగా mica, iron ఈ రెండింటి విషయములో ప్రభుత్వమే వ్యాపారంచేస్తే, (కండ్లారమేము చూస్తూనేఉన్నాం. iron వ్యాపారంచేస్తూ ఉండే వాండ్లను) చాల లాభంవస్తుంది. చాలతక్కువడబ్బు 5,10 వేలు పెట్టుబడి పెట్టినటు వంటివాండ్లు, 50,60 వేలు, లక్షరూపాయలు గడిస్తున్న విషయాన్ని జగ్గయ్యపేటలో కూర్చున్నట్టి మేముచూస్తూనేఉన్నాం. Mica magnets క్రిష్ణా జిల్లానుంచి నెల్లూరుకు పోయి ఏవిధంగా దోచుకొనిపోతున్న విషయంకూడా మనంచూస్తూనే ఉన్నాం. ఇంత డబ్బు వాండ్లు ఏవిధంగా సంపాదించ గలుగుతున్నారు? ప్రభుత్వం ఏమిచేయలేదు. ప్రభుత్వంచేస్తే అంతానష్టంవస్తుందనుకోవడం చాల పొరపాటని అనుకొంటాను. ఒక సంవత్సరంలో ఏమైనా mismanagement జరుగవచ్చును.అనుభవం సంపాదించిన తర్వాత మనము చేస్తేనే ఎప్పటికైనా మనరాష్ట్రానికి డబ్బువస్తుంది గాని, మనం ఏమిచేయలేమని కూర్చుంటే, ఇట్లాగే కూర్చొంటాము. మీరుపన్ను ఒక రూపాయి పెంచవచ్చును, ఇంకా ఒక రూపాయి పెంచవచ్చును. లేక పోతే ప్రతి ఒక్క తలకాయకు రూపాయ అదనంగా పన్నువేయవచ్చును. ఆవిధంగా పన్ను సంపాదించ వలసిందేగాని ఇంకా ఏవిధంగాను ప్రభుత్వానికి ఆదాయం వచ్చేమార్గం లేకుండాపోతుంది. అంతే కాదు. అనేకమంది సభ్యులు సూచనచేశారు. ఇపుడు bus transport ఉన్నది. దానిని nationalise చేస్తే డబ్బు వస్తుందని అందరికి తెలుసును. మాక్రిష్ణాజిల్లాలో చూచి నట్లయితే, బస్సు ఎక్కడానికి సీట్లుదొరకని బస్సు రూట్లు ఉన్నాయి. అనేకచోట్ల overload చేస్తున్నారు, నావనినష్టపడి పోతుందని, నన్నుఎక్కించుకోమని ఒత్తిడి చేసి ఎక్కుతాను. అట్టిపరిస్థితులలో over load చేసి నందుకు బస్‌యజమానులను శిక్షించి ప్రయోజనంలేదు. Bus routes చాల తక్కువగానే ఇస్తుఉన్నారు. ఎందువల్లనో నాకు తెలియడంలేదు. అడిగిన వాండ్ల కల్లా బస్సురూట్లు వడేసే ప్రయత్నంచేస్తారా అంటే అదీలేదు. Seat కు 42 1/2 రూపాయలు ఆదాయంవస్తుందంటారు. ఇంకా ఎన్ని seat లకు రావలసినడబ్బు రాకుండా పోతుందో ఒకతడవ మంత్రిగారు తెలుసుకోవాలి. ఎవరికి తెలియకుండా ఏ చిన్నకారో, డొక్కుకారో లేక jeep లో పోయి చూసేటట్లయితే, ఎంత overload జరుగుతుందో, ప్రభుత్వానికి రావలసిన ఎన్నిలక్షల రూపాయలు రాకుండా పోతుందో

వాండ్ల కండ్లారా వాండ్లుతెలుసుకోగలరు. D. Sanjeevayyaగారు మొన్ననే పోతూ పోతూ overload పట్టుకొని స్టేషన్‌లో ఒప్పగించారట. ఆవిధంగా చేసినపుడు ఖచ్చితంగా మనకు ఎక్కువడబ్బు రావడానికి వీలుంది. ఎట్లా జరుగుతుందనిఅంటారు. ఈనాడు మద్రాసు ప్రభుత్వం ఏలాచేయగలిగింది? గోపాలరెడ్డిగారు మద్రాసులో ఆర్థిక మంత్రిగా ఉన్నపుడే ఈ nationalising scheme అమలులోకి వచ్చిందని జ్ఞాపకం. మద్రాసులో జరగడంలేదా? అక్కడజరిగింది ఇక్కడజరుగదని వారికిఎందుకు అనుమానమోనాకు బోధపడుటలేదు, అందువల్ల దానిని తప్పకుండా ధైర్యంతోమనం చేయాలని నేను సూచిస్తున్నాను. ముందుమా కృష్ణాజిలా తీసుకొని అక్కడప్రారంభించండి. అక్కడ జయప్రదం అయినపుడు ముందుకు పోవడానికి అవకాశం ఉంటుంది. ముందుకుపోదాం, రమ్మనమని వారిని కోరుతున్నాను.

తర్వాత మన industrial policy ని చూడాలి. కళావెంకట్రావుగారు, పరిశ్రమలు పెట్టమంటే. ఎవరు రావడం లేదనిన్ని తాను దేశమంతటా తిరిగి నా ఎవడూ ఒక్క దమ్మిడీ ఇవ్వటంలేదని, చెప్పుతున్నారు. నిజమే కావచ్చును. కారణం ఏమిటి ? మనదేశంలో ఎక్కువ పరిశ్రమలు కావలెనని వారికి అభిప్రాయంలేకుండా ఉందా ? కోరిక లేకుండా ఉందా ? శక్తి, డబ్బులేకుండా ఉంది. ప్రభుత్వం matching wans అని పెట్టుతున్నది. మీరు 50 లక్షలు పెట్టండి. మేము 50 లక్షలు ఇస్తాము అంటున్నారు. దీనిని మద్రాసులోను బొంబాయిలోను బాగా ఉపయోగిస్తారు. అక్కడ ఒక కోటి పెట్టమంటే, 12కోట్లు పెట్టుతారు, 12 కోట్లు లాగుకొంటారు. ఇక్కడ 50 లక్షలు పెట్టమంటే ఆరు లక్షలు పెట్టుతాము. ఆ ఆరు లక్షలు కూడ తిరిగిరాదు. అందువల్ల బొంబాయి వాండ్లకు 12 కోట్లు పోతుంటే మనకు ఒక లక్ష రూపాయలుకూడ రావు. కేంద్ర ప్రభుత్వంనుంచి తెచ్చుకో లేకుండాపోతున్నాం. ఎందువల్ల? మన రాష్ట్రప్రభుత్వం అవలంబించుచున్న industrial policy లవల్ల. అందువల్ల ఇపుడు అవలంబించేటటువంటి industrial policy మారవలెనని మాత్రం చెబుతున్నాను. ముఖ్యంగా ఆంధ్రదేశంలో (వెనుకబడ్డ). ఎక్కువమంది దగ్గర డబ్బులేదు, వేళ్ళమీద లెక్కపెట్టడానికి తగినంతమంది ధనవంతులుమాత్రమే ఉన్నారు. అన్ని పరిశ్రమలు వాండ్లు పెట్టే స్థితిలోలేరు. ఆలాంటప్పుడు ఏ రకంగానైనా, ప్రభుత్వం పరిశ్రమలను ప్రారంభించవలసిన అవసరంఉంది. పెద్ద పరిశ్రమలే కాదు, medium size పరిశ్రమలేకాదు. చిన్నచిన్న mills దగ్గరనుండి ప్రభుత్వమే పెట్టుబడిపెట్టి చేయాల్సిన అవసరం ఉంది. డబ్బు ఎక్కడనుండి వస్తుందనే సమస్య వస్తూనే ఉంటుంది. ప్రభుత్వం పెట్టుబడి పెట్టినపుడే డబ్బు వస్తుంది. ఇతరరాష్ట్రాల

నుంచి మనం ఆహ్వానించ వచ్చును. ఎప్పటికైనాసరే మనం ఈ రోజున ఆంధ్ర దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయాలంటే ఈనాడు మన ప్రభుత్వం అవలం బించుచున్న industrial policy వల్ల జరుగదని మాత్రం స్పష్టం అవుతుంది. అందువల్ల ఇదిమార్చుకోవావలెనని కోరుతున్నాం. తర్వాత ఓబులరెడ్డిగారు మాట్లా డుతూ సిగరెట్టు factory గుంటూరులో పెట్టబోతున్నామన్నారు. చాలా సంతోషిం చాం. గవర్నరు గారిspeech లో సిగరెట్టు ఫ్యాక్టరీ విషయం ఎక్కడాలేదు. ఎందు వల్ల? మంత్రి వర్గానికి ఈ సమాచారం ఎక్కడనుంచి వచ్చింది. దాంట్లో అవ కాశం ఉండేటట్లయితే ఎందుకు వ్రాయలేదు? ఏమివ్రాయనిది వారు ఎందుకుచెప్పాలి. ఈ రకమైన తికమకలు అన్నికూడా వస్తున్నాయి. Cigarette factory పెట్టవలసిన అవసరంఉంది. పెట్టడం న్యాయం, ధర్మం. పెట్టమనికూడా కోరుతున్నాం. కాని ఏదో ఆశకల్పించి, ఏదో జరుగ బోతుందని ఒకప్రక్కనచెప్పి, చివరకు ఎన్నిఏండ్లు చూచినా జరుగకుండా పోవడంకంటే ఉన్నటువంటి యదార్థమును మాత్రం చెప్పవలె నని మంత్రిగారి దృష్టికితీసుకొని వస్తున్నాను.

Education విషయంలో ముఖ్యంగా శాసనసభలోనే మూడవ form వరకు అందరికి ఉచిత విద్య నేర్పుతామని చెప్పారు. మునిసిపాలిటీలకు జిల్లాబోర్డులకు వచ్చే toll gate పన్నును, entertainment tax ను ఇపుడు మనం తీసు కొన్నాం. మంత్రివర్గం వాగ్దానంచేసిన తర్వాత తల్లిదండ్రులందరికీ కూడ తమ బిడ్డ లకు ఉచితంగా చదువు చెప్పించుకోడానికి అవకాశం కలుగుతుంది అనే ఆశను కల్పించారు. చిట్ట చివరకు ఆచరణలో పెట్టవలసి వచ్చినపుడు, ఆడపిల్లలకు మాత్రమే చెప్పిస్తాము, మగపిల్లలకు ఒకటవ ఫారంనుంచి ప్రారంభిస్తామని చెప్పారు. ఇదేమి రాజనీతి అని అడుగుతున్నాను. వాగ్దానము చేసిన తర్వాత ఏ ప్రభుత్వ మైనా సరే, తన వాగ్దానాలను నిలబెట్టుకొన్నప్పుడే, తన యొక్క ప్రతి ష్ఠను ఎక్కువ చేసుకొనగలదనే విషయాన్ని మరచి పోవద్దనీ కూడ చెప్పుతున్నాను. మొన్న budget session లో వాగ్దానం చేశారు. నెల రోజులు తిరగక పూర్వమే దానిని తిరస్కరించి, కాలదన్ని, లేకుండాచేశారంటే సత్యహరి శ్చంద్రుడు కానక్కరలేదు మామూలు మనుష్యులు చేసే వాటిల్లోకూడా ఉంటుంది. అందాక మనము పోనక్కరలేదు. అంతంత ఆశయాలు పెట్టుకోవద్దని నేను చెప్పుతు న్నాను. కొద్ది కొద్ది వైనాసరే సాధించ డానికి వీలుంది. ఈ రోజు III form వరకు ఉచితంగా విద్యనేర్పించడానికి వీలుఉంది అనిచెప్పినాము. అదిఎందువల్ల అమలు జరుపలేక పొయ్యామో తెలియకుండా ఉన్నది. ఈ సందర్భంలోనే ఆనాడు హిందీ

విషయం కూడ ఒప్పుకొన్నారు. III form నుంచి ప్రారంభించ దానికి ముఖ్య మంత్రిగారు కూడ అంగీకరిస్తాంఅని చెప్పారు. మళ్ళీ education institutions పెరిగిన తర్వాత III from నుంచిచెప్పకుండానే 1st form నుంచి హిందీ నిచెప్పడం జరుగుతుంది. హిందీ,ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతం, ఇన్నిభాషలు, 7,8 ఏండ్లు వచ్చిన పిల్లలకు చెప్పితే వాండ్లకు ఏమివస్తుందో, ఏమిఅర్థంఅవుతుందో తెలియ కుండా ఉన్నది. అందువల్ల నేను గోపాలరెడ్డి గారిని కోరేది ఒకటే, "మీరుచేసిన వాగ్దా నాన్ని అమలు జరపడానికి ప్రయత్నంచేయండి." లేకపోతే పోనీ, గవర్నరుగారి ఉపన్యాసంలో ఎందువల్ల అందరికి ఉచిత విద్యనేర్పలేక పోయారో ఒక వాక్యమైనా వ్రాశారా? ఏదో ఘనకార్యంచేసినట్లు దానిలో చెప్పారు. ఈ ఏడాది 1st form వచ్చే ఏడాది IInd form, పై వచ్చే ఏడాది IIIrd form నుండి ప్రారంభిస్తామని- కాని ఎందువల్ల చేసిన వాగ్దానానికి భంగం కలిగిందో చెప్పకుండా ఉండేటట్లయితే ఏమనుకోవాలి? అది గవర్నరుగారి ఉపన్యాసంలో రావలెనని మా కోరిక.

తర్వాత Elementary School Teachersకు జరుగుతుండే ఘోరఅన్యాయం ఇంతవరకు మరి ఎవ్వరికికూడ జరుగలేదని స్పష్టంగా బోధపడుతుంది. రోజుకు ఒక ఆర్డరు. D.E.O తను ఇష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తుంటాడు. అతడు ఒక పెద్ద నియంతువలె అన్యాయంగా ప్రవర్తిస్తూ ఉంటాడు. ప్రభుత్వం మొన్ననే ఒక ఆర్డరు పంపించింది.

ఎయిడెడ్ పాఠశాలలోని ఒక్కొక్క ఉపాధ్యాయునికి ఉండవలసిన విద్యార్థుల సగటు హాజరు 20 నుంచి 25 కు ఎక్కువచేస్తూ చివరకు 25 ఉంటేనే ఒక టీచరును, తర్వాత 40, 45 ఉంటేనే ఇంకొక టీచరు (పూర్వం 30 ఉండేది) అన్నారు. ఇది అంతా ఎందుకయ్యా అంటే, retrench చేయడానికి మార్గం ఏమిటని అంటున్నారు. ఎంతమందిని retrench చేయడానికి వీలు ఉంటుందో వెంటనే తెలియచేయండి. ఇప్పటినుంచి జీతాలు ఆపివేయండి. లేకపోతే మన budget నడవదు. మనదేశం నడవదు. మనకు డబ్బుఉండదు. ఈ ఆర్డరువల్ల షుమారు 9,500 ఉపాధ్యాయులు retrench ment కాబోతున్నారు. తిండిలేకుండా పోబోతున్నారు. వీరిగతి ఏమని ఆలోచించారా? Second Five Year Plan లో ఎక్కువమందికి ఉద్యోగాలు ఇప్పి స్తాము. అందుకే ఇది ఉద్దేశింపబడినది. సోషలిస్టు pattern of society నిర్మించ బోతున్నాం,ఎక్కువమందికి ఉద్యోగాలు కల్పించే అవకాశాలు Second Five Year planలో ఉంది అని చెప్పుతుంటే, గోపాలరెడ్డిగారి ప్రభుత్వం ఎక్కువమందికి ఉద్యో

గాలు ఇవ్వటం కాదు, ఎంతఎక్కువ మందిని నిరుద్యోగులుగా చేయాలన్న దానికి కార్యక్రమం వేసుకొని పురోగమిస్తున్నారేగాని ఇంకా ఎక్కువమంది ఉద్యోగాలు చేయడానికి ఏమిటి మార్గమని ఆలోచించడంలేదు.

Sri D. KONDAYYA CHOWDARY:—ఉద్యోగాలు ఎక్కువమంది చేయడమే కాకుండా, ప్రతి ఉద్యోగానికి తగినంతపనికూడా కల్పించాలని.

Sri PILLALAMARRI VENKATESWARLU:— ఇప్పటికే వారు చాలా పనిచేస్తున్నారు. చేయకపోతే ఎక్కువపని చేయించండి. అంతేకాని వారి నోటిముందుకూడు తీసివేయవద్దు. ప్రభుత్వాన్ని ఏదోవిధంగా బలపరచాలని దృష్టి ఉండడం మంచిదే. సహజంకూడాను. దాంట్లో నాకేమి బాధలేదు. కాని మీరు కూడ ఆలోచించండి. మీప్రక్కన ఉండే ఉపాధ్యాయుడు తిండిలేక అల్లాడిపోయి, బజారులో తిరిగేపరిస్థితివస్తే, ఇన్ని ఏండ్లు ఉపాధ్యాయ వృత్తిలో బ్రతికి, గోపాల రెడ్డిగారి ఆర్డరువల్ల నిరుద్యోగిగా తయారు అవుతూ ఉన్నాడంటే, మీరు ఏవిధంగా బలపరుస్తారో, వారి దగ్గరకుపోయి ఏవిధంగా సమాధానం చెప్పుతారో నాకేమీ బోధ పడడంలేదు. అంతేకాదు. 9వేల మంది ఉపాధ్యాయులు, ఒకరుకాదు, ఇద్దరు కాదు. నిర్దాక్షిణ్యంగా రేపు 2,3 నెలలో వీరందరు నిరుద్యోగులు కాబోతున్నారు. దీనిని పరిష్కారం చేయవలసిన అవసరంవుంది.

మంత్రిగారు ఈ ఉత్తరువును ఆపుచేయవలసినదిని, దానిని ఇంకావిచారణ చేసి, ఏ విధంగా ఎక్కువమంది విద్యార్థులకు చదువుచెప్పించాలి అనేది ఆలోచించాల్సిందే. కాని ఈ ఉత్తరువులను అమలు జరపకుండా చూడాలి.

(At this stage Mr. Deputy Speaker occupied the chair.)

అంతేకాదు. ఈమధ్య stypends విషయంచూడండి Secondary grade Training students కు హరిజనులకు తప్ప మిగిలిన వాళ్లకు stypends ను ఆపేశారు. అసలుఇవన్నీ కూడా ఎటుదారితీస్తయో చూడండి. అంతేకాదు. Basic Training Schools కు మాత్రం stypends ఇస్తారట, మిగిలిన వాళ్లకు మాత్రం stypends ఇవ్వరట, దీనికి అయ్యేటటువంటి మొత్తం ఖర్చుఏమిటి? ఈ విధంగా అవలంబిస్తున్న కార్యక్రమం మనలను socialism వైపుకు తీసుకొని పోతున్నదో లేకపోతే ప్రత్యేకంగా opposite మార్గంలో మీరు ప్రయాణచేస్తున్నారో ఆలోచించమని మాత్రం నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తర్వాత అదేవిధంగా

జిల్లా బోర్డు Schools లో ఉండే ఉపాధ్యాయులు Secondary grade qualifications ఉండేటట్లు అయితే మిగిలిన గ్రాంటు స్కూళ్లలోనయితే Secondary grade teacher ల జీతాలు ఇస్తారట కానీ జిల్లా బోర్డులలో అదికాదు. Higher grade జీతాలే ఇస్తారట. ఈలాంటివి ఆచరణలో ఎన్ని అవకతవకలు జరుగుతున్నవో మంత్రివర్గం యొక్క దృష్టికి వచ్చినవి కొన్ని, రాక కొన్ని మంత్రివర్గం యొక్క ఆర్డర్ల వల్లకొన్ని అవకతవకలు, ఇవన్నీ ఉన్నప్పుడు మనమీరోజున ప్రజల్లోకిపోయి చూచినట్లయితే మనం కోరుకున్న పరిస్థితులకు భిన్నంగా జరుగుతున్న పరిస్థితులు మాత్రం ఏర్పడుతున్నాయని మీ దృష్టికి తీసుకొని రాదలచుకొన్నాను. అదేవిధంగా ఈరోజున ఈ medical colleges. ఈ టెక్నికల్ ఇన్‌స్టిట్యూషన్‌సులో చాల మంది విద్యార్థులు చదువుకోవాలను కుంటున్నారు. సీటు ఉండటంలేదు. నేను ఒకే ఒక సూచన చేస్తున్నాను, ఇది వరకు కూడా మనవిచేశాను. Shift System పెట్టమని.

యూనివర్సిటీ అథారిటీ అంగీకరించటంలేదంటున్నారు. వారు అదృష్టవశాత్తు ఇక్కడ ఉండటం సంతోషించ వలసిన విషయం. మేముఅంతా కూడా దాన్నికోరాం, గోపాలరెడ్డి గారికి అభ్యంతరములేదు. అలాంటప్పుడు మాకుకూడా అభ్యంతరము లేదు. మీరు తప్పకుండామాకోర్కెను మన్నించి ఈshift systemను ప్రవేశపెట్టి ఈ నాడుTechnical institutionsలోఎక్కువమందిచదువుకోవటానికిఅవకాశంకల్పించండి. ప్రభుత్వంవద్దర డబ్బులేదని మీకుకూడాతెలుసు,కొత్త Institutions నుపెట్టడాన్కి,ఉన్నటువంటి వాట్లోనే సర్దుకోవలసిన అవసరంఉంది. ఒకవేళ Staff కైనా వేరెవరికైనా ఇబ్బందులుఉంటే వాటిని దేశంకోసం భరించిఈరోజున Technical Institutionsలో Shift Systemను మాత్రం ప్రవేశపెట్టాలనిమేముకోరుతున్నాం. దానికో University Authorities కు నచ్చచెప్పమనిముఖ్యమంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను. తర్వాత అన్నిటికంటే ముఖ్యమైనది Highways. Highway Department ను గురించి చాలమంది చెప్పారు. రోడ్లనుగురించి మా జగ్గయ్యపేటకు నేను ఎప్పుడూ గవర్నరుగారిని అహ్వానించాలనుకుంటాను. ఆరోడ్లు ఇట్లా ఉండగా ప్రయాణంచేస్తే అందులో ఉండే సౌకర్యం అంతా కూడా పూర్తిగా బోధపడుతుంది. రోడ్లకు రిపేర్సుఏమీలేవు. రోడ్ల formation కూడా పోతున్నాయి. అలాంటి రోడ్లుచాలా ఉన్నాయని తేలుతుంది. రోడ్లమీద అదనంగా ఖర్చుపెట్టే విషయం అట్లాగే పెట్టండి. Maintenance and repairs కు పెట్టేటటువంటి ఖర్చును కూడా తగ్గించారు. ఖర్చు తగ్గించడంవల్ల రోడ్లు పాడవుతాయన్న మాటనుఅట్టే

పెట్టండి. నాలుగు సంవత్సరములు అయిన తర్వాత రోడ్లు పూర్తిగా మొదటికి వచ్చి జగ్గయ్యపేట రోడ్డులాగా మొదటినుంచీ ప్రారంభించే పరిస్థితి ప్రతిదానికీ పడుతుంది. దానితోబాటు మరొక సమస్య ఏర్పడింది. అనేక మంది మేస్త్రీలు ఈ రోజున నిరుద్యోగులగుచున్నారు. ముఖ్యమంత్రిగారి దృష్టికికూడా తీసుకొని వచ్చాం. P. W. D. Secretary గార్కి కూడా తెలియజేశాం, మేమేకాదు. ఆంధ్రరాష్ట్ర అధ్యక్షుడైన అల్లూరు సత్యనారాయణ రాజుగారు, బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్య మంత్రిగారి దగ్గరకు పోయి చెప్పుకొన్నారు. ఫలితం శూన్యం. నేను చెబితే లాభం లేదనుకొన్నాను. వారు చెప్పితే తప్పకుండా ఈ తడవఏదైనా నెరవేరుతుందను కొన్నాను. వారు చెప్పినా ఒకటే. ఎవరు చెప్పినా ఒకటే. ఈ ప్రభుత్వానికి ఎవరుచెప్పినా వినకూడదు అనే సత్యాన్ని మాత్రం ఈనాడు గోపాలరెడ్డిగారు ఋజువుచేస్తున్నారు. అందువల్ల మేము తిరిగి విజ్ఞప్తి చేసేదేమిటంటే రోడ్ల formation కాపాడడంతోబాటు అనేకమందికి నిరుద్యోగ సమస్య లేకుండా చేయటానికిగాను ఈ రోడ్ల మేస్త్రీలను పదవులనుంచి తొలగించరాదు. ఈ Supervision charges మహా అయితే కొన్ని లక్షల్లో మాత్రం ఉంటుంది. ఈ Supervision Charges ఇర్రిగేషన్ డిపార్టుమెంటుకి కూడా కావాలని పెద్దలయిన P. W. D. Secretary గారు suggest చేశారట. Suggest చేస్తే కట్టకాలువలు ఉండవు. దానికేమీ ఉండవు అని దానిని మేము మాత్రం అంగీకరించమని వారు తిరుగగొట్టారు. దాంతో అది అక్కడ ఆగి పోయింది.

తర్వాత Hospitals అవి అన్నీ చూచుకొనేటట్లయితే మందులు లేక అనేక Hospitals ఉన్నాయి. మా మునగాల Hospital లో డాక్టరుగూడాలేడు. 6, 7 నెలలు డాక్టరులేకుండానే జరిగిపోయింది. కంపౌండరు వస్తాడు. పోతాడు. అందువల్ల ఈ విషయాన్ని కొంచెం ఎక్కువశ్రద్ధతో పరిశీలించాలని కోరుతున్నాను. తర్వాత జిల్లాబోర్డులు, పంచాయతీ బోర్డులను గురించి క్లుప్తంగా చెప్పాలి. జిల్లా బోర్డులగురించి అనేకమంది సభ్యులు చెప్పారు. ఈ రకమైన జిల్లా కలెక్టర్ల క్రింద జిల్లా బోర్డులు ఉండేటట్లయితే జిల్లాలలో ఏమీ పనికూడా జరుగదు. దానినికూడా చూస్తున్నాం. దాన్ని extend చేయబోతున్నాం అని గోపాలరెడ్డిగారుచెప్పుతున్నారు. దురదృష్టం ఏమిటంటే ఇంతమంది చెప్పుతున్నప్పటికి నేను నా అభిప్రాయాన్ని మార్చుకోను అని గోపాలరెడ్డి గారు చెప్పుతుంటేనాకు కష్టంగాఉందని పిస్తుంది. జిల్లా బోర్డుల పరిపాలన సరిగ్గా సాగటం లేదనికూడా తెలుసు. అసలు జిల్లాబోర్డులు అక్కరలేదను కుంటారా రద్దుచేయండి. పీడవదలి పోతుంది. దానికి Advisory

Committee కూడా ఉంది. ఆ Advisory Committee సభ్యుడు చెప్పిన సలహాలను కలెక్టరుగారు విననక్కర లేదు. 'మీరు చెప్పుకోండి. వారు చేసేదేదో చేస్తారు' అని ఇక్కడ గోపాలరెడ్డి గారు చేస్తున్నట్లు. అందువల్ల ఈలాంటి జిల్లా బోర్డుల Advisory Committee లు దండుగగా ఉన్నాయి. అదేవిధంగా Panchayat బోర్డుల ఎలెక్షన్‌లలో కూడా Dy. Panchayat Officers చేసిన అవకతవకలు ఇంతా అంతా కావు అవి Elections కూడాకావు అని చెప్పడానికి సాహసిస్తున్నాను. Deputy Panchayat Officer తనం ఇష్టం వచ్చినట్లు ఆ రోజున ఎవరిని గెలిపించాలని అనుకుంటే వారిని గెలిపించే అవకాశాలు గూడా ఉన్నాయి. మొదటనుంచీ కూడా ఈ అభ్యంతరాలను మేము తెలియచేస్తూనే ఉన్నాం. వీటితోబాటు మంత్రిగారు తమ ఇష్టంవచ్చినట్లు అనేకచోట్ల elections లను ఆపినట్టి ఘటనలుకూడా అనేక పంచాయతీ బోర్డులలో ఉన్నవి. 20,27 పంచాయతీలలో ఎక్కడనో రిపోర్టు రాగానే నాలాంటివాళ్లువచ్చి 'అయ్యా ఇక్కడ ఎలెక్షనులను ఆపించండి అని అంటే వెంటనే ఆపించినటువంటి ఘటనలు' అనేకం ఉన్నాయి. వాటికి ఇంతవరకూ కారణాలు ఏమిటో తెలియజేయడంలేదు. దీనివల్ల వచ్చే ఫలితా లేమిటి. ఒక rule, లేకుండా ఎవరికి వీలుగా ఉన్నప్పుడు, ఇష్టమైనట్లు ఎలెక్షనులు జరిపేపద్ధతి జరిగిందే కానీ న్యాయంగా, సవ్యంగా మాత్రం జరుగలేదని స్పష్టంగా బోధపడుతున్నది. తరువాత ముఖ్యమైనటువంటి విషయం హరిజనులగురించి.

The Hon. Sri A.B. NAGESWARA RAO:— గౌరవ సభ్యులు secret ballot కావాలి, కావాలి అని కోరారు. అక్కరలేకుండానే elections అన్నీ సక్రమంగా జరిగినవి.

Sri PILLALAMARRI VENKATESWARLU:— చాలా సక్రమంగా జరిగినవి! హరిజనులకు House sites విషయం. గతంలో రెండులక్షలు sanction చేశారు. మనకు 5 వేలు వచ్చిందని మా జిల్లాలో చెప్పారు. 5 వేలు వచ్చిందంటే నేను అనేక petitions లను ఇచ్చాను. ఒక్కొక్క petitionకు ఒక్కొక్క రూపాయికూడా వచ్చే అవకాశంలేదని అప్పుడే అర్థమయింది. 5 వేల రూపాయలు ఏ గుడివాడ తాలూకాలలోనో లేకపోతే డెల్టా ప్రాంతాలలో అయితే $1\frac{1}{2}$ ఎకరం వస్తుందన్నమాట. అంటే సంవత్సరానికి హరిజనులకు $1\frac{1}{2}$ ఎకరములో ఎంతమందికి అయితే ప్రభుత్వంవారు ఇండ్లను కట్టగల్గుతారో అంతమందికి మీరు జిల్లాలలో ఇవ్వగల్గుతారు. దీనికి ఎంతడబ్బు కేటాఇస్తామా అనేది కాదు. ఇప్పుడు

మీరు అవలంబించే విధానం మాత్రం మారాలని నేను సూచిస్తున్నాను. Constitution Amendment Pass అయిందని మీకు తెలుసు. ఎంత అయినా ఆస్తి తీసుకొన్నప్పుడు నష్టపరిహారం ప్రభుత్వానికి నచ్చినంత, తోచినంత ఇవ్వటానికి మీకు ఈరోజున అవకాశం ఉంది. పేదవాండ్ల భూములను తీసుకోనక్కర లేదు. గ్రామాల్లో ఏ పెద్దవాండ్ల భూములో ఉంటాయి. అవి ఎకరమో రెండు ఎకరాలో తీసుకొని మామూలు నష్టపరిహారం ఇచ్చి ఆ విధంగా మీరు ఇండ్లసమస్యను అక్కడ పరిష్కారం చెయ్యాల్సిందే తప్పలేనిచో పరిష్కారంకాదు. ఈ సమస్యా పరిష్కారానికి మెట్టప్రాంతాలలో చాలా అవకాశాలు ఉన్నప్పటికీ, అందుకు పూనుకోలేకపోతున్నారు. అందువల్ల ఈ Housing మొదలైనవాట్లలో తీవ్రమైన మార్పులు జరుగవలసి ఉన్నది. ఇప్పుడుమనం అనుసరించే విధానంవల్ల మాత్రం కొన్ని వందల సంవత్సరాలు మనం ఈ విధంగా పరిపాలన సాగించినప్పటికీ మన గ్రామాలలో ఇండ్లులేని వారందరికీ ఇండ్లవసతులు కలుగచేస్తాం అనుకోవడం మాత్రం చాల పొరపాటు. అంతేకాదు. ఈనాడు నిజంగా హరిజనులకు ఇండ్లను కట్టించాలనే శ్రద్ధే ఉంటే పోలీసులకోసం ఇండ్లు కట్టుటకు 16 లక్షలో 40 లక్షలవరకూ కూడా సంవత్సర సంవత్సరం ఖర్చుపెడుతున్నారు. వెంటనే హరిజనులకు మాత్రం ఎందుకు చేయగూడదు. గాంధీగారి పేరుచెపుతూనే ఉంటారు. ఓట్లు తీసుకొంటారు. వాళ్లందరినీ మీవైపుకు చేర్చుకుంటారు. కానీ వారికి సౌకర్యాలుకలుగచేయవలసి వచ్చేసరికి అవి అన్నీకూడా అమలు జరగడంలేదు. ఎందువల్ల? అందువల్ల ప్రధానంగా ఈ రోజున మనం హరిజనులకు ఇండ్లవసతులు కలుగచెయ్యాలి. దీనికి మార్గమేమిటి. ఎక్కడెక్కడ అయితే ప్రభుత్వ స్థలాలు ఉన్నాయో వాటిలో ఇళ్లు వేసుకోమని ఉత్తర్వు జారీచెయ్యాలి. వేసుకొంటారా? తహశీల్దారు వెంటనే బయలుదేరుతాడు స్థభింపచేయడానిక్కి. భూస్వాములు ఎన్ని భూములను కాజేసినా తహశీల్దారు కండ్లకు కనబడనే కనబడవు. హరిజనుడు ఎవరైనాసరే ఎక్కడైనా కొంచెం భూమిని సాగుచేసుకుంటే వెంటనే వెళ్లగొట్టడానికి, అక్కడికి తహశీల్దారు, Village పెత్తనదారు, M.L.A. ఎవరైనా భూస్వామిఅయితే, అతను, ఇతరులుకూడా బయలుదేరుతారు వెళ్లగొట్టడానికి. కారణం ఏమైనాఉందా అంటే tank beds దగ్గిరనుంచి ఉన్నవి orders. అవిగనుక ఏ ఉద్దేశంకొఱకు ఆ tanks నిర్మింపబడినవో అది నెరవేరకపోతే వాటిని దాంట్లోనుంచి ప్రొహిబిటరీ ఆర్డరు లిస్టులోనుంచీ తొలగించి వార్కి సాగుకు ఇవ్వాలని ఆర్డరులుకూడా ఉన్నాయి. ఈ తహశీల్దారులకు ఈ కలెక్టరులకూ ఈ ఆర్డరులు ఎందుకు గోచరించవో మాత్రం నాకు బోధపడటంలేదు. మంత్రులేమైనా తెలయజేస్తారా అంటే అదీ వారుచెప్పరు.

కలెక్టరు ఎంతవ్రాస్తే దానిమీద ఏదో మంత్రులబట్టి అక్కడికిపోయి బాబూ అని గోల పెడితే ఒక్కొక్కమంత్రి స్టే ఆర్డరు ఇస్తే ఇస్తారు. లేకపోతేలేదు. ఈలాంటి పరిస్థితులున్నవి. వాటిని ఎదుర్కొనవలసిన అవసరం మాత్రం ఉన్నదని నేను మీకు తెలియజేస్తున్నాను.

లంక భూములవలన చాలామంది హరిజనులకు అన్యాయం జరుగుచున్నదని ఇంత క్రితం మాట్లాడిన నాగేశ్వరరావుగారు మొదలైన వారంతా చెప్పినారు. Policies ఈ విధంగా ఎందుకు మార్చారు ? పశువుల మేత కోసం లంక భూములను వేలం వేస్తున్నారు. ఇందుకుగాను ఆ భూములనుంచి హరిజనులను వెళ్ళగొడుతున్నారు. రోంపేరు భూముల విషయంలో ఇట్లా జరిగినట్లు అందరకూ తెలుసు. చంద్రమౌళిగారు, గోపాలరెడ్డిగారు, ప్రగడ కోటయ్యగారు, కొండయ్య చౌదరిగారు నేనూ అంతాకలిసి ఈ సమస్యను ఏదో విధంగా పరిష్కారం చేద్దామనుకున్నాము. ప్రగడ కోటయ్య గారు ఒక సూచన చేశారు. చంద్రమౌళిగారు అందుకు ఒప్పుకున్నారు. దీనిని పరిష్కారం చేద్దామనే ఉద్దేశంతో మేమంతాకూడా అంగీకరించాము. కాని ఇంతవరకు వాటి మీద Orders రాలేదు. పట్టాలనివ్వడం మానేశామన్నారు. కాని కొంతమందికి పట్టాలు యిస్తూనేఉన్నారు.

ఇప్పటికైనాసరే వాటిని గురించి తగినవిధంగా Orders Pass చేయాలని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను.

భూసంస్కరణల విషయం చర్చకు వచ్చినపుడల్లా గోపాలరెడ్డిగారు రెండు విషయాలను చెబుతూ వుంటారు.

THE HON. Dr. B. GOPALA REDDI :- నేను private గా చెప్పిన విషయాలా ?

SRI PILLALAMARRI VENKATESWARLU:-ఆ మాటలేమీ ఇప్పుడు చెప్పను .

ఈ Land Reforms అమలు జరిపినప్పటికీ 4 లక్షల ఎకరాలు మాత్రమే వుంటుందని గోపాలరెడ్డిగారు ఒక చోట చెప్పారు. లక్కరాజు సుబ్బారావుగారి రిపోర్టులో ఒక లక్ష ఎకరాలు మాత్రమేనని ఉంది. ఇంకా కొంతకాలం పోతే ఆ లక్ష ఎకరాలు కూడా లేకుండా చేస్తారనడంలో ఆశ్చర్యంలేదు.

దేశంలో కోటానుకోట్ల ధనంగలవారు ఉండగా ఒక్క రైతుల విషయంలోనే ఈ Ceiling system ఎందుకు అమలు జరుపుతున్నారు? 2 నుండి 5 వేల రు॥ ల వరకు జీతాలు పుచ్చుకునే ఉద్యోగస్తులు ఉండగా వారి ఆదాయాలమీద Ceiling ఎందుకు పెట్టరు ? ఒక్క రైతులమీదే ఎందుకు అమలు జరుపుతున్నారు ? (Interruption) తప్పకుండా పెట్టాలి. అందుకు మేముకూడా కృషిచేస్తాము, పెద్ద ఆందోళన చేసి Ceiling అమలు పరచేదాకా కేంద్రప్రభుత్వాన్ని, పండిట్ జవహర్లాల్ నెహ్రూను వదలిపెట్టకూడదు. Socialistic Pattern of Society అంటే ఒక్క భూములకు Ceiling పెట్టడమే కాదు. పెద్ద ధనవంతుల ఆదాయాన్ని పరిమితం చేయాలి.

SRI P. RAJAGOPAL NAIDU :- కోటీశ్వరులను తగ్గించాలని మీరు ఎందుకు పోట్లాడరు ?

SRI PILLALAMARRI VENKATESWARLU :- అందరికంటే ముందుగా జమీందారులను తగ్గించడానికి మన మెందుకు పూనుకున్నాము? అప్పుడు కళా వెంకట్రావుగారు ఏ సూత్రాన్ని ఆధారంగా తీసుకొని ఈ జమీందారీ రద్దు చట్టాన్ని తీసుకువచ్చారు ? ఏ సూత్రాన్ని ఆధారం చేసుకొని ఈనాందారులు రైతుల తరఫున మాట్లాడారు ? Ceiling పెట్టకూడదని రాజగోపాల నాయుడుగారు ఎందుకు వాదిస్తున్నారో నాకు అర్థం కావడంలేదు.

SRI P. RAJAGOPAL NAIDU :- Ceiling పెటకూడదని నేను చెప్పుటలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :- అందువల్ల కోటీశ్వరుల ఆదాయాన్ని పరిమితం చేయాలి. కోటానుకోట్ల ప్రజలు వ్యవసాయం మీద ఆధారపడి జీవిస్తున్నారు. వారంతా తినతిండి లేక అల్లాడి పోతున్నారు. సీలింగు నిర్ణయించినట్లయితే వారి సమస్య పరిష్కారం అవుతుంది. ప్రజలలో కొనుగోలు శక్తి పెరుగుతుంది. ప్రభుత్వం యిచ్చిన ప్రకారం నేను లెఖ్ఖలువేసి చూచాను. సగటున 2. 83 ఎకరాలభూమిని పంచడానికి వీలుంటుంది. ప్రభుత్వం యిచ్చిన 4, 800 లను దృష్టిలో పెట్టుకొని మేము లెఖ్ఖవేసి చూశాము. కావాలంటే ఋజువు చేయడానికి సిద్ధంగా వున్నాను. Planning Commission వారు సూచించిన వాటిని అమలు పరచడానికి పూనుకొందాము. భూస్వాముల ప్రాబల్యం ఎక్కువ కావడం వల్ల Ceiling పెట్టుటలేదని కొంతమంది అనుకొంటున్నారు.

THE Hon. Dr. B. GOPALA REDDI:-

Planning Commission Prohibition అమలు పరచమని సూచించింది. దానికి ఒప్పుకుంటారా?

Sri PILLALAMARRI VENKATESWARLU:—

ముందుగా Ceiling అమలుపరచి తరువాత నన్ను ఆ ప్రశ్న వేయండి. Planning Commission సూచనల ప్రకారం ceiling అమలుపెట్టండి. Prohibition కు అంగీకరించమని మీరు అడిగితే మీరునన్ను Corner చేసినట్లవుతుంది. నిజంగా మీరు ఇప్పుడు Cornor లో వున్నారు. మీరు అక్కడినుంచి తప్పించుకోడానికి ఇంకొకరిని Cornor లో పెట్టటం సబబుకాదని మనవిచేస్తున్నాను. ఈ నాడు దేశంలో ఆదాయం పెరగాలన్నట్లయితే, ఆవడి కాంగ్రెసులో pass చేసిన తీర్మానానికి అర్థమున్నట్లయితే, కాంగ్రెసు వారు చేస్తున్న ప్రచారమందు ప్రభుత్వానికి నమ్మకముంటే వెంటనే తప్పనిసరిగా ceiling పెట్టడానికి అంగీకరించాలి. తక్కిన పెద్ద ఆస్తులను, పెద్ద ఉద్యోగుల జీతాలను గూడా పరిమితం చేయవలసి వుంటుంది.

మనదేశంలో భూములులేక తిండిలేక అనేకమంది ప్రజలు అల్లాడిపోతున్నారు. అటువంటివారికి ఏవిధమైన నష్టంలేకుండా బీదప్రజలు జీవించడానికి అవకాశాలు కల్పించడానికి గాను ధనవంతులదగ్గర 4,500 రు॥లు ఆదాయంవుంచి మిగిలిన దానిపై ceiling పెట్టాలని ఆచార్యరంగా మున్నగు వారు అంటుంటే మిగిలిన వారంతా భయపడుతున్నారు. ceiling పెట్టాలని కమ్యూనిస్టులు చెప్పినమాటకాదు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుప్రెశిడెంటు గారయిన అల్లూరి సత్యనారాయణ రాజుగారు కాంగ్రెసుకమిటీలో తీర్మానించారు. ఈనాడు ceiling పెడితే రెండవ పంచవర్ష ప్రణాళిక జయప్రదం అవుతుంది. దానితోమనం అభివృద్ధి చెందుటకు అవకాశంవుంటుంది. ప్రజల కొనుగోలు శక్తి పెరుగుతుంది.ceiling పెట్టకపోయినట్లయితే భూమి అంతా ధనవంతులచేతిలో ఉంటుంది. పలుకుబడి అంతా వారిచేతిలో వుంటుంది. ఈ విధంగా ఉన్నట్లయితే Socialistic Pattern of Society అనే ఆ విషయాన్ని మనంపూర్తిగా వదలుకోవాలి. అదిఎన్నికలలో నెగ్గడంకోసం అన్నామేకాని దానికి ఏమీవిలువలేదని ప్రభుత్వం ఒప్పుకోవలసి వస్తుంది. దానికి సంబంధించిన వివరాలను ప్రభుత్వ దృష్టికి తీసుకురాగలను. ప్రభుత్వపు లెఖ్ఖల ప్రకారం చెప్పగలను. కాని ఇప్పుడు time లేదుకనుక అదిఏమీచెప్పను.

ప్రభుత్వం tenancy ని గురించి ఒక ordinance ప్రకటించింది. దాని ప్రకారం కౌలుదారులను తొలగించుటకు వీలు లేదని చెప్పారు. అయితే అనేక చోట్ల కౌలుదార్లకు కాగితాలు లేవు. కొన్ని సంవత్సరాలనుంచి వారు కౌలుకుచేస్తూ ఉంటారు. అటువంటి వారి రక్షణ విషయమై ప్రభుత్వం చర్యలు తీసుకోనుటలేదు.

Sri D. KONDAIAH CHOWDARY:— Written or otherwise అని వుంది అది చూడండి.

Sri PILLALAMARRI VENKATESWARLU:- అది వుంది. కాని కౌలుదార్లను వెళ్ల గొట్టుతోంటే అరికట్ట డానికిలేదు. ఈ tenancay గురించి ఒకబిల్లు ప్రకటిస్తారని, కౌలుదారులను తొలగించకుండా ఎక్కువ కట్టు దిట్టం చేస్తారని ఆశిస్తున్నాను.

Agricultural Wages Act 1948 వ సంవత్సరంలో pass అయినది. 6,7 సం॥ ల అనంతరం దానిని 14 గ్రామాలలో అమలుపరిచి పరిశీలిస్తున్నారు. ఏవిధంగా అమలు జరుగుతున్నదీ చూస్తున్నాము, అంటున్నారు. ఎంతకాలం పరిశీలిస్తారో తెలయుట లేదు. ప్రశ్నోత్తరాల సమయంలో లచ్చన్నగారిని అడిగాము "చూస్తున్నాము పరిశీలిస్తున్నాము" అంటారెకాని ఎన్ని గ్రామాలలో అమలుజరుగుతున్నదో, ఏవిధంగా సాగుతున్నదో అనేవేమీ చెప్పటంలేదు.ఇప్పుడు కనీసంdeltaప్రాంతాలలోనైనా అమలుజరిపి నట్లయితే తరువాత ఇతరప్రాంతాలకు extendచేయడానికి అవకాశంవుంటుంది. మంత్రి వర్గం యేర్పడిన తరువాత జరిగిన కృషినిబట్టి చూస్తే, హరిజనుల విషయంలోనూ, Agricultural Wages Act అమలు విషయంలోను చేసే కృషి Socialislic Pattern of Society కు దారితీయడంలేదు.

ఈ నాడుమన ఆశయములు ఏమైనప్పటికి మంత్రివర్గం ఏర్పడిన తరువాత ఆచరణలో చూచినట్లయితే హరిజనుల ఇళ్ల విషయంలోను లంకభూముల విషయంలోను రాంపేరుభూముల విషయంలోను కౌలుదార్ల సమస్య విషయంలోను ceiling విషయంలోను Agricultural Wages Act విషయంలోను వీటన్నిటిని ఆచరణలో పెట్టేటప్పుడు ఏవిధంగా అమలు జరుగుతోంది అంటే మామూలుగా మీరుచెప్పిన Socilaistic Pattern of Societyకి దారి తీయడంలేదు. వ్యవసాయకూలీలకు లాభకరంగా ఉండేటట్లు కూడా చేయడం లేదు. అందువల్ల వీటన్నిటిని బట్టి చూస్తే చెప్పేమాటలకు అమలుజరిపే విధానానికీ చాల వ్యత్యాసం ఉన్నదనే విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. అందువల్ల గవర్నరుగారి ఉపన్యాసానికి అభినందన తెలియచేస్తూ తీసుకొచ్చిన తీర్మానాన్ని బలపరచలేక పోతున్నాను.

తెలుగు మన మాతృభాష. దానిని మన State languageగా చేయాలని ఇదివరలోనే మనం తీర్మానించుకొని unanimous గా pass చేశాము గవర్నరు గారి ప్రసంగంలో ఆ ప్రసక్తిగాని ప్రయత్నంగాని లేదు. "మా State language గా ఇకనుంచి Tamil ఉండబోతుందని మద్రాసు ప్రభుత్వము ప్రకటించింది. మద్రాసు గవర్నరు ఉపన్యాసంలో కూడా Tamil మా State language కాబో తున్నదని చెప్తున్నారు. అటువంటప్పుడు తెలుగుభాష అంటే ఎంతో అభిమానంతో చెప్పుకునే గోపాలరెడ్డిగారు మొదలైన కాంగ్రెసు వారందరు అనేక ఉపన్యాసాలు ఇచ్చి ఏకగ్రీవంగా pass చేసినటువంటి తీర్మానాన్ని అమలు జరపడానికి ప్రయ త్నించకపోవడం చాల విచారకరమైనటువంటి విషయం. ఎప్పటికైన తెలుగుభాష మన State languageగా ప్రకటిస్తారని, ఆచరణలో పెట్టడానికి పూనుకొంటారని ఆశిస్తూ ఇంతటితో సెలవుతీసు కొంటున్నాను.

(At this stage Mr. Speaker resumed the Chair.)

The Hon. Dr. B. GOPALA REDDI:— అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగంమీద 3 దినములనుంచి చాల విపులమైనటువంటి చర్చ జరిగినది. పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారితో కూడా కలసి 59 మంది సభ్యులు ఈ చర్చలో పాల్గొన్నారు. ఆ చర్చలో వారి వారి ప్రాంతాలకు సంబంధించినటువంటి అనేక విషయాలలో ప్రజ లకు కలుగుతున్నటువంటి ఇబ్బందులు ఇక్కట్లుగురించి ఈ తరుణంలో చెప్పి నారు. 4 నిమిషాలు 5 నిమిషాలు 3 నిమిషాలు ఎంతక్లుప్తంగా చెప్పడానికి వీలవు తుందో అంతక్లుప్తంగా ప్రజలయొక్క ఇబ్బందులు చెప్పడానికి ప్రయత్నం చేశారు. ఈ భాషణలో క్రొత్తదనము ఏమి కన్పించటము లేదని, పాడిందే పాటగా ఉన్నదనీ, ఇది కేవలం administration report వలె ఉన్నదేగాని భవిష్యత్తులో ప్రభు త్వము అవలంబించ బోతున్న ఇప్పుడు అవలంబించిన విధానాలు చెప్పవలెననిఅన్నారు ప్రభుత్వాలకు సంబంధించినంతవరకు ఎక్కువగా administration గురించి చెప్పవ లసి ఉంటుంది. Policy matters రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రతిదినం ఉండవు. పోయిన సంవత్సరము April 22వ తేదిన గవర్నరుగారు ఉపన్యాసము చేశారు. ఆనాటినుంచి ఈనాటివరకు ఏమిజరిగిందో కొంతవరకు సమీక్ష చేయడమనేది తప్పిదమైనటువంటి విషయంకాదు. ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకొనడానికిగాను ఏమిజరిగిందోనని చెప్పడంకూడా తప్పుకాదు. అయినా ప్రతి ఉపన్యాసములోను budget speech లోను, Supplementary demands వీటన్నిటిలో క్రొత్తగా ఏమి కనబడుతూ ఉంటుందో నాకర్థం కాలేదు. క్రొత్తవి యేమైనా కనబడితే అది పన్నుల విషయకంగా ఉంటుంది. అవి

మాత్రం కూడదని అంటూ ఉంటారు. కాబట్టి ప్రతితడవ ఏదో క్రొత్తదానికి ఎదురు చూడడం అది లేదని నిరాశ చెందడం న్యాయంకాదు. రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించినంతవరకు చాలవరకు అనగ 40,45 పాళ్లు administration గురించి చెప్పడానికే వీలు అవుతుంది. ప్రతిదినము ఏదో మేము అర్థం చేసుకోలేనటువంటి Policyలు చేస్తున్నారు, G.O లు issue చేస్తున్నారు, రోజుకు ఒకబిల్లు pass చేస్తున్నారనే మాటలుగూడా వినవస్తూ ఉంటాయి. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వాలకు administration విషయమే ఎక్కువగ చెప్పవలసి ఉంటుంది. వాళ్లకు ఉన్నటువంటిఇబ్బందులగురించి, వరదలు రావటం fair prices, బుడమేరు, కొల్లేరు, రైళ్లు, schools, hospitals మొదలైన వాటన్నిటిని గురించి సభ్యులు చెప్పినారు. అయితే, ఇవన్నీకూడా ఎవరు కాదనలేరు. ఎవరుకూడ అతిశయోక్తిగా చెప్పింది కాదు. అక్కడ ఉన్నటువంటి ప్రజలు పడుతున్నటువంటి బాధలను ప్రత్యక్షంగా చూచినవారు చెప్పడం న్యాయమైన విషయమే. మూర్తిరాజుగారు చెపుతూ ఉంటే అందరికి కళ్లనీళ్లు వచ్చాయని చెప్పారు. అదికూడా వాస్తవమే, కొల్లేరులో ఇళ్ళుపడి పోయి నిరుపేదలై నిస్సహాయమైనటువంటి వారు పడుతున్న బాధలను ప్రత్యక్షంగా చూచినారు కాబట్టి వాటినిగురించి చెప్పినప్పుడు అందరికికూడా కష్టంగానే ఉంటుంది. ఈ కష్టాలన్నికూడా ఈనాటికికావు. అయితే B. V. Subba Reddiగారు మాత్రం "a common man," "the man in the street" అని పదె పదె చెబుతూ ఉంటారు. ఈనాడు క్రొత్తగా కష్టాలు పడుతున్నట్టు ఇంతకుముందల్లా స్వర్ణయుగంలో ఉన్నట్టు ఈ కాంగ్రెసుప్రభుత్వము వచ్చినతరువాత ఒకసారిగా స్వర్ణయుగంలో నుండి ఇనుప యుగంలోకో లేక బురదయుగంలోకో వచ్చినట్లు మాట్లాడుతున్నారు. మానవుడు ఎన్నాళ్ళనుంచో ఎన్ని శతాబ్దాలనుంచో అనేక కష్టాలుపడుతూ, ఈ దారిద్ర్యాన్ని అనుభవిస్తూ వచ్చాడు. ఆ దారిద్ర్యాన్ని తీసివేయడం కోసమే ఈనాడు కొంచెము కొంచెముగ ప్రయత్నము జరుగుతున్నది. National Extention Schemes, Local Development Works లేక Primary Education కు జరుగుతున్నటువంటి కార్యక్రమం మొదలైనవన్ని కూడా ఈఆశయాన్ని సాధించడానికే, వారు పడుతున్నటువంటి బాధలనుచూచి ఎక్కడనో అక్కడ ప్రారంభించవలెను, లేకుంటే వీటికి అంతులేదు. ఎన్నాళ్ళనుంచో పడుతున్న ఈ కష్టాలు ఇకముందు ముందు ఎన్నో శతాబ్దాలు పడడానికి వీలు కాదనేటటువంటి భావంతోనే ఇవన్నీ కూడా అమలు జరుగుతున్నాయి. ప్రజలయొక్క సహకారము తీసుకొనేందుకుగాను ప్రభుత్వాలుకూడా మేము సగము ఇస్తాము, మీరు సహాయంచేయండి, శ్రమదానం చేయండి, సంపత్తి దానం చేయండి అని ఆహ్వానిస్తున్నారు. ప్రజలుకూడా ఈ ఉత్సాహంతో ముందుకు

వస్తున్నారు. ఈనాటికైనా మీ కోర్కెలలో కొద్దిగా నైనా నెరవేరడానికి వీలు అవుతుందని మీ అందరి సహకారంతో ముందుకు వస్తున్నారు, అందువల్ల ఈనాడు ఏమి జరగలేదని చెప్పడం ప్రజాస్వామిక ప్రవాహానికి ఎదురీత ఈదినట్లు అవుతుంది. ఏదో జరిగినది. ఇంకా జరగవలసి ఉన్నది అని చెప్పినప్పుడు మాకు సంతోషంగా ఉంటుంది గాని ఏమి జరగలేదు 1936 లో ఎట్లా ఉన్నామో 1946 లో ఎట్లా ఉన్నామో 1956 లో కూడా అట్లాగే ఉన్నాము. 1966 లో కూడా అట్లాగే ఉండబోతున్నామని అనడం అది ప్రజాస్వామిక వాదానికి విరుద్ధమైన విషయం ఈనాడు ఇంత మందిని ఎన్ను కున్నటువంటి ఈ తతంగమంతా నిరుపయోగమని చెప్పడంకూడ న్యాయంకాదు. పని జరుగుతున్నది. అనుకొన్నంత త్వరితంగా జరపలేక పోతున్నాము. వాస్తవమే. ఇది ఒకనాటి విషయంకాదు. అనేక సంవత్సరాలనుంచి వస్తున్నటువంటి విషయం. కాబట్టి ఇంత చేసినప్పటికి కూడా సముద్రములో ఇంగువకలిపినట్లుగా ఉంటోందేగాని మన పల్లె సీమలలోను రోడ్లవిషయంలోను, Schools, ఆసుపత్రులు మొదలైన వాటిల్లో ప్రత్యక్షంగా కనపడుతున్నటువంటి మార్పులను చెప్పడానికి గూడా వీలులేకుండా ఉన్నది. బుడమేరుగాని, కొల్లేరుగాని, అది ఏదైనప్పటికి కూడా ఇంద్రజాలంలో జరిగేటటువంటి విషయాలుగా కనపడడం లేదు. ఇంతకుముందు వినుకొండ సభ్యులు గారడీ జరుగుతోందని చెప్పారు. గారడీవల్ల ఏదైన జరిగే పని వుంటే తప్పకుండా చేయటానికి పూనుకొంటాము. అది ఏదైన కేంద్ర ప్రభుత్వముమీద ఒత్తిడి కలుగచేసి గారడీచేసి తీసుకు రావడానికి ప్రయత్నము చేస్తాము. కాని ఈనాడు ఇన్ని సంవత్సరాల అనుభవాన్ని బట్టి చూస్తే ఏ విషయం కూడా గారడీమీద జరగదు, మంత్రాలకు మామిడి కాయలురాలవు. ఇంతకుముందు పూర్వ యుగాలలో రాలుతున్నాయేమో గాని ఈ యుగంలో మాత్రము మంత్రాలవల్ల ఏమికాదు. ద్రవ్యము ఖర్చుపెడితేగాని ఒక చిన్న ఇటుకరాయి కూడా పైకిరాదు. ఒక ఇటుకరాయి నిర్మించడానికి గాని దేనికైనప్పటికి డబ్బు కావలసి ఉన్నది. ఇతర యుగాల్లో మంత్రాలవల్ల జరుగుతూవచ్చింది. ఇది కలియుగం కాబట్టి మంత్రాల యొక్క బలము ప్రయోగ సాధ్యంకాదు. అందువల్ల ఈనాడు ఎన్ని రకాలుగా త్రిప్పినప్పటికి కూడా ధనం లేకుంటే ఈ పనులన్నీ జరగడానికి వీలులేదు. ఆంధ్రరాష్ట్రం మా చేతులలోకి వస్తున్నది తమిళుల ప్రాబల్యములోనుంచి విముక్తి పొందినాము. విమోచన పొందినాము. మా విషయాలన్ని చక్కబడ బోతున్నాయని వీరాంధ్రులు అనుకోవచ్చు. ఉత్సాహ పూరితులైన యువకులు అనుకోవచ్చు. లేక ఎప్పుడూ ఈ విషయంలో కలలు కంటున్నటువంటి వావిలాల గోపాల కృష్ణయ్య గారు అనుకోవచ్చు. కాని మన నెహ్రూగారు చెప్పినట్లు ప్రతి మానవుడు ఒక సమస్య అవు

తున్నాడు Every human individual is a problem. ఈనాడు 205 లక్షల ఘంది ఉంటే 205లక్షల సమస్యలు మనం ఎదుర్కొంటున్నామన్నమాట. ఏ విషయం లో చూచుకొన్నప్పటికి అధః పాతాళలోకంలోనే ఉన్నాము. రహదారి సౌకర్యాలేకాదు Irrigation కాదు అన్నింటిలో కూడా వెనకబడే ఉన్నాము. మన హిందూదేశంలో ఉన్నటువంటి రాష్ట్రాలన్నింటిలో కూడా మనం చాలా విషయాలలో వెనుకబడి ఉన్నాము. అది వాస్తవమైనటువంటి విషయమే.

మన హిందూదేశములో ఉన్నటువంటి రాష్ట్రములన్నిటిలో కూడా మనము చాలవెనుకబడి ఉన్నాము. అదివాస్తవమైనటువంటి విషయమే. కాని దానికి ఏమి చేయవలెను? దీనికి ఏదైనా గారడీవలన గాని, లేక ఇంద్రజాలము వలన గాని ఏమైన చేయగలిగినది ఉన్నదా? ఏవిధంగా ద్రవ్యాన్ని సంపాదించుకొని ముందుకుపోగలము అనేవిషయం ఆలోచించ వలసియున్నది. ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత మన ఆర్థిక స్థితి ఏవిధంగా ఉన్నదీ సభ్యులకు తెలుసు. దీని ఆర్థికస్థితి అట్టే బాగలేదని నేను పదే పదే చెప్పుతూ ఉంటాను అదిపాడిన పాట అవుతుఉంటుంది. ఈవిధంగా పాడిన పాటే పాడవలసివస్తున్నది. ఎందుకంటె మన సభ్యులు ఒక్కొక్కసారి కేవలం వారిస్థానికమైనటువంటి విషయాలు, వాళ్ల మనస్సులకు ప్రత్యక్షంగా వస్తూఉంటాయి. కాబట్టి, అ చెప్పుతూ ఉంటారు. కాని దానికి వెనుకాడుతూ ఉన్నటువంటి రాష్ట్ర సమస్య ఆర్థిక భావము అనేది కూడ వారిస్మరణకు తీసుకురావడముకూడ న్యాయంగా ఉంటుంది. కాబట్టి గౌరవనీయ సభ్యులు, వారు ఏపార్టీకిచెందిన వారైనప్పటికినీ, కేవలం వాళ్ల జిల్లాలోని, తాలూకాలోని, నియోజక వర్గములోని విషయాలు మాత్రమే ఆలోచించకుండా "మేము ఆంధ్రరాష్ట్రశాసన సభకు చెందినటువంటి వారము, మేము యావదాంధ్ర రాష్ట్రాన్ని పరిపాలన చేయడానికి ఈ అసెంబ్లీలో కూర్చొనిఉన్నాము, దీనియొక్క సమస్యలన్నీ ఒక సారి ఆకాశ పథములో కూర్చొని సమీక్ష చేస్తాము. కేవలము మాయొక్క నియోజక వర్గమును అంటి పెట్టుకొని కాదు" అనేటటువంటి భావముతో వారు పైకివచ్చి ఈఅంతటియొక్క Bird's eye view కూడా తీసుకో వలసిన అవసరమున్నదని చెప్పుతున్నాను. అందువల్ల, రాష్ట్ర మొత్తంగా చూచి నప్పుడు, ఈ సమస్యలన్నీ ఏ విధంగా పరిష్కారం చేయడం? ఈనాడు ప్రభుత్వము ఈ విషయాలన్నీ ఎందుకు చేయలేక పోతున్నది? బుడమేరు విషయంఎందుకు చేయ లేక పోతున్నది? అది controversial matter కావచ్చు, కాకపోయినా, క్రొల్లే రుగాని మరొకటిగాని, ఇంకొకటిగాని, ఎందుకు చేయలేకపోతున్నాము అనేది ఆలోచిం చండి. ఆదేమీ హృదయములేక కాదు.మూర్తిరాజుగారు చెప్పినవిషయాలుఏమి ప్రభుత్వా.

నికి తెలియక కాదు. లేక ఇంజనీర్లు ఈనాడు ఆ పనులు చేయలేకకాదు. లేక Administrators వాటిని చేయించలేక కాదు. కాని దీనికంతకూ కూడా మూలాధారమైనటువంటి ధనం ఈనాడులేదు. మీరు ఒకవేళ "ధనములో ఏమున్నది, అర్థం, అనర్థం" అని వేదాంతం, మెట్ట వేదాంతం చెప్పవచ్చును. కాని నా మట్టుకు ఆ వేదాంతమేమీ పనికిరాదు. ధనములేకుంటే ఏ పనీ జరుగదు అనేది సుస్పష్టమైనటువంటి విషయము. ఈ విషయము ఎంత బాగా తెలుసుకొంటే అంతమంచిదేమో అనుకుంటాను. ఈవిషయము కేవలం మన శాసనసభ్యులకేకాకుండా మన ఆంధ్రదేశములో ఉన్న ప్రజలందరికీ కూడా పదే పదే చెప్పవలసిన అవసరమున్నది. ధనము లేకపోతే ఏ పని జరుగదు, కాబట్టి ఈ ఆర్థిక విషయముగురించి ప్రతి యింట ప్రతి స్కూలులోనుకూడ చెప్పవలసియున్నదేమో అనుకొంటాను. ఈనాడు ఆంధ్రరాష్ట్రము యొక్క ఆదాయ వ్యయములు, ఈ Budget figures అంతా కూడా ప్రతి Elementary School లోను, Secondary School లోను చెప్పితే మంచిదని అనుకొంటాను. ఎందుకంటె, ఎవరినికూడా మభ్యపెట్టనవసరంలేదు, ఎవరిని కూడా మోసము చేయనవసరంలేదు. మన రాష్ట్రములో ఇంతఖర్చు ఉన్నది. ఇంత ఆదాయమున్నది. చదువు మీద ఇంతఖర్చు అవుతున్నది, ఆరోగ్యము మీద ఇంత ఖర్చు అవుతున్నది, Irrigation మీద ఇంతఖర్చు అవుతున్నది అనేటటువంటి లెక్కలు ప్రతివారికి అందజేయవలసిన బాధ్యత కూడ మనపైనున్నది. ఇదేదో ఎక్కడో కర్నూలులో హంద్రీ నదీ తీరములోనో లేక మరెక్కడో దాచుకొని ఉన్నారు డబ్బు అంతా, దీనిని ప్రభుత్వంవారు ఇవ్వకుండా పోతున్నారు అనేటటువంటి మాటకాదు. మనకు వచ్చేటటువంటి ఆదాయమెంత, ఆంధ్ర రాష్ట్ర విభజనజరిగిన తరువాత మనమెంత సంపాదించు కొన్నాము, ఎంతఖర్చు పెడుతున్నాము అనేవిషయాలు అందరూ తెలుసుకోవలసినటటువంటి అవసరం ఉన్నది. ఈ విషయాలు ఒక్కొక్కసారి విస్మరించి కేవలం స్థానికమైనటువంటి సమస్యలను గురించి మాత్రం చెప్పడం న్యాయం కాదేమో అనుకొంటాను. కొంతవరకు న్యాయం కావచ్చునేమో కాని ఈ విషయం కూడా మనం మరచిపోకుండా మనస్సులో పెట్టుకోవలసిన అవసరమున్నది. అందువల్ల ఈ సమస్యలన్నిటికీ ఒకే సమాధానం ఇవ్వవలసి వస్తున్నది. Departmental Heads అంతాకూడా ఏదేదో కావాలని, అనేక schools కావాలని, అనేక grants కావాలని, teachers కు జీతాలుఎక్కువ చేయాలని, ఇంకా అనేక సమస్యలన్నీ మనముందుకు నెట్టుతూ ఉంటారు. Budget తయారుచేసేటప్పుడు వీటన్నింటిని ఒకసారి సమీక్ష చేసుకొని వీటన్నింటికి ఒక

bracket వేసి "డబ్బులేదు కాబట్టి ఇవి ఇవ్వడానికి వీలులేదు" అనేటటువంటి సమాధానం విచారముతో, దుఃఖముతో, శోకముతో వాళ్లకు ఇవ్వవలసి వస్తున్నది. ఇదే సంతోషకరమైన విషయంకాదు. నేను ఆమధ్య West Godavari లోtour చేసినప్పుడు, అక్కడ పోలవరములో ఒక Dispensary చూచాను. అక్కడ మంచి efficient doctorఉన్నాడు. కాని మందులులేవు. అక్కడ అనేకమంది patients వస్తున్నారు. ఆ register కూడా ఆ doctor చూపించి చెప్పాడు. కాని ఆ dispensary లో మందులులేవు. అప్పుడు నేను తోడనే ఏదో చేయడానికి ప్రయత్న చేశాను. కాని మనరాష్ట్రములో ఉండునది అది ఒక్క hospital మాత్రమే కాదు. ఎన్నో ఆస్పత్రులు ఆవిధముగా ఉన్నాయి. వాటన్నిటికి lady doctors కావాలి. compounders కావాలి, midwives కావాలి, మందులుకావాలి, ఇంకా అనేక విషయాలు కావలసియుంటుంది. ఈ విషయము ఎత్తుకొన్నప్పుడు, దీనికంతకు,వందలు వేలు, లక్షలు కావలసియుంటుంది. ఈనాడు గ్రామోద్యోగుల విషయంచూడండి నిజంగా ఒక అపూర్వమైన సంఘటన జరిగింది. అదేదోవిధంగా మన చంద్రమౌళి గారు పరిష్కారం చేయగలిగినందుకు వారిని నేను అభినందిస్తున్నాను. లేకపోతే ఇది ఎంత తీవ్రమైనటువంటి రూపము దాల్చియుండునో మీరే ఆలోచించండి. ఇప్పుడు జరిగిన సంఘటన ఎప్పుడైనా ఇంతకుముందు జరిగిందా, గ్రామోద్యోగులు, కరణాలు మేముచెప్పిన షరతులు ఇస్తేనే గాని మేముపనిచేయడానికి వీలులేదు అనిచెప్పడం ఇంతకుముందు ఎప్పుడైనా జరిగిందా? కాని ఈనాడు అది జరిగింది అయినప్పటికి కూడ, అది తీవ్రరూపము దాల్చకముందే అదేదోరకంగా పరిష్కారం చేయడం జరిగింది. వారికి జీతాలు ఎక్కువ ఇవ్వడం కాకపోయిన ఏవో కొన్ని concessions ఇవ్వడం జరిగింది. కనుక ఇక వారు పనిచేస్తారనే ఆశిస్తున్నాను. బహుశ ఇదివరకే వారు పనిచేస్తున్నారేమో అనిపిస్తున్నది. ఏదో రకంగా వారిని తృప్తిపరచవలసివచ్చింది. ఏమైనప్పటికినీ teachers జీతాల విషయముకాదు. నాకు తెలుసును. కేంద్ర ప్రభుత్వమువారు మీరు జీతాలు ఎక్కువ చేస్తే మేము ఇది ఇవ్వబోతున్నాము, మొదటి సంవత్సరం ఇంత ఇస్తాము, రెండవ సంవత్సరం ఇంత ఇస్తాము, మూడవ సంవత్సరం ఇంత ఇస్తాము, నాలుగవ సంవత్సరం మీ తిప్పలు మీరు పడవలసినదే అని అప్పుడప్పుడు చెపుతున్నారు. మాకు కూడా ఇవ్వాలని ఉన్నది. ఉపాధ్యాయుల విషయము మాకు తెలియకుండా పోలేదు. అవి కేవలం మీ పార్టీవారికే తెలిసినదికాదు, మా పార్టీవారికి, మాకుకూడా తెలుసును. ఉపాధ్యాయులకు ఇవ్వాలని మాకు కూడ కుతూహలముగా ఉన్నది. కాని వారికి ఏ స్వల్ప సహాయము చేయాలని అనుకొన్నప్పటికి కొన్ని లక్షలు కావలసివస్తుంది. మన

ఆంధ్ర రాష్ట్రము వచ్చిన తరువాత దాదాపు 11 కోట్లు రూపాయలు Revenue deficit వచ్చింది, ఈ 2½ సంవత్సరములలో నేను దాన్నిగురించి అట్టె విపులంగా చెప్పకూడదు. నేను ఇప్పుడు ఏదో 6 కోట్లు అప్పుకావాలని కోరుతున్నాను. దేశంలో దానికి response బాగా ఉన్నది. అటువంటప్పుడు, నేను చాలా శక్తివంతుడను. మీ అప్పు వడ్డీతోసహా తీర్చివేయగలను అని చెప్పవలసినటువంటి తరుణములో, నేను దాన్నిగురించి విపులంగాచెప్పి, వారికి ఈ స్థితిలోఉన్న ఆంధ్ర దేశానికి నేను అప్పు ఇవ్వడమా అనేటటువంటి భీతిని కలుగజేయడం న్యాయంకాదు. అయినప్పటికీ, ఈ విషయం వచ్చినందుకు ఏదో కొంత క్లుప్తంగా చెప్పవలసిన అవసరమున్నది. ఈనాడు ప్రతి సంవత్సరమూ మనకు deficit వస్తున్నది. నేను మద్రాసు రాష్ట్రములో ఉండినప్పుడు అక్కడ Budget పరిస్థితి చూచాను. ఈ విధంగాలేదు. ఏదో ఒక సంవత్సరం Deficit వచ్చింది, మరో సంవత్సరం surplus వచ్చింది. కాని ఇక్కడ ఈ 2½ సంవత్సరాలు 11 కోట్ల రూపాయలు Revenue deficit వచ్చింది. ఇంకా అప్పు, Capital Expenditure, మన Buildings కు, లేకపోతేమాచ్ ఖండ్, తుంగభద్ర వగైరాలకు తీసుకొన్నటువంటి అప్పు వేరే 40 కోట్లు ఉన్నది. అది అటు ఉంచండి. ఈనాడు జరుగుతున్నటువంటి పరిపాలనలో మనము ఇచ్చేటటువంటి grants, loans, teachers యొక్క జీతాలు Village Munisffs యొక్క జీతాలు మొదలగు అన్నింటికోసంగా మన ఆదాయములో ఖర్చు పెట్టుకోవడమా లేక అప్పు తెచ్చిపెట్టడమా అనేటటువంటిది ఒక సమస్యగా ఉన్నది. ఈనాడు మనకేదో అప్పు పుడుతున్నది, కాబట్టి అప్పు తీసుకొంటాము అని సంతృప్తి పడటానికి వీలులేదు. ఈ అప్పుకు వడ్డి ఇస్తున్నాము. చిన్నవడ్డీకాదు. 4 percent ఇస్తున్నాము అంటే ఏమన్నమాట.ఈభారాన్ని అంతామనము వహించకుంటేమేమేమో అప్పుతీసుకొని ఖర్చు పెడుతున్నాము, విలాసంగా తీసుకొన్నాము, మీకు ఖర్చుపెడుతున్నాము, అందరితోను మంచి వాళ్లని అనిపించుకొన్నాము, మీరేమో వడ్డి మొదలు ఈ భారాన్ని అంతా వహించి తీర్చండి అని ఇకముందు రాబోయే వారిమీద ఈ భారాన్నంత వేయడమంటే, ఒక విలాస పురుషుడైన జమీందారు అప్పులుచేసి తన కొడుకులను తీర్చమనడం ఎంతన్యాయంగా ఉన్నదో ఇదికూడా అంతన్యాయంగా ఉంటుందని చెప్పుతున్నాను. కనుక మనకు వచ్చేటటువంటి ఆదాయంకంటె ఎక్కువ ఖర్చు పెట్టుకొని, అప్పులుచేసి ఎక్కువసౌకర్యాలు కలుగజేసుకొని, దీనిని తీర్చవలసినటువంటి భారాన్నంత 4 సంవత్సరాల తరువాత, 10 సంవత్సరముల తరువాత వచ్చేటటువంటి వారిమీదవేస్తే వారికి ఎంత ఇబ్బందిగా ఉంటుందో మీరు ఆలోచించండి. ఈనాడు ప్రతికోటికి నాలుగు లక్షల రూపాయలు వడ్డి ఇస్తున్నాము. ఈ నాడు 6 కోట్ల

రూపాయలు అప్పువస్తున్నదం,టే దానికి సాలీనా 24 లక్షల రూపాయలు వడ్డీ ఇవ్వవలసియుంటుందని నాకు జ్ఞాపకము వస్తూయుంటుంది. కనుక అప్పు పుట్టింది అనగానె ప్రయోజనంలేదు. Government of India వారు ఇస్తారు మీరు పదే పదే వత్తిడిచేయండి అని వెంకటేశ్వర్లు చెప్పుతూ ఉన్నారు. వొత్తిడిచేయడమంటే ఏవిధంగా చేయడమో నాకు అర్థంకావడం లేదు. జాబులు మూలకంగా వొత్తిడి చేస్తున్నాము, ఇంక telegrams ద్వారాను, telephones ద్వారాను చేస్తున్నాము, అంతకంటె క్రియారూపంగా చేయలేము.

వత్తిడి కలిగించడమంటే, అది ఏదో పరాయిప్రభుత్వం, ఏదో ఆందోళన చేస్తే, వారు లొంగి పోతారు అనుకోవడం, ఏమీకాదు. వారికికూడ తెలుసునో లేదోకాని, అక్కడ నెహ్రూగారికి యిది అంతాతెలియకపోలేదు. ఏ రాష్ట్రములో ఏమికావాలో ఎక్కడెక్కడ, ఏ డిపార్టుమెంటులో ఏమికావాలో వారు తెలుసుకుంటూనే ఉన్నారు. కాని అక్కడ పరిస్థితికూడ మనము ఆలోచించాలి. కేవలము మనము ఆంధ్రులము అని కాకుండా, మనమందరము భారతీయులము అని నేను ఎట్లా అయితే మిమ్ములను "స్థానిక పరిస్థితులుకాకుండా రాష్ట్ర వ్యవహారాలుకూడ తెలుసుకొండి" అని ఏవిధముగా తెలియజేస్తూ విజ్ఞప్తి చేస్తున్నానో, అదేవిధముగా అక్కడ ఉన్న యిబ్బందులుకూడ మనము అందరము తెలుసుకోవటానికి ప్రయత్నించాలి. మనము యీనాడు Planning విషయములో కార్యక్రమములు అమలుపరుచుకోటానికి 4,800 కోట్ల రూపాయలకు plans వేసుకుని వారిదగ్గరకుపోతే, వారికి గూడ ఎంతోభీతిగా ఉన్నది. అక్కడఉన్న నియోగిగారు, "మీవద్ద ఆర్థికస్తోమతు ఏమిఉన్నది, యీపని మీరు నిర్వహించలేరు, మీరు ఆశించినదానికంటే ఎక్కువగా డబ్బుతీసుకోటానికి ప్రయత్నిస్తున్నారు, "you are trying to bite too much" అనే విధముగా చెబుతున్నారు. 4,800 కోట్ల రూపాయల ఖర్చు మాకు అయ్యేదానికంటె, యింకా ఉపరిగా ఖర్చు చేయబోతున్నాము అనే వాగ్దానము ప్రజలఎదుట చేశాము. Planning Commission వారివద్ద అంతడబ్బు లేదు. వారుకూడ అప్పులమూలంగాను పన్నులమూలంగాను డబ్బు సృష్టించుకోవాలి. ఇంకా అనేకరూపములలో, వీలుగా ఉంటే విదేశాల దగ్గరనుంచి వారు డబ్బు సృష్టించి వారు మనకు యివ్వవలసియున్నది. మన లచ్చన్నగారుకూడ నిన్ననే ఢిల్లీలో నెహ్రూగారి దగ్గరకు పోయారు. వారు వీరు కాదు, మన లచ్చన్నగారే వెళ్లారు. మీరు చెప్పినట్లు వారిని వత్తిడి చేయాలనే వెళ్లారు. మాకుగరివిడి దానికిలాభము వస్తుంది, మీరు 75 లక్షలు అప్పు యివ్వండి అది మూడు సంవత్సరాలలో తీర్చుతాము.

నాలుగు పర్సెంటు చొప్పున వడ్డీతో యిస్తాము అని చెప్పటానికే వెళ్లారు. అక్కడ వారికిగూడ కొన్ని యిబ్బందులు లేకపోలేదు. దానికోసము ముగ్గురు కేంద్రప్రభుత్వోద్యోగస్థులు రేపో ఎల్లుండో రాబోతున్నారు. వారువచ్చి అనేక విషయాలు చర్చించబోతున్నారు. వెంకట్రావుగారు కూడ పదేపదే చెబుతూ ఉంటారు. గరివిడి విషయము చాలా అవసరమైన విషయము. 75 లక్షలు ఖర్చు పెట్టినటైతే సంవత్సరానికి 25 లక్షలు చొప్పున మూడు సంవత్సరాలలో తీర్చుతాము. ప్రస్తుతము మావద్ద యీ 75 లక్షలు లేవు. సంవత్సరానికి 25 లక్షలు లాభము వస్తుంది. మేము యీ మూడు సంవత్సరాలలో తీర్చగలము. అనే విషయాలు యిక్కడికి వచ్చిన ఉద్యోగస్థులకు చెప్పితే, వారు ఆ విషయాలన్నీ అక్కడ నెహ్రూ గారితో చెబుతారు. నిజానికి మనకు కేంద్రప్రభుత్వముయొక్క సహాయము ఉంటేనేగాని మనము ఒక్క అడుగు కూడ పెట్టటానికి వీలులేకుండా పోతుంది. మనము యిక్కడ administration లో కూడ ways and means position చూచుకోవాల్సి ఉన్నది. Ways and means position మనకు లేకపోతే మనము ఒక అడుగు కూడ ముందుకు పోలేము. మనకు నందికొండ, మాచ్‌ఖండు వగైరాలు అన్నీ కూడ ఉన్నవి. మనకు అది అప్పు అనుకోండి, లేకపోతే grant అనుకోండి. మనకు కేంద్రప్రభుత్వముయొక్క సహాయము అవసరము. అది ఏదైనప్పటికినీ కేంద్ర ప్రభుత్వమునుంచి ద్రవ్యము తెచ్చుకుంటేగాని, మన ways and means position కష్టతరమౌతుంది. ఎందుకంటే మనము యిక్కడ జీతాలు కూడ యిచ్చుకోలేని పరిస్థితిలో ఉన్నాము. నాకు యింకా ఎన్నో విషయాలు మనస్సులో ఉన్నవి. అవి అన్నీ చెప్పకూడదని అనుకున్నాను. అయినప్పటికినీ చెబుతున్నాను. ఏప్రిల్ ఒకటవ తేదీనుంచి యీనాటివరకు ways and means కొరకు నాలుగుకోట్ల రూపాపాయల కోసము మనము borrow చేయవలసివచ్చింది. ఇది ఇక్కడ జీతాలకనండి, Contractors యొక్క Bills కు payment చేయటానికనండి, నాలుగుకోట్ల రూపాయలు అవసరము. ఇప్పటికి, అంటే యీ ఆగస్టునెలనాటికి borrow చేయవలసి వచ్చింది. నాలుగుకోట్లు అంటే $4 \times 4 = 16$ లక్షలు వడ్డీ క్రిందనే యివ్వవలసి ఉన్నది. ఈ సంవత్సరము రెండుకోట్లకు పైగా Government of India వారికి గాని, లేదా open market లో తెచ్చిన డబ్బుకు వడ్డీక్రింద యివ్వవలసి వచ్చింది. ఈ మాదిరి అవస్థలు మనకు ఉంటున్నప్పుడు, మనకు ఒక్కసారిగా అన్నీ జరగలేదని అంటే ఎట్లా? మీరు ఊహించినసవి కలలుఅని అంటున్నాను. అనేక దినాలుగా మనకు ఉన్న యిబ్బందులు ప్రజలకు తెలియకపోలేదు. అంతేకాని, యిందులో అన్యాయము యేమీ లేదు. ఈ బాధ్యత, భారము అంతా ప్రభుత్వము మీద ఉన్నది.

అంతేకాని యిక్కడ ప్రభుత్వములో ఉన్న ఎనిమిది మంది మంత్రులు ఏమీచేయలేక పోతున్నారు. వీరివల్ల ఏమి జరగడము లేదు, మనకు ఉన్న యిబ్బందులు అన్నీతొలగలేదు అనేఆరోపణ ప్రభుత్వంమీద వేయడము న్యాయము కాదు. ఈ విషయాలు అన్నీ మనమందరము ఒకసారి సమావేశమై, యింకను వీలైతే whole House అంతా కూర్చుని మన fiannecial position అంతా పరిశీలించి, ఏమిచేయాలి అనేదిdiscuss చేస్తే మంచిది. ప్రభుత్వానికి ఉన్న నిజస్థితి, financial గా ఎట్లా ఉన్నది తెలుసుకుంటే మంచిదని నా అభిప్రాయము. ప్రభుత్వం ప్రజలమీద పడే పడే పన్నులు వేస్తున్నది అనేది ఎంతవరకు సమంజసమో చూచుకోవచ్చును. ఆర్థిక మంత్రి పన్నులు వేసే విషయములో ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నారు, మనకు నిజస్థితి చెప్పడము లేదు అని అంటున్నారు. కానిదానికి నేనేమి అనడములేదు. సమావేశమై financial position actual గా ఎట్లా ఉన్నదో చూచుకొంటానికి నాకేమీ అభ్యంతరములేదు అందుకునేను కాదనడములేదు. పన్నులు వేస్తున్నాము. నిజమే ఇంకా ఎంతో వేసుకోవలసియున్నది. మనము 275 కోట్ల రూపాయలు అప్పు తీసుకుంటున్నామని అన్నారు. ఈ మాటఅనుకుంటున్నారే గాని, మనకు యీసొమ్ము వెంటనేరావడములేదు. Tobacco మీద 60లక్షలు వస్తుందని నేను Budget speech లో చెప్పాను. కాని, తీరాచూస్తే, పొగాకు మీద యీ సంవత్సరము మనకు వచ్చింది 26లక్షలే. భూముల calculation ను బటి 60లక్షలు తప్పకుండా వస్తుందని అంచనా వేసుకున్న దానికి, వాస్తవముగా మనకు 26 లక్ష లేవచ్చింది. ఒక్కసారిగా పొగాకు మీద కేంద్రప్రభుత్వానికి ఎంత పోతున్నది, Sales Tax మీద ఎంత పోతున్నది, మొదలయిన విషయాలన్నీ చెప్పాలంటే, చెప్పలేకుండా ఉన్నాను. కారణ మేమి టంటే, యిక్కడ మనకు Statistical Department లేదు కాబట్టి ఏదో అందా జుగా లెక్క వేసుకొని, యింతవస్తుందని అనుకోవడమే గాని actual position తెలియదు. ఒక్కొక్క సారి అందాజుగానే చెప్పగలుగుతున్నాను. Revenue Board వారు, Commercial Tax Department వారు అందరుకూడ సుమారు 60 లక్షల వరకూ వస్తుందని అంచనా వేసుకున్నప్పుడు, నేను కూడా 60 లక్షలు వస్తుందని చెప్పాను. తీరాచూస్తే 26లక్షల కంటే ఎక్కువరాలేదు అదేమాదిరిగా levy of full assessment on inam lands ద్వారా 46లక్షలువస్తుందని అనుకున్నాము. నిజానికి యింతవరకు ఒక్కదమ్మిడి అయినారాలేదు. తరువాత surcharge on land revenue మీద 45 లక్షలు వస్తుందని అనుకున్నాము. అందులోకూడ యింతవరకు ఒక్క దమ్మిడీ కూడ రాలేదు. ఈమాదిరిగా అనుకోవడము, నేనేదో budget speechలో చెప్ప డము, యిదంతా మనము మన Budget Memorandumలో వ్రాసుకోవడమే

గాని, మనకు లక్ష్మీప్రసన్నంగా అంతసొమ్ము కనబడడము లేదు. మన పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు ఏదో యీ 275 లక్షల రూపాయలు ప్రభుత్వం అప్పుతీశారని అన్నారు. అది కాదు. రెండుకోట్ల పదహారు లక్షల రూపాయలు అని మనమందరము అనుకున్నదికూడ, మనకు actual గా అందులో వచ్చింది ఏ సగమో, లేక పోతే ఏ ¾ వంతో. అది మాత్రము లెక్కచూచుకోవలసి యున్నది. అయినప్పటికినీ, ప్రతిసంవత్సరము నాలుగుకోట్ల రూపాయలకు పైగా deficit వస్తున్నది. కేంద్ర ప్రభుత్వంవారు ఏదో నాలుగుకోట్ల రూపాయలు అప్పు యిస్తున్నప్పటికి కూడ, ఆ యిచ్చే అప్పు అయినా ఎంతోకష్టముమీద యిస్తున్నారు. అక్కడ Finance Secretary, Patel అనే ఆయన యిటీవలనే ఒకజాబు వ్రాశారు. ఏమని అంటే. "మీరు యీమాదిరిగా మాకు cheques పంపుతూ ఉంటే, మేము dishonour చేయవలసివస్తుందని" వ్రాశారు. పైగా. ఏ ప్రభుత్వానికిగూడ యీమాదిరి యివ్వటము లేదు. మీరు ఏదో పదేపదే అడిగితే యిస్తున్నాము. ఇదుగో: యీ తడవకు రెండుకోట్ల రూపాయలు యిస్తున్నాము. ఇకమీదట మేము యివ్వటానికి వీలులేదు, మీ విషయము మీరే చూచుకోవాలి అని చెప్పారు. మనము అడిగితే. లేదుఅని అనలేక యీ రెండుకోట్లు యిస్తున్నారు. కాని "లేదు" అని అనిపించుకోవడము మనకు గౌరవప్రదముగా ఉండదు. అయినప్పటికినీ అక్కడ ఉండే పరిస్థితి యిది. కాబట్టి యిటువంటిది అంతా ఊరికనే ఒత్తిడిచేస్తే ఎచ్చేదియేమీ కాదు. మనము చేయవలసిన కృషి మనము చేసుకోవలసినదేగాని. ప్రతిసారి కేంద్ర ప్రభుత్వాన్ని అడగడము వారు లేదనడము అంత మంచిది కాదేమోనని అంటాను. మన వెంకటేశ్వర్లుగారు కూడ ఒక విషయము చెప్పారు. అదేమిటంటే మన ఆంధ్ర రాష్ట్రానికి న్యాయముగా రావలసిన భాగము Planning Commission వారి వద్దనుంచి రాలేదని, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిర్వహణ విషయములో మనకు అన్యాయము జరిగిందని, అన్నారు. అన్యాయము జరిగిందని చెప్పగలమేకాని, యీ 118 కోట్లకు కావలసిన ఆర్థికస్తోమతు మన దగ్గరలేదు. దీనికితోడు 20 కోట్ల రూపాయలు అదనముగా మనము అడిగి అయినా సంపాదించుకోవలసి యున్నది. అంటే నాలుగు కోట్ల రూపాయలుదఅనముగా మనమువేసుకున్నామేగాని ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విషయములో మనకు చాలా తక్కువే వచ్చింది. బొంబాయితో సమానంగా రాలేదు. యింకా దేనితో గూడ సమానంగా రాలేదు. వారికి 270 కోట్లు వచ్చింది. మనము అడిగితే. మీకు ఉన్న financial position ఏమిటి, ఈ 118 కోట్లకున్నాగాక యింకా 20 కోట్లు అదనంగా ఆశించటానికి మీ స్వంతద్రవ్యంగా 20 కోట్లు తీసుకుని రండి అని Planning Commission వారు అంటున్నారు. అదితెస్తే, తక్కినదంతా కూడ

అప్పుగా యిస్తాము. మీరు క్రమేణ 20, 30 సంవత్సరాలలో తీర్చుకోండి, అయితే యిరవై కోట్లు మాత్రమే మీరు తీర్చుకోవాలని చెబుతున్నారు. సొమ్ముదగ్గరనే మనకు, యితర రాష్ట్రాలవారికి వచ్చిన తేడాఅల్లా. బొంబాయికీ మనకు తేడావస్తున్నది. అయితే బొంబాయివారి financial position strong గా ఉన్నది గనుక ఎక్కువగా వస్తున్నది. మనకు కూడ అంత strong గా ఉంటే మనకూ వచ్చేదే. మన position అంత strong గా లేదు కాబట్టే మనకు తగ్గుతున్నది. రాబోయే తృతీయ పంచవర్ష ప్రణాళిక విషయములో మనకు రావలసినది మనము రప్పించుకోలేక పోతున్నాము. అందువల్ల మనము వెనుకబడిపోతున్నాము. మన financial position strong గా లేదు కాబట్టే, మనము ఎవరినీ గూడ నిందించి, ఒత్తిడి చేయలేక పోతున్నాము. వారిని నిందించి, వత్తిడిచేసేబదులు మన ఆర్థికస్తోమతు మనము improve చేసుకోవడము మంచిది. ఇప్పటినుంచి అయినా మనము ఎంతవరకు బాగుచేసుకోగలమో చూడాలి. అందులో మన వెంకటేశ్వర్లుగారు, గోపాలకృష్ణయ్య గారు Finance Commission వారు వచ్చిన సందర్భములో అనేక విషయాలు చెప్పారు. అది చాలా సంతోషమైన విషయము. వారు మన financial position విషయములో అంత శ్రద్ధతీసుకుంటున్నందులకు చాలా సంతోషించవలసినదే. Finance Commission వారికి మన ఆర్థిక పరిస్థితులు సరీగా తెలియవు. అందువల్ల మనము చాలా వెనుకబడి పోయినాము అనే విషయము చెప్పి, యింకా మనకేమైనా రావలసిఉంటే తీసుకోటానికి ప్రయత్నించారు. పొగాకుమీద వచ్చిన ఆదాయములో మనకు యింకా ఏమైనా ఎక్కువగా రావలసిఉంటే, అది వేరే విషయము. ఈ విషయము మనము అందరము చెబుతాము. పోయిన అయిదుసంవత్సరాలలో Finance Commission వారు వచ్చినప్పుడు మనకు అప్పటికి ఆంధ్రరాష్ట్రము రాలేదు. మనము మద్రాసు రాష్ట్రములోనే అంతర్భాగముగా ఉన్నాము. ఇటీవలనే మనకు ప్రత్యేకంగా రాష్ట్రము ఏర్పడ్డది కాబట్టి వారియొక్క plan అంతా మార్చుకుని, యీరాష్ట్రానికి వేరుగా చేసేది యేమీకాదు. ఆ కమిషను అయిదు సంవత్సరాలకొక పర్యాయము వస్తుంది. వారు వచ్చినప్పుడు మనరాష్ట్ర పరిస్థితులు యితర రాష్ట్రాలవి సమీక్షచేసుకుని ఏరాష్ట్రానికి ఎంతయివ్వాలో చూచుకొని, దానిమీదట ప్రసిడెంటుగారికి తెలియచేస్తే అప్పుడు ప్రసిడెంటు గారు Finance Cmmission వారి సిఫార్సు ప్రకారము చేస్తారు. అప్పుడు వారు Finance Commission వారి సిఫార్సులను బట్టి ఆమోదిస్తారు. అప్పుడు మనకు రావలసిన భాగము మనకు వస్తుంది. ఇంతకుముందు మనము మద్రాసురాష్ట్రములో ఉన్నాము గనుక, మనవిషయము వారు పట్టించుకోలేదు.

ఆనాడు మదరాసు కోస్తావిషయము చెప్పవలసి వచ్చిందేగాని, మనసంగతి వేరేచెప్పు కోటానికి వీలుకాకపోయింది. ఈసంవత్సరము Finance Commission వస్తున్నది, వారువచ్చినప్పుడు చెప్పుకోవలసిన విషయాలు అన్నీ చెబుదాము. మనము చెప్పిన సంగతులనుబట్టి, వారికి అనుగ్రహమువస్తే వారుయిచ్చేది వారి దయాదాక్షిణ్యములమీద ఉంటుంది. అంటే వారుయివ్వాలని Statutory గా obligation ఏమీ లేదు. మనము కొంచెమువత్తిడిచేసి అడిగితే, మేము మీఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకంగా యివ్వటానికి వీలులేదు, బొంబాయికి, బెంగాలుకు, ఉత్తరప్రదేశ్, వగైరాలకు ఏది చేస్తామో, మీఆంధ్రరాష్ట్రానికిగూడ అదేచేస్తామని అంటున్నారు. ఇంకా కావాలంటే మీ ఆంధ్రరాష్ట్రానికి ఒక 5% యిస్తే యిస్తాము అనిఅనవచ్చును. అయినప్పటికినీ మనము చెప్పవలసిన విషయాలుఅన్నీ వారువచ్చినప్పుడు వారికి చెబుతాము. ఈకమిషను కేవలము ఒక్క డబ్బువిషయములోనే రావడము లేదు. పొగాకుమీద 35కోట్ల రూపాయిలు మన ఆంధ్రరాష్ట్రమునుంచి పోతున్నదని కొందరు చెబుతున్నారు. అన్నీ లెక్కలు కట్టిచూస్తే, 17, 18 కోట్ల కంటె వర్జీనియా పొగాకుమీద ఎక్కువ రావడములేదు. కేంద్రప్రభుత్వానికి అంతకంటే ఎక్కువ రావడములేదని కొందరు చెబుతున్నారు. ఈవిషయములో సరియైన లెక్కలు తీయడం చాలాకష్టముగాఉన్నది. ఎందుకంటే ఆంధ్రరాష్ట్రములోనుంచి వారు Bonds రూపములో తీసుకుంటున్నారు. అదిమొదట్లో కలకత్తాకు పంపించి, తేకపోతే బెంగుళూరుకు పంపించి అక్కడ సిగరెట్లుతయారు చేసేటప్పుడు Excise dutyవేస్తారు. ఆ లెక్కలు మన ఆంధ్రరాష్ట్రపు లెక్కలలోనికి రావడము లేదు. అందువల్ల మనకు సరియైనలెక్కలు తెలియాలంటే వీలుకాకుండా పోయినది. అయినప్పటికినీ మనసుందరయ్య గారు ఒక పర్యాయము అచిక్కులన్నీ వివరముగా చెప్పారు. వారుచెప్పిన దానిని బట్టి అయినా వర్జీనియా పొగాకు మీద కేంద్ర ప్రభుత్వానికి 16, 17 కోట్ల కంటే ఎక్కువగా పోవడము లేదని చెప్పినట్లు నాకుజ్ఞాపకము.

మన సుందరయ్య గారు కూడా ఒక సారి లెక్కలు చెప్పినారు. వారు చెప్పిన దానిని బట్టి 17,18 కోట్లు అని చెప్పినట్లు జ్ఞాపకం ఉన్నది. మనము Tobacco మీద ఎక్కువ కావలెనని కోరితే అహమ్మదాబాదు, బొంబాయి, మద్రాసు వారు Excise Duty ఇస్తున్నామని వారు కోరితే ఇంక Assam వారు మారాష్ట్రంలో Oil Fields ఉన్నవి, మా excise duty దాదాపు 12 కోట్లు సంపాదించుకొంటున్నారు. మాకు కిర్సనాయిలు పెట్రోలు ఉన్నది, కనుక వసూలు అయేదంతా మాకు ఇవ్వండి అని కోరితే ఎక్కడిది అక్కడకు పోతుంది, pool లోకి వచ్చేది

ఏమీ ఉండదు. మనము ఏకోరికను కోరుతున్నామో వారు కూడ అవిధముగా కోర వచ్చును. కాటను టెక్స్‌టైల్సు మీద బొంబాయి, బెంగాలు జూటుమీద, ఆయిలు మీద అస్సాము కోరవచ్చును. ఆవిషయాలు మనస్సులో పెట్టుకొని మనము డిమాండు చెయ్యవలయును. ఫైనాన్సు కమిటీవచ్చినప్పుడు అందరం శ్రద్ధ వహించి, అన్ని విషయాలు చెపుదాము. బహుశః వచ్చే 1957వ జూనులో కాబోలు వారి రిపోర్టులు ఇస్తారు. అది 1957 జులై లోఅమలులోకి వస్తుంది. ఏమైనప్పటికి కూడా మనకు కొంత న్యాయం జరుగుతుందేమో. Elementary- Education, rural communications, health facilities లో వెనుకబడి ఉన్నాము కాబట్టి వారువచ్చినపుడు మెంబర్లు అందరు కూడా వారి వారి అభిప్రాయాలు తెలుపవచ్చును. ఈ మాదిరిగా మనమందరము కూడ ప్రయత్నం చేస్తే ఫైనాన్సు కమిషను దగ్గరనుంచి ఏమైనా సంపాదించడానికి ప్రయత్నం చేద్దాము.

Fair price shops గురించి చెప్పారు. Floods విషయములో ఇప్పటికే ఆర్డర్లు వేసినాము. ఆరవ తేదీనాడు G. O issue చేసినాము. ఈ పనులన్నీ చూచివచ్చిన తరువాత ఏమి చెయ్యవలెనో ఆలోచిస్తాము. కృష్ణా పశ్చిమ గోదావరి వగైరా ప్రదేశాలలోగాని ఇతర ప్రదేశాలలో గాని ధరలు పెరిగిపోతున్నవి. గవర్నమెంటు అఫ్ ఇండియా వారితో టెలిఫోనుమీదనే contact చేసి మాకు బియ్యం కావలెనని కోరినాము. అంతకుముందు ధరలమీద 16- రూపాయలకు హైదరాబాదుకు ఇస్తాము అక్కడనుంచి మీరు గుంతకల్లుకో బెజవాడకో తీసికొని వెళ్లండి అన్నారు. వరదలు వచ్చిన తరువాతమళ్లీ టెలిఫోన్మీద మాట్లాడి మేముఎక్కడికి తీసుకపోతామో అక్కడికి 16/- రూపాయలకు ఇవ్వవలెనని కోరినాము. దానికి వారు అంగీకరించారు. దానిలో రెండు రూపాయిలు తేడావస్తుంది. 16/-రూపాయలకు హైద్రాబాదులో ఇస్తామంటే ఏ తిరుపతికో నెల్లూరుకో తీసుకుపోయేటప్పటికి ట్రాన్సుపోర్టు ఛార్జి రెండు రూపాయిలు కావచ్చును. ఆమాదిరిగా కాకుండా destinationకు 16/-కు ఇవ్వటానికి వారు అంగీకరించినారు. ఇది అంతాకూడా Fair Price Shops కు ఇస్తాము. రివెన్యూ బోర్డుకు, కలెక్టర్లకు తాఖీదులు పంపాము G. O August 6వ తేదీన జారీ అయినది. ఆ విషయముకు మేమేమీ ఉపేక్ష వహించడం లేదు. ఎక్కువధరలను తగ్గించడానికి అంటే ఈ ధరలను soaring prices ను తగ్గించడానికి ప్రయత్నములు జరుగుతున్నవి. బియ్యంధర ఎక్కువ అయినందున పేదప్రజలు బాధలు పడుతున్నారంటున్నారు. ఆ విషయములో మేము చెయ్యవలసినపని చేసినాము.

డిస్ట్రిక్టు బోర్డులు బాగులేవని చాలామంది మాట్లాడినారు. మన రామకృష్ణ రాజుగారు దానికి ఎవరు జబాబుదార్లు అని అన్నారు. ఇంతకుముందు వారు

అధికముగా వ్యయము చేసినారు కాబట్టి ఈనాడు రోడ్లమీద ఎలాంటి allotment లేకుండా ఉన్నది అనేమాట తీవ్రముగా రామకృష్ణరాజుగారు అన్నారు. ఈనాడు నిజముగా జిల్లాబోర్డుల పరిస్థితి చాలా అధ్వాన్నముగా ఉన్నది. రెండు, మూడు సంవత్సరములనుంచి స్పెషలు ఆఫీసర్లు ప్రయత్నం చేస్తున్నారు. డెఫిసిటును తగ్గించడానికి, న్యాయమైన ఖర్చులు తగ్గించిగాని ఆదాయం ఎక్కువచేసిగాని కాదు. ఈనాడు జిల్లాబోర్డురోడ్లు అధ్వాన్నముగా ఉన్నవని మంత్రులందరము పదే పదే అనుకున్నాం. మంత్రులందరికి కూడా తెలుసును. మా జిల్లాలోను, కృష్ణా, పశ్చిమ గోదావరి మొదలైన జిల్లాలలోను రోడ్లస్థితి చూచాము. గవర్నరుగారు జగ్గయ్యపేట రావాలని కోరుచున్నారు. మమ్ములను పిలువలేదు. గవర్నరుగారు రావాలట. జగ్గయ్యపేట నేను రాకపోయినప్పటికీ, వినికిడినిబట్టి, అక్కడ రోడ్లస్థితి నేను ఊహించుకోగలను. ఆ మాదిరి అన్నిజిల్లాలలోను ఉన్నది. గాని ఇది గారడీవల్ల ఏమైనా బాగు అగుతుందా అని మేము ఆలోచించాము. మాకు ఏమీ తోచడములేదు.

Sri P. NARASIMHAPPA RAO:- స్పెషలు ఆఫీసర్లు రాకముందు డిస్ట్రిక్టు బోర్డు ప్రెసిడెంట్లు అక్కడక్కడఉన్నప్పుడు డబ్బు ఎక్కడనుంచి వచ్చింది? ఇప్పుడు లేకపోవడానికి కారణము ఏమిటో మంత్రిగారు చెప్పవలెను.

The Hon Dr. B. GOPALA REDDI:- నేను ఇందాక చెప్పినది నరసింహఅప్పారావుగారు వినలేదు. ఆదాయముకన్న ఎక్కువఖర్చు చేసి popular Presidents అయినారు. వారు ఆనాడు చేసిన బకాయిలు ఇప్పుడువచ్చిన స్పెషలు ఆఫీసర్లమీద పడినది. వారు కూడా popular గా ఉంటే తరువాత వారిమీద ఆ బర్డెను ఎక్కువ కావచ్చును. ఇంతకుముందు పరిపాలనా ఫలితముగ వచ్చిన ఖర్చులు ఎక్కువ కావడంవల్లనే ఈనాడు స్పెషలు ఆఫీసర్లమీద ఉన్న burden ఆనాడు ఎక్కడనుంచో వచ్చినదీ లేదు ఈనాడు లేకపోయినదీ లేదు. శ్రీకాకుళం జిల్లాకు ఈనాడుఏమీ తక్కువకాలేదు. కొంచెము ఎక్కువే అయిఉంటుంది. నాలుగు సంవత్సరాల క్రితము ఖర్చుఎంతఉన్నది, ఆనాడు ఎంతఖర్చు అయినది చూస్తే నాలుగింతలు ఎక్కువఉన్నదని తెలుస్తుంది. శ్రీకాకుళం జిల్లాలో 3000/ రూపాయిలు ఇస్తామన్నా వాటికి శాంక్షను లేదు అని అన్నారు. ఈవేళ ఉదయం నేను లెక్కలు చూచినాను. ఈ సంవత్సరం sanction చేసిన 20 స్కూళ్లలో తొమ్మిది శ్రీకాకుళం జిల్లాలోనే. ఆ జిల్లాకు Middle Schools వచ్చినవి. Higher Forms వచ్చినవి. అక్కడి స్పెషలు ఆఫీసరు ప్రజల సహకారము తీసుకొని 4000/- రూపాయిలు వసూలుచేసి

సిఫార్సుచేసిన అన్నింటిని మేము అంగీకరించినాము. ఈ సంవత్సరము శ్రీ కాకుళం జిల్లా తొమ్మిది Middle Schools ను సంపాదించినది. సంతోషమైన విషయము.

ఈ మాదిరి విషయాలు అన్నీకూడా ఉన్నాయి. ఒకవేళ పన్నులువేసి వసూలు ఇంతకన్నా చేయ్యలేక పోయినాము.

గవర్నరుగారు చేసినదంతా చెప్పారు, చెయ్యనిది అంతాచెప్పలేదని అన్నారు. చెయ్యనిదంతా చెప్పడానికి మహాభారతం అంతా చాలదు. ఒక్కొక్క తాలూకా తీసుకుంటే మాకు ఇచ్చిన స్వాగతపత్రాలు జమచేసి అవి చెప్పడానికి ప్రారంభిస్తే మీ మహాభారతం 18 పర్వాలు చాలదు. విషయాలు నాకుతెలుసును. మహారాజైన మంచి తాలూకాలు రామచంద్రాపురం, అమలాపురం, రాజోలు, తెనాలి ఉన్నాయి. వాటికి కూడా అనేక సమస్యలు ఉన్నవి నిజమే. బైటవారు "వారికేమి రామచంద్రాపురం, అమలాపురం వారు" అని అనుకొనవచ్చును. అక్కడఉన్న సమస్యలు అక్కడ ఉన్నవి. మీరు Irrigation కావాలంటే వారు మురుగుకాలవ కావాలంటారు, మీకు గ్రామాలకు రోడ్లుకావలసి ఉంటుంది. అలాగే వారికి స్కూల్సుకావలసి ఉంటుంది.

Sri R. B. RAMAKRISHNA RAJU:- ఇక్కడ పస్తులు, అక్కడ అజీర్ణంగా ఉండవచ్చును.

The Hon. Sri K. VENKATA RAO:- అక్కడ చదరపుమైలుకు 1500 మంది ఉన్నారు. ఇక్కడ రాయలసీమలో 10 మైళ్లుకనుక వెళితే ఒకమనిషి కన్పిస్తాడు. అక్కడ (½) అర ఫర్లాంగుకు 500 మంది కనిపిస్తారు. ఈవిషయం రామక్రిష్ణరాజు గారికి తెలియదు.

The Hon. Dr. B. GOPALAREDDI:-- ఎక్కడా అజీర్ణాలులేవు. అక్కడి సమస్యలు అక్కడ ఉన్నవి. మండపేటలో బోదకాలు వ్యాధిచూస్తే మనసు ద్రవిస్తుంది, అక్కడ drainage ఏర్పాటుచేసి దోమలులేకుండా చేసినపుడు ఏప్రభుత్వమైనా గర్వముగా చెప్పుకొనవచ్చును. మీరుఏదైనా concrete గా చెబితే concrete రోడ్లు వెయ్యాడానికి మాకు అభ్యంతరము లేదు.

Sri R. B. RAMAKRISHNA RAJU:- ఈవచ్చిన డబ్బంతా మీరు deficit పూడ్చకుండా reasonable proportion ఈ రోడ్లమీద ఖర్చుచేసి మిగతాది ప్రభుత్వంవారు తీసుకోవాలని అని నా అభిప్రాయము.

The Hon Dr. B. GOPALA REDDI:- మీరు చేసిన Proposal నాకు తెలుసును. తప్పకుండా పరీక్షచేస్తాను. గాని వానివల్ల అయ్యేది ఎక్కువ ఉండదు. Deficit పూడ్చేదానికి అప్పుఇస్తున్నాంకదా ! ఈనాడు డెల్టాలో రోడ్లు బాగాలేవు అవి బాగు కావడానికి substantial amounts ఇవ్వవలసివుంది. ఏమైనా మేము గమనిస్తాము. ఎప్పుడు పన్నులు వేసినా రైతులమీద పడుతున్నదన్నమాట ఉన్నది.

Buses nationalise చెయ్యాలంటే నాకు అర్థంఅవుతుంది గాని వెంకయ్యగారు, ఇంకా కొందరు సభ్యులు "మీరు routes auction చెయ్యండి మీకు ఎంత డబ్బైనా వస్తుంది" అన్నమాట ఒకటిఉంది. గుంటూరు కృష్ణా జిల్లాలలో పర్మిట్లు అమ్ముకుంటున్నారు. 40, 50 వేలు ఇస్తున్నారు. మీరే స్వాధీనం చేసుకొని auction చేసుకుంటే గవర్నమెంటుకు Taxation ఉపరిగా వస్తుంది. ఒక్కొక్క బస్సు route మీద 40,50 వేలు మీకు లాభంవస్తుంది అని అంటున్నారు.

నేను మద్రాస్‌లో 1948 లో Transport Minister ఐనప్పటినుంచీ కూడా యీమాటవస్తూనేవుంది. నేషనలైజేషన్ విషయంకాదు, ఆక్షనింగ్ విషయం. యీవిషయంలో నేను దర్యాప్తు చేసినాను. ఒక కమిటీని వేసి కలెక్టర్‌ను D. S. P. ని ఇద్దరి ముగ్గురు non-officials ను వేసి వారిదగ్గరనుంచి ఒక రిపోర్టు తెప్పించుదామనిపిస్తోంది. ఒక్కసారిగనుక మనము చూచుకుంటే మన భారతదేశంలో ఎక్కడా కూడా యీ Motor Transport auction వేసినట్లు నాకు తెలియదు. ఏక్కడైనా వుంటే చెప్పండి. పోని ఇక్కడ కాదు. ప్రపంచములో ఎక్కడైనా సరే యీ Motor Transport ను auction చేసినారా అంటే ఎక్కడ కూడా కన్పించడము లేదు. హిందూదేశములో కాని ప్రపంచములోకాని ఎక్కడ కూడాలేనిది మన ఆంధ్ర రాష్ట్రంలో auction చేయమంటున్నారన్నమాట.

Sri D. KONDAIAH CHOWDARY:- Sales Tax మాత్రం ప్రపంచములో ఎక్కడవుంది ? ఇది కొత్తరకమైనపన్ను. దీన్నిని అందరు ఉపయోగించుకోవడం లేదేమండి?

The Hon. Dr. B. GOPALA REDDI:-- కొండయ్యగారికి తెలియదు. హిందూదేశంలో మద్రాస్ మొదటిది కావచ్చును. కాని అప్పటికే యూరప్‌లో ముఖ్యంగా ఫ్రాన్స్ వగైరా దేశాలలో యీ Sales Tax వల్ల 40% ఆదాయంలో వారికివస్తూవున్నది. కాబట్టి Sales Tax క్రొత్తది కాదు. Bus Transport ను మనము auction చేసినట్లైతే ప్రపంచానికి అంతకుకూడా మార్గ దర్శకంగా మనము

వుండబోతున్నాము. మాపార్టీవాండ్లను వారిపార్టీవాండ్లను నలుగురైదుగురిని ఒకకమిటీ వేసి దానిలో ఒక కలెక్టర్‌ను D. S. P. ను R. T.O. వేయడానికి నాకేమి అభ్యంతరములేదు. కాని ప్రపంచములో ఎక్కడా లేని పనిని మనమే ముందు చేయబోవుటకు సాహసిస్తున్నామా అని అనిపిస్తుంది. సరే ఎవరికైనా ఇచ్చినామనుకోండి. ఆయనకు monopoly యివ్వాలా ఆరోడ్డు మీద ? ఇవన్నీ కూడా సమస్యలు గా వున్నాయి. ఎన్ని సంవత్సరాలు యివ్వవలసి వుంటుంది? ఆయన ఆరోడ్డు జమీందారై తానే సర్వాధికారి ఔతాడు. ఆరోడ్డు మీద తనబస్సులే వుంటాయి. తన ఇష్టం వచ్చినవారిని ఎక్కించుకుంటాడు. ఇష్టం లేనివాండ్లను ఎక్కించుకోలేదని మీదే complaint చేయబోతారు. ఈ మాదిరిగానే nationalization విషయం ఒకటి వుంది. హైదరాబాద్‌లో Bus Transport nationalize చేసినారు. మద్రాసు సిటీలోకూడా చేసినారు. మీరుకూడా చేయండనే మాట వచ్చింది. మద్రాస్ సిటీలో మొదట కొంచెము నష్టం వచ్చినాకూడా ఇపుడు pay చేస్తున్నది. కాని వాండ్లుకూడా ఏ కోయంబత్తూరు జిల్లాకో ఏ సేలమ్ జిల్లాకుగాని extend చేయడం లేదు. Madras City లో మాత్రం పెట్టి వున్నారు. కారణాలు లేకుండా పోలేదు. హైదరాబాదులో యీనాడు nationalize చేసినారు. వాండ్లు 20-30 లక్షల రూపాయలు వాండ్ల Budget లో Credit కూడా తీసుకొని వున్నారు. కాని ఇప్పుడు వారు మైలుకు ఒక అణా charge చేస్తున్నారు. మన ఆంధ్రదేశంలో 7½ దమ్మిడీలు మాత్రమే charge చేస్తున్నారు. (This is the maximum bus fare they can charge) నేను మేల్కోటేగారిని విచారించాను. వారు మైలుకు ఒక అణా అని చెప్పారు. మీరుకూడా nationalize చేయండని చెప్పండి.

Sri PILLALAMARRI VENKATESWARLU:- Nationalize చేసిన తర్వాతలాభము వస్తుందో నష్టం వస్తుందోచూచిన తర్వాత చెప్పవలసిన మాట nationalize చేయడానికి ముందుగానే ఒక ఆటంకముగా వున్నట్లు చెప్పుతారెందుకు ?

The Hon. Dr. GOPALA REDDI:— 1949లోనేనొకసారి ఢిల్లీనుంచి లక్నోకుపోయి తర్వాత కాన్‌పూర్‌కుపోయి U. P. Nationalized Transport చూచాను. అప్పుడు లాల్‌బహద్దూర్ శాస్త్రిగారు అక్కడ Transport Minister గా వున్నారు. వారి ఆహ్వానము మీదనే నేను లక్నోకు కాన్‌పూర్‌కు పోయి చూచినాను. వారుకూడా 9 దమ్మిడీలు charge చేసేవారు. అప్పటికి అప్పుడప్పుడే ప్రారంభించారు. ఎన్ని లక్షలు లోటు వచ్చిందోనని అడిగినాను. ఏదో ఇపుడు లోటు

వస్తున్నది. తర్వాత తర్వాత లాభము ఎక్కువవచ్చునని వారు చెప్పారు. యీ మాదిరిగా గవర్నమెంటు ముఖ్యంగా Municipal Roads ను అన్నీ nationalize చేసినప్పుడు మనము fare ఎక్కువ చేయవలసి వుంటుంది. బస్సులు చెడిపోతూ వుంటాయి. చెడిపోయిన వాటిని డ్రైవర్లు కండక్టర్లు ఎక్కడనో పారవేసి పోతూంటారనే Complaints వస్తూవుంటాయి. ఇదంతా ఒక పెద్ద Organisation గా చేసుకుంటేనే తప్ప ఇది జరుగదు. యీనాడు Nationalize చేయాలంటే ధనము ఒక కోటో రెండు కోట్లో కావలసి వుంటుంది. కొన్ని Work-Stops దానికి కావలసిన బందోబస్తు అంతా చేసుకొనవలెను. ఆ ఒక్క కోటి రెండు కోట్ల రూపాయలు ఎక్కడనుంచి తీసుకునిరావాలి? Central Government వారు ఇపుడు నాగార్జునసాగర్ కు కావలసిన ద్రవ్యం యివ్వలేక పోయినపుడు గరివిడి Factory కి ధనము యివ్వలేక పోయినపుడు Rural Electrification కు యివ్వలేక పోయినపుడు ఎక్కడినుంచి యీ ద్రవ్యము తీసుకొని రావాలి? యీ రెండు కోట్ల రూపాయలు అప్పు యిచ్చేవారు. లేరు. అక్కడ ఎంత ఒత్తిడైనా కలుగజేయండి. ఒకసారి మద్రాస్ లో చెప్పినాను. Perhaps this is the highest taxation in the world అని నేను చెప్పిన తర్వాతకూడా రాజగోపాలచారిగారు సీటుకు 12-8-0 ఎక్కువ చేశారు. ఇప్పుడు రు. 30 వున్నది సీటుకు 17 రూపాయలనుంచి మేము 30 రూపాయలు చేసినాము. 30 రూపాయలనుంచి యీ రోజు రు. 42-8-0 అయినది. ఇది బహుశా ప్రపంచంలో ఎక్కడకూడా లేదేమోననిపిస్తుంది. యీ Motor Transport వల్ల యీ సంవత్సరం మనకు ఒక కోటి 75 లక్షల రూపాయలు వస్తుంది. ఇంకా ఆదాయం ఎక్కువైతే మంచిదే. ఎక్కువ మంది బస్సులను ఉపయోగించుకుంటున్నారు. ఎక్కువ లారీలు వస్తున్నాయి. వాటినుంచి మనకు Taxation కూడా ఎక్కువ వస్తుంది. దీనిని మనము జాతీయం చేయడమో లేక Auction చేయడమో జరిగితే ఎక్కువ ఆదాయం వస్తుందో లేక నష్టమే వస్తుందో మనము ఆలోచించుకోవలసి వున్నది.

Sri D. KONDIAH CHOWDARY:- సరే. ఇపుడు జాతీయం చేయడానికి డబ్బు కావాలన్నారు. Auction కు పెట్టడములో క్రొత్త principle కావాలి అన్నారు. కనీసం అడిగినవారికి Buses, Lorries కు లైసెన్సు యివ్వకుండా వుండడంబట్టి కొద్ది మందికి మాత్రమే అది monopoly ఔతుంది, కాబట్టి అడిగినవారందరికి యిస్తే taxa మనకు ఎక్కువ వస్తుంది. కాబట్టి అట్లా చేయడానికి వీలు వుంటుందా?

# DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS

[11th August 1956]

The Hon. Dr. B. GOPALA REDDI:- అడిగిన వారందరికి లైసెన్సులు యిస్తే అందరూ దివాల ఎత్తవలసిన పని జరుగుతుంది. అందువల్ల ఆంధ్ర దేశముయొక్క స్థోమతు ఎక్కువౌతుందా? యీనాడు Sugar Factories, Textile Factories వగైరాలు పెట్టుకోడానికి Licence యిస్తున్నారు. Rice Machines మాదిరి ఎక్కువైతే అందరికీ నష్టం వస్తుందనే ఉద్దేశంతోటి planned economy క్రింద Government of India వారు Licence యిస్తున్నారు. అందరికీ నష్టము వస్తే ఆంధ్ర రాష్ట్రానికే నష్టం వస్తుంది. Sugar Factories మొదలైనవాటికి మూల ధనము పెట్టేవారు లేకుండాపోయి అంతా కూడా బస్సులలో నష్టపడిన వారౌతారు. అందువల్ల మనము జాగ్రత్తగా చూచుకోవాలి. ఎన్ని కావాలో అన్ని పెట్టుకోవడము అందరికికూడా లాభము వచ్చేటట్లు చూచుకోవాలి. వాండ్లకు లాభము వచ్చినపుడే మనకు లాభంకాని, వాండ్లందరు వ్రేళ్లు కాల్చుకున్న తర్వాత మనకేమి లాభం లేదు. ఆ విషయంకూడా మనము ఆలోచించుకోవలసియున్నది. మన Andhra University రామనాధంగారు ఒక రిపోర్టు తయారు చేసినారు. వారి లెక్కల ప్రకారంగా ఆంధ్రదేశంలో వున్న బస్సులన్నీ కూడా మార్వాడీ తాకట్టు క్రింద వున్నాయి. వారంతా ఏదో ఐశ్వర్యాన్ని అనుభవిస్తున్నామనుకుంటూ వుంటారు. మన ఆంధ్ర దేశంలో యీనాడు కోటి, రెండుకోట్లు రూపాయలు తాకట్టు క్రింద ఎవరికో వున్నదనే లెక్కలుకూడా వారు చెప్పినారు. దానికి ఒక కమిటీ వేసి మనము చూచుకుంటే చూచుకోవచ్చు.

అన్నిటికన్న ఎక్కువగ వెంకటేశ్వర్లు గారు "మీరు శాసనసభలో చేసిన వాగ్దాలను తీర్చుకోలేక పోతున్నారు, III Form వరకు జీతం లేకుండా చేస్తామన్నమాట మీరు నిర్వహించుకోలేకపోతున్నారు అని అన్నారు. నక్షత్రకుని లాగా హరిశ్చంద్రుణ్ణి, ఆమాట నీవుచెప్పినావా లేదా, ఇప్పుడైనా చెప్పు, చెప్పలేదని చెప్పు,నేను పోతాను" అని సినిమాలో చూచినట్లుగా ఉంది. అట్లా వాగ్దానంచేసిన మాటనిజమే. నేను ఆడినమాట కాదని చెప్పడంలేదు. కాని "ఈ నాడు ఎందుకు చేయలేక పోయాను అన్నమాట కొంచెం ఉదారంగా ఆలోచించ కూడదా" అని విజ్ఞప్తి చేస్తున్నాను. వాగ్దానాన్ని భగ్నము చేసుకొని, త్రోసి పుచ్చినేను సంతోషపడుతున్నానని అనుకోవద్దు. మాకు Sales Tax ద్వారా 60 లక్షలు అదనంగా వస్తుందని చెప్పాను. అయితే 26 లక్షలు మాత్రమే వచ్చింది. ఎందుకు వచ్చింది ఆమాదిరిగా అంటే, మావద్గర సరియైన statistics లేవు కాబట్టి, చెప్పలేకుండా ఉన్నాను. ఈ III form విషయంలో కూడ, ఆ file తెచ్చాను, రాత్రంత

చదివాను. 1955 August లో మాకు 12 లక్షలు రూపాయలు అదనంగా అవు తుంది. ఉచితంగా విద్య 3rd form వరకు ఇస్తానని మాట ఇచ్చాను.

తర్వాత రెండుమూడు నెలలకు అది 15 లక్షలు అయింది. పార్టీ మీటింగు లో చెప్పింది అదే. ఇక్కడ చెప్పింది అదే. Municipality లకు గ్రాంటు తీసి వేసినందువల్ల 7 లక్షల రూపాయలు, Entertainment tax వల్ల ఇంకొక 4లక్షల రూపాయలు మొత్తం 11 లక్షలు వస్తుంది; ఇంకొక 3,4 లక్షల రూపాయలు అయితే మేము తేలికగా దీనిని భరించుకోగలము. కాబట్టి చేస్తామని చెప్పడం జరిగింది. తర్వాత మార్చినెల వచ్చేటప్పటికి అంచెనా 22లక్షల రూపాయలు అయింది. తర్వాత నేను Finance Department వారిని Local Administration Department వారిని Education Department వారందరినీ పిలిచి June లో ఒక Conference పెట్టి ఏమాదిరిగ compensation ఇవ్వాలి అన్న విషయం ఆలోచిం చాము. G. O. pass చేయవచ్చును. కాని ఈ భారమంతా ఎవరిది? వస్తున్న ఆదాయమంతా పోగొట్టు కొన్న తర్వాత ఈజిల్లా బోర్డులు, తాలూకాబోర్డులు, private institutions, Mission institutions, ఇతర విధములైన institutions ఉంటాయి, వీండ్లకు ఏరకమైన Compensation ఇవ్వాలనే విషయం వచ్చింది. అందరమూ కూర్చొని దాదాపు 15 మంది ఆఫీసర్లతో ఆలోచించాము. చెప్పిన వాగ్దానాలన్ని జ్ఞాపకంలో ఉన్నాయి. Compensation వచ్చేటప్పటికి తీరా 36 లక్షలు అవుతుందని చెప్పారు. నేను నిజంగా అప్పుడు ప్రతిష్ఠమీద నిలబడి చేయడమా లేకుంటే ఇది అక్కరలేదా అని ఆలోచించుకో వలసివచ్చింది' మీ మునిసి పాలిటీలు మీ 7 లక్షలు మీరుతీసుకోండి, మేము ఇప్పుడు చేసేస్థితిలో లేము' అనిచెప్ప వలసి వస్తుందే అని నాకే భయంవేసింది. నేను మొట్టమొదట alright అని కొంచెం ధైర్యంచేసి, ప్రస్తుత ఆర్థిక స్థితులను బట్టి ఈ సాహస కృత్యాన్ని చేయలేము. మీరు మీడబ్బును తీసుకోండి అనిచెప్పుదామా అని అనిపించింది. కాని అప్పుడు మళ్ళా వెంకటేశ్వర్లుగారు జ్ఞాపకం వచ్చారు. ఇంతదూరంపోయి, ఇంత వాగ్దానం చేసి, ఇంత ఉత్సాహంకలుగజేసి, ఉచితంగా విద్యచెప్పుతామని తల్లిదండ్రులకు ఆశ కల్పించి ఒక్కసారిగా right about turn చేసినారనే ఆక్షేపణ వస్తుంది, దేశంలో దీనిని హర్షించరు అనే మాటకూడ జ్ఞాపకం వచ్చింది. అందువల్ల ఈ రెంటికీ మధ్య compromise గా బాలికలకు మాత్రం ఈ సంవత్సరమే మూడు ఫారాల వారికి ఉచిత విద్య అని, బాలురకు ఈ సంవత్సరం మొదటి ఫారం తర్వాత రెండవ ఫారానికి, ఆతర్వాత మూడవ ఫారానికి అని చేయవలసి వచ్చింది, ఒక్కొక్క

సంవత్సరం. 36 లక్షలు రూపాయలు దీనికి compensation ఇవ్వవలెనని వాండ్లు చెప్పారు. మొదట 12 లక్షల క్రింద బయలు దేరింది తర్వాత 15 అయింది. 22 అయింది, 36 అయింది. అప్పుడు ఏమిచేయమంటారో నాకు సలహాచెప్పండి. నా వాగ్దాన ప్రకారంగా, సత్యహరిశ్చంద్రుని మాదిరిగా అడవుల లోకి పొమ్మంటారా? చంద్రమతిని అమ్ముకోమంటారా? లేకుంటే పన్నులు రెండు మూడు సంవత్సరాలు అపి కొంత ఊపిరి పీల్చుకోడానికి వీలుకలుగ జేసుకోమంటారా? అప్పుడు ఉన్నటువంటి పరిస్థితులలో నేను చేసినటువంటిపని సాహసమైనపని నేను చేయవలసిన పనికాదు అని కూడా చెప్పుతున్నాను. నేను ఆనాడు వాగ్దానం చేసినమాట నిజమే. మీరందరు తొందర చేశారు. మా పార్టీలో తొందర చేశారు ఏదో popularగ ఉంటుంది, అని Constitutionలో 1960 నాటికి అంతా ఉచిత విద్య చేయవలెననే directive principal ఉంది అని, ఆదర్శ ప్రాయంగా ఉంటుందని ఆ idealism మీదనే నేను పోయాను, పోవలసిన మాటకాదు. ఇది న్యాయంగా చేయవలసిన పనికాదు. అందరుకూడ జీతాలు ఇచ్చుకోండి. మీరు రు. 2-12-0 కాదు, 3-4-0 లేక 3-8-0 ఇచ్చుకోండి అని చెప్పవలసిన వాడను నేను. అయినా దేశంలో ఉండే వాతావరణాన్ని బట్టి, directive principleను చూచి ఒప్పు కొన్నాం. ఈ సంవత్సరం first form ప్రారంభించే generation మేము 3rd form వరకు ఉచితంగా చదువుతున్నామని చెప్పుకోవచ్చు. ఇప్పుడు 2nd form లోకి వచ్చినవాడు జీతం కట్టడానికి సాహసించే వచ్చాడు. అట్లే 2nd form 3rd ఫారంలోకి, పైక్లాసులకు. కాని ఈ సంవత్సరం 1st form నుంచి బయలు దేరి ఉంటే 3rd form వరకు మేము 3 సంవత్సరములు జీతం కట్టం, మేము 4th form లోకి పోయినపుడే జీతంకట్టేది, అనే భావంగా చెప్పడానికి ఉండేటువంటి ఒక generationను తయారు చేయాలనే ఉద్దేశంతో చేసింది. దురుద్దేశంలేదు. వాగ్దానం భగ్నం చేసుకోవాలని కాదు. అయినప్పటికి కూడ ఇదిసాహసమైన కార్యము. ఈ సంవత్సరానికే higher elementary schools నుంచి చాలామంది 1st formలోకి వచ్చివేస్తున్నారు. చాలా middle schools పెట్టవలసి వస్తుంది అనేకచోట్లనుంచి clamour వస్తుంది. మీరుచెప్పిన శ్రీకాకుళమే కాదు, ప్రతి mission school, ప్రతిచోట కూడ higher elementary schoolను middle school గ convert చేయండి అని applicationలు వస్తున్నాయి. తప్ప కుండా దీనివల్ల middle schools లో చదువుకునే విద్యార్థులు చాలామంది ఎక్కువ కాబోతున్నారనే దానిలో సందేహంలేదు. కాబట్టి ఒకవేళ చెప్పినమాట నెరవేర్చు కోలేకపోయినప్పటికి, G. O లో ఇంకా decision లేకుండానే వచ్చే 57వ సం

వత్సరం జూలైలో ఇది 2nd form కు అమలుకు వస్తుంది. 58 Julyలో 3rd form కు వస్తుంది అని అసందిగ్ధంగా చెప్పాము. కాబట్టి వారు దానిని గురించి ఆట్టే మమ్ములను, మీరుఇచ్చిన వాగ్దానాలను చెల్లించుకోలేదని చెప్తుంటే, మాకు నక్షత్రకుడు జ్ఞాపకం వస్తూ ఉంటాడు.

Sri V. VISWESWARA RAO:-వారు ఎక్కువగా middle school కావలెనని చెప్పవస్తున్నారు. 1st form నుంచి free educationను introduce చేయడం వల్లనే middle school కావాలని ఎక్కువమంది ముందుకు వస్తున్నారు అని చెప్పుతున్నారు. దానికన్న 1st form లోనే 11 సంవత్సరములు వయస్సు వచ్చినవాండ్లు చేరాలి అనునియమం పెట్టవలెను. ప్రతివాడు 1st form లో చేరినపుడు high school education కు అవకాశం ఉంటుందనే ఉద్దేశంతో, వస్తున్నారని వారుగుర్తించవలసిన అవసరం ఉంది అని అనుకుంటాను.

The Hon Dr. B. GOPALA REDDI:- నాకు ఇంకొక ఆశ్చర్యం, నేను క్రిష్ణాజిల్లాకు Tour పోయినపుడు, మావెల్లంకి విశ్వేశ్వరరావు గారు, వారి ఉపన్యాసంలోకూడ ఒక విషయంచెప్పారు, మీరంతా పరీక్షలలో ఇన్ని మార్కులు వస్తేగాని Pass చేయవద్దని శాసిస్తున్నారు: ఏమిఅన్యాయం, ఘోరం, రాక్షసం. అని నాకు చాలవిచారం వేస్తుంది. మేము డిశంబరులోనో, జనవరిలోనో, ఫిబ్రవరిలోనో మార్చిలోనో ఎప్పటికి అయినప్పటికి; ఏదో కొంత ప్రయత్నంచేసి ఒక G. O issue చేసి, Headmaster లందరిని కొంచెం భుజంపట్టుకొని ఆపెంచి, మీరు కొంచెం మార్కులు వచ్చినవాండ్లనే Pass చేయండి అనిచెప్పడం, వారు హర్షిస్తారని అనుకొన్నాను. గాని అది ఒకతప్పుగా మామీద నేరారోపణ చేస్తున్నారు. Standards బాగుచేయడానికి చేసినపని. ఒక Headmaster ను తెలుసు, పేరు చెప్పవలచుకొనలేదు- సున్నమార్కులు రాకపోతే నేను Pass చేస్తాను అని కొన్ని సంవత్సరముల నుంచి ఆయన Pass చేసుకొంటూ వస్తున్నాడు, 1st నుంచి 2nd కు, 2nd నుంచి 3rd కు ఒక్కమార్కు వస్తేచాలును. ఇంగ్లీషులో ఒక్కమార్కు వచ్చింది. సున్నరాలేదు కాబట్టి 1st form నుంచి 2nd Form కు పో, పైకిపో అనే మాదిరిగా Headmaster లందరు ఉంటే వాండ్లకు discretion ఉండి లాభమేమి. కాబట్టి ఇంతకు ముందు ఉండిన G. O లు ఏమిటి: Promotion from form to form is entirly left to the discretion of the Headmasters" ఆయన చాల ఉత్తముడు, న్యాయంగా

చూపు కొంటాము అనే భావంతో చేసినారు. కాని కొందరు Headmaster లు వాండ్ల యొక్క ఔదార్యం ఏంట్లో చూపించారు, మనకెందుకు వాండ్లను fail చేయించిన పాపం, వాండ్ల తల్లిదండ్రులచే ఎందుకు చీవాట్లు తినడం, వీధిలో పోతుంటే రాళ్లు కొట్టించుకోవడం? కాబట్టి pass చేస్తూ School final వరకు పోతుంటాము అనే భావంతో కొందరు Headmaster లు ఔదార్యంగా ఉంటూ వచ్చినారు, ప్రభుత్వం ఏదో ఇన్నిమార్కులు వస్తేగాని pass చేయవద్దని చెప్పడం అన్యాయం అయినదా? అందువల్ల చేయరాని పెద్దపని, చెప్పరాని దోషము ఏదైనా చేసినారా అని నేను అడుగుతున్నాను. తప్పకుండా ఈ విషయాలలో మనమందరం కూడ శ్రద్ధవహించవలెను. ఆది సుందరయ్య గారు వచ్చినతర్వాత, కమ్యూనిస్టు నాయకులందరిని, D. P. I. Vice Chancellor ,అందరిని పిలిపించుకొని Students విషయంలో Standards improve చేయడానికి, వాండ్లను Politics లో రాకుండా చేయడానికి, మనం Agents గ ఉపయోగించు -కోకుండా ఉండడానికి, ఏమిచేయాలో, ఒక Conference పెట్టి చర్చించవలసి యున్నది. ఎందుకంటె, Students విషయంలో మొన్ననే అలహాబాదు incidents ను గురించి ఒక enquiry చేశారు, హైకోర్టు జడ్జీ గారు ఎంక్వయిరీ చేశినారు. ఎందుకు ఇంత indiscipline ఉంది అంటే, అనేక కారణాలు చెప్పుకుంటూ వచ్చి, అన్నిటికన్న ప్రధానమైన కారణాలు ఈ రాజకీయపార్టీల వారు అంతాకూడ లేనిపోని ప్రోత్సాహం కలుగ చేస్తున్నారన్నటువంటి మాట వారుచెప్పినారు. అప్పటినుంచి కూడ మన ఆంధ్రదేశానికి సంబంధించినంత వరకు అనేక విషయాలలో వెనుకబడి ఉన్నాం. నిన్ననే ప్రశ్నకు జవాబుచెప్పినాను. I. A. S లో 15 మంది వస్తే నలుగురు ఆంధ్రులని చెప్పినాను, ఇంకా ఎక్కువమంది ఇటువంటి Competitive examination లలో రావలసియున్నది. దానికి మనమందరము కూడ కలసి ఏమిచేయవలెను? మన బాధ్యత ఎంతవరకు ఉన్నది, Headmaster ల బాధ్యత ఎంత? తల్లిదండ్రుల బాధ్యత ఎంత? ఇవిఅన్నికూడా గుర్తించుకొని ఈ Standards improve చేయడానికి మనం ప్రయత్నం చేసుకోవలెను. గాని ఈ విషయంలో వెల్లంకి విశ్వేశ్వరరావుగారు తప్పు పట్టుతారని నేను కలలోకూడ అనుకోలేదు.

అది సరే, 5 మార్కులు వచ్చినవాడు 4 th form కు పోకపోతే ఏమి? ఏ ఆకాశము క్రింద పడుతుంది. ఆయనను ఇంకా కొన్నాళ్లు అక్కడనే ఉండనీయండి. 3rd form (hons) చదువ నియ్యండి. July లో ఇవ్వలేక పోయాము, December లో నైనా ఇచ్చినందుకు సంతోషించండి. ఎప్పుడో ఒకప్పుడు

standards ను improve చేయడానికి ప్రయత్నం చేసినందుకు వారు సంతోషించకుండా, జూలైలో ఇవ్వలేము కాబట్టి, ఇక ఇవ్వవద్దు అంటే ఆయన జూలైలో 5 మార్కులకే Pass అవుతానని అనుకొంటూ ఉంటాడా? December లో 15 మార్కులు కావాలి. 25 కావాలి అనుకొన్నారా? ఎప్పుడు అయినప్పటికీ కూడ 35, 40 మార్కులు వస్తేగాని మనం Pass కాము అన్న భావంతో విద్యార్థి బయలుదేరాలి కాని, 5 మార్కులు వచ్చినా Pass అవుతాము, మధ్యలో 25 మార్కులు చేశారు, కాబట్టి నేను fail అయ్యాను. అని అనుకోవడం న్యాయం కాదు. అట్లాగే ఈ School Final విషయంలోకూడ.

అట్లానే ఈ School Final విషయంలో S.S.L.C. పరీక్షలకు పోయిన సంవత్సరంకంటే ఈ సంవత్సరం ఆరు వేల మంది ఎక్కువగా appear అయినారు. పోయిన సంవత్సరముకంటె ఈ సంవత్సరం 5% Pass కూడ ఎక్కువయింది. అంతకు ముందు 38% ఉండింది. ఈ సంవత్సరం 43% ప్యాసు అయినారు. చాలా సంతోషమైనటువంటి విషయం. కానీ నా దగ్గర ఎక్కడెక్కడ ఎక్కువ Percentage of Marks వచ్చిన Schools. 10% కూడా రాని స్కూళ్ల వాటి పేర్లు నా దగ్గర ఉన్నాయి. నా దగ్గర వాటి లెక్కలన్నీ ఉన్నాయి. ఇవన్నీకూడా పత్రికలకు ఇవ్వాలని అనుకొంటున్నాను. ఒక్క విషయాన్ని ఇక్కడ West Godavari సభ్యులకు చెప్పదలచుకొన్నాను. పోయిన సంవత్సరంకూడా Percentage of Passes లో West Godavari Lost గా వచ్చింది. కేవలం ఒక సంవత్సరం అయితే పరవాలేదు. (Dt. Average)

Sri S. K. V. KRISHNAVATHARAM:- పోయిన సంవత్సరం 22% వచ్చింది. ఈ సంవత్సరం 38% వచ్చింది.

The Hon. Dr. B. GOPALA REDDI:- That is alright very good 22% నుంచి 38% వరకు వచ్చినందులకు సంతోషమే. కానీ ఈనాటికి కూడా 11 District లలో ఆ District లోనే తక్కువ Percentage ఉన్నవి. ఇక్కడ చూడండి. 10% రానటువంటి స్కూళ్లు, ఇంకా సున్న వచ్చినటువంటి స్కూలు నరసరావుపేట తాలూకాలో ఒకటి ఉన్నది. ఎక్కువ వచ్చినటువంటి వాటి పేర్లను మాత్రం చదువుతాను. పాపం అది న్యాయం కాదు, తక్కువ వచ్చినవాళ్ళను గురించి చెప్పితే ఎగతాళి చేసినట్లుగా ఉంటుంది.

1) Bishop Harzariah High School, Vijayawada 93.%
2) Antony High School, Visakhapatnam 92.7%
3) Sai Baba National High School, Anantapur 89%

ఈ విషయంలో Saibaba National High Scoool, Anantapur last year 2 nd గా వచ్చింది, కాబట్టి రెండు సంవత్సరములు అట్లు వాళ్ళు Standards ను maintain చేస్తున్నారంటే తప్పకుండా Congratulate చేయవలసిన విషయం: 89 %:

4) Board High School, Sangam Jagarlamoodi 88%
5) Board High School, Koonavaram, E. Godawari 87-5%
6) Board High School, గొంపలగూడెం: 87% ఈ మాదిరిగా వచ్చినాయి. కొంచెం Percentage ఎక్కువ అయింది. Students కూడా ఈ సంవత్సరం 6 వేల మంది ఎక్కువ appear అయినారు. అంతకు ముందు సంవత్సరం 45 వేల మంది School Final పరీక్షలకు appear అయితే ఈ సంవత్సరం 51 వేల మంది appear అయినారు. ఇంకా Pre-University Course అవన్నీ కూడా వస్తున్నాయి. వారందరుకూడా సరిఅయినటువంటి మార్గంలో శిక్షణ పొంది. తరిఫీదు కావాలని నేను కోరుతున్నాను. ఇక అన్నిటికన్న పెద్ద విషయాన్ని నేను కడపటికి పెట్టుకొన్నాను. Time అయిపోయింది. దానిని ఇంకెప్పుడైనా చెప్పమంటారా ?

An Hon. Member:- Land Reforms విషయం చెప్పాలి.

Sri. D. KONDAIAH CHOWDARY:- Forest Reservations ను గురించి చెప్పరామన్నారు.

The Hon. Dr. B. GOPALA REDDI ఈ Estates Land Act, విషయంగా దానికి కావలసిన సిబ్బంది. అంతా ఇటీవలనే Sanction చేసినారు. ఎక్కడ యేమేమి కావలెనో అది అంతాకూడ కొంత ఆలస్యమైంది. C. C. F. అడిగారు. ఆ సిబ్బందినంతాకూడా మేము sanction చేసినాము. త్వరలోనే వాటన్నిటినీకూడా Demarkate చేసి ఈ Estate గ్రామాల్లో ( ఈ Taken over estates ) లో ఉన్న ఇబ్బందులన్నిటినికూడా వాళ్లు తొలగించుకొంటారని నేను ఆశిస్తున్నాను. మేము C. C. F. కు కూడా ఆ విషయాన్ని పదే పదే చెప్పుతున్నాం. అలా కష్టాలు పెట్టాలని ఎవరికీ కుతూహలంగా లేదని నేను గౌరవనీయ సభ్యులకు మరల తెలియ చేస్తున్నాను.

Sri G. YELLAMANDA REDDI:- అధ్యక్షా: ఈ గ్రామాలలో అసలు అధికారం లేకుండా పోయిన సంవత్సరము పుల్లరిని వసూలు చేశారు. దానిని ప్రభుత్వం దృష్టికి తీసుకొని వచ్చాం. మళ్లా ఈ సంవత్సరం తాఖీదులు తీసుకొని వచ్చి

నట్లుగా పుల్లరి విషయంలో taken over estates లో ఒక ప్రైపున పర్మిట్లను issue చేస్తూ రెండో ప్రైపున Revenue Officials ఏదో పుల్లరి వసూలు చేస్తున్నారన్నమాట,

The Hon. Dr. B. GOPALA REDDI:- మీరుచెప్పేది నాకు మాత్రం స్పష్టంగా బోధపడటం లేదు. పుల్లరిని మామూలుగా వసూలు చేయాలి. తర్వాత ఆ విషయాన్నిగురించి ఏమైనా ఉంటే Obula Reddy గారితో గానీ, నాతోగానీ చెప్పండి. ప్రత్యేకంగా ఎక్కడయినా ఏదయినా ఇబ్బందులు ఉంటే దానిని చూచుకొందాం. బహుశా ఇప్పుడు Land reforms లో ఉన్నటువంటి సమస్యలనూ, సాధకబాధకాల నన్నింటినీ నిన్న రాత్రి ప్లానింగు కమిషన్ రిపోర్టును కొంతవరకూ, సుబ్బారావుగారి రిపోర్టును, First Five Year Plan, directive Principles ఇవి నన్నిటినీకూడా నేను Study చేసుకొని కొంత Notesను కూడా రాసుకొని వచ్చినాను. దీంట్లోచాలా సాధకబాధకాలు ఉన్నాయి. కాని ఇప్పుడే నేను అనుకొన్న దానికంటే ఎక్కువ time అయిపోయింది. కాబట్టి రేపు ప్రొద్దున ఎప్పుడైనా అవకాశం గల్గినప్పుడు విపులంగా చెప్పుదామనుకుంటున్నాను. అందువల్ల ఇప్పుడు నేను ప్రత్యేకంగా దానిని గురించి చెప్పజాలనందులకు క్షమించండి. తప్పకుండా ఈ విషయంలో సాధకబాధకాలన్నీ కూడా మనం చూచుకొందాం, ఈ విషయంలో ఎవ్వరూకూడ "భూస్వాములను సంరక్షించడానికి కుతూహల పడుతున్నారు" అన్నమాటను అనుకోనక్కర లేదు. ఇప్పుడు అన్ని రాష్ట్రములలో ఏమి జరుగుచున్నవో మాకు తెలుసు. మద్రాసులో ఏమి జరుగుచున్నదో, మైసూరులో ఏమి జరుగుచున్నదో, U.P.లో ఏమి జరుగుచున్నదో, బీహారులో ఏమి జరుగుతున్నదో అవన్నీకూడా మాకు తెలుసు. మీకు కేవలం ఒక హైదరాబాదే కనబడుతూంటుంది. మాకు యావద్భారతదేశం కనబడుతూ ఉంటుంది. అందువల్ల కొంచెం దృక్పథంలో తేడాలుండవచ్చును. ఇతర రాష్ట్రాలలో ఎందుకు చేసుకోలేక పోతున్నారు? సౌరాష్ట్రంలో ఎందుకు చేసుకోలేక పోతున్నారు? బీహారులో ఎందుకు చేసుకోలేక పోతున్నారు. మద్రాసులో ఏమిచేశారో మైసూరులో ఏమి చేయలేదో ఇవన్నీకూడా కొంతవరకు సమీక్షచేసుకొని, చేసుకుంటే మంచిది కానీ, ఏదో ఆంధ్రప్రభుత్వం ఈ Land Reforms విషయంలో చాల కుంటినడక నడుస్తున్నది. హంసయానయగుచున్నది. గజగమనయగుచున్నది అన్నమాటగా మీరు ఏమీ అనుకోనక్కరలేదు. తర్వాత ఈ భూస్వాముల విషయంలో కూడా అట్టి దాక్షిణ్యం చూపించేదేమీ లేదు. ఈ ప్రభుత్వంకూడా ఈ 15,16 మా సాల్లో, ఇంతకుముందు

death duties ఈ Agricultural Landsకు లేకుండా ఉంచినది. మనము మొదటి సమావేశంలోనే ఈ agricultural lands ను దీంట్లోకి జొరుపుకుందామని Pass చేసుకొన్నాం. దానిని ఏలాంటి భేదాభిప్రాయం లేకుండానే చేసుకొన్నాం. ఆ విషయంలో ఒక పెద్ద ముందంజ వేసినామని చెప్పుకోవచ్చును, అది conservative land lords నందరినీ ఉంచుకోవటానికి చేసిందికాదు. అట్లనే ఇనాం abolition రేపు వస్తున్నది. ఇనాందారుల విషయంలో ఇంకా మద్రాసువారు ఏమీ అనుకోవడంకూడా లేదు. అయినప్పటికీ కూడా Inams abolition చేయాలన్న మాదిరిగా మన ఆంధ్రశాసనసభ ముందుకు రేపు ప్రొద్దున చంద్రమౌళిగారు ఆ బిల్లును తీసుకొని రాబోతున్నారు అదికూడా ఇనాందారులనో జమీందారులనో సంరక్షించడానికి చేసిందికాదు. జమీందారీలను abolish చేసింది కళావెంకట్రావుగారయితే ఇనాందారులను abolish చేసేది ఈనాడు చంద్రమౌళిగారు కాబోతున్నారు. ఆ విషయంలో కూడా ప్రభుత్వంవారు శాసనమును తీసుకొని రాబోతున్నారు, ఇక ఈ tenancy, security, fairrent వగైరాలకు అంతాకూడా ఒక Ordinence issue చేయబడింది. అదికూడా అమల్లోకి రాబోతున్నది. చట్టంలోకి రాబోతున్నది. అట్లనే full assesments on inams. ఇంతకుముందు పాపం ఎన్నాళ్లనుంచో ఇనాములను ఇచ్చుకొంటూ వచ్చినారు. ఏదో 1-4-0, 0-12-0 ఇలా ఇస్తున్నటువంటి ఇనాములమీద ఈనాడు మీరు full assesment కట్టాలిఅని చెప్పినాం, ఒక్క east గోదావరి district మీదనే 12 లక్షల రూపాయలు పడబోతున్నది. గుంటూరు జిల్లామీద 5 లక్షల రూపాయలు పడబోతున్నది. ఈ full assesment ను మేము వేయబోతున్నాం. అదికూడా Conservative విధానం కాదు. ముందుకు పోతున్న విషయమే. అట్లనే ఈ graded sur-charge. పోయిన సంవత్సరం మనం graded surchargeని వేసుకొన్నాం. పెద్ద భూస్వాములమీద మీరు అదనంగా రూపాయకు 8 అణాల వరకూ ఇవ్వండి, అయిదు వందలకు పైబడిన భూస్వాములయితే మీరు తప్పకుండా ఇంతకుముందు 5 వందలను ఇస్తూఉంటే ఇకమీదట మీరు 750 రూపాయలు ఇవ్వండి అనేమాదిరిగ ఒక Progressive graded sur-charge ని విధించుకొన్నాం.

Sri PILLALAMARRI VENKATESWARLU:- అంతకు పూర్వం రూపాయకు 15 అణాలను వసూలు చేస్తామని పెట్టారు.

The Hon. Dr. B. GOPALA REDDI:- ఆమాదిరి ఏదోకొంత జరిగింది. ఇప్పుడు ఈ అయిదు విషయాలను చూస్తే, ఈ death duty క్రింద

lands, inams abolition, tenancy security fair rent, assessment on inams, and graded surcharge, ఇవన్నీ కూడా చూచినవాండ్లు ఎవరైన వీరు భూస్వాములకోసం ఉన్నటువంటి ప్రభుత్వం అనటానికి వీలులేదు. తప్పకుండా నెమ్మదిగా మనం తీసుకొని పోతున్నాం. తర్వాత మనం కావాలంటే ఈ సీలింగును ఆలోచించుకొందాం. హైదరాబాదుకు పోతున్నాం. అక్కడ వాళ్లకు ఏదోకొంత అనుభవం ఉన్నది. ఆ అనుభవం ప్రకారంగా కూడా మనంచేసుకోవచ్చును. కాబట్టి తొందరపడి ఈ September లోనే పెట్టలేదే? ఇంకా ఇదిచెయ్యలేదే? లక్కరాజు సుబ్బారావు గారిని మీరు ఎందుకు Congratulate చేసినారు. గవర్నరుగారు దీనిని పెద్దగా congratulate చేయవలసిన రిపోర్టా? అని ఆక్షేపణ చేస్తే ప్రయోజనంలేదు. వాళ్లు అయిదుమంది మన కన్నా ఎక్కువ అనుభవంకల్గినటువంటి వాళ్లు. B.S. మూర్తిగారున్నారు, నాగభూషణం గారున్నారు. ఒక Backward class మెంబరున్నారు. ఒక Harijan మెంబరున్నారు. Director of Agriculture గారున్నారు. తర్వాతమన రామయ్య నాయుడు గారున్నారు. లక్కరాజు సుబ్బారావు గారున్నారు. ఈ అయిదుగురు మనకన్నా వయస్సులో పెద్దవారే. వారందరును కలిసి సమగ్రమైన ఒక రిపోర్టును ఇచ్చినారు. ఆ report లోని Data నంతను మీరు తీసుకొండి. మీరు రాజకీయ దృక్పథంతో దానిని మార్చుకోవాలంటే మార్చుకొండి. దానికి వాళ్ళే మీ ఆక్షేపణ చెప్పటంలేదు. కానీ వాళ్లుకొంత Data ను సేకరించి మీముందు పెట్టినారు. మీ ఇష్టంవచ్చినట్లుగా దానిని త్రిప్పుకోవచ్చును. అంతేకాని ఆ రిపోర్టును తయారుచేసిన దానికి అభినందించి నప్పటికి కూడా దోషంపట్టడం అదేమి న్యాయంకాదు. ఈ Land reforms లో నుండే విషయాన్నంతా కూడా నేను తర్వాత చెప్పుతాను. దీంట్లో ఎవరూ ఏమీ వెనుకంజ వేస్తున్న విషయమేమి లేదు. ఇప్పుడు ఈ నాడు Hindu Code reforms జరుగుచున్నవి. Marriage and diverse అని ఒకటి పెట్టుకొన్నారు. తర్వాత succession అని ఒకటి పెట్టుకొంటున్నారు. Adoption పెట్టుకో బోతున్నారు. ఇది అంతా కూడా piecemeal గా చేసుకొంటున్నారు. Land reforms అన్నమాట ఒక చిన్న విషయంకాదు.

భూసంస్కరణల విషయంలో అనేక సమస్యలున్నాయి. ఈ విషయమై చాలా మంది పెద్దలు, అనుభవజ్ఞులు చర్చలు జరిపారు. ఈ నాడు మనం భూసంస్కరణలు అమలుపరిచినట్లయితే భూస్వాములకు కొంత Compensation ఇవ్వాలి. Compensation ఏవిధంగా యివ్వాలో ఆలోచించాలి. ఇప్పుడు ceiling పెట్ట

ఐపిన రైతు తనకుమారుణ్ణి ఏ ఇంజనీరింగు కాలేజీలోనో, Medical college లోనో చేర్పించాలనుకుంటాడు. అది సహజము. అటువంటి వారి విషయం మనమంతా కూడా ఆలోచించాలి. 1200 రు॥ లు ఆదాయంవచ్చే భూమిని ఆ రైతుకు ఉంచాలని Planning Committee వారు సూచించారు కదా? మీరు ఎందుకు అమలుజరుపుట లేదు" అనికొంత మంది అంటున్నారు. ఆప్రకారంగా 12 వందల రు॥లు ఉంచినట్లయితే ఆ రైతు తన కుమారుని Medical college కుగాని, Engineering college కు గాని పంపించడానికి వీలవుతుందా? వీలుండదు (interraption) రైతుల బిడ్డ లెవ్వరిని Medical college కో, Engineering college కో పంపించడానికి వీలులేదని కొంతమంది భయపడుతున్నారు. అటువంటి అభిప్రాయం ప్రభుత్వానికి లేదు. ప్రథమపంచవర్ష ప్రణాళికలో Planning Commission వారు చెప్పిన అభిప్రాయాలే ఇవి. 2nd Draft Five Year Plan లోనూ, తరువాత final report లోనూ Planning commission వారు వెల్లడించిన అభిప్రాయాలే యివి. పదే పదే వారి అభిప్రాయాలు మారుతున్నాయి. ప్రథమ పంచవర్ష ప్రణాళికలోనూ,2nd Draft Five Year Planలోనుfinal FiveYear Planలోనూ వారి అభిప్రాయాలేయివి.మొదటfamily holding అన్నారు.తరువాతfinal report లో వ్యక్తిగతంగా. తీసుకొవాలని చెపుతున్నారు. ఇంతకుముందు family holding define చేశారు,ఇప్పుడు define చేయలేదు. ఈ విధంగా మారుతున్నాయి. కాబట్టి మనంతొందరపడి ప్రయోజనంలేదు. ఈ సంవత్సరం tenancy వచ్చినట్లయితే వచ్చే సంవత్సరం ceiling పెట్టుకోవచ్చు, ఆమరుసటి సంవత్సరం fairrent అమలు చేసుకోవచ్చు. ఈవిధంగామనం సావకాశంగా ఆలోచించి చేసుకోవాలి, గాని భూసంస్కరణలు, వెంటనే కావాలని తొందరపడితే ప్రయోజనంలేదు.

ఇప్పుడు Bihar లోనూ, U. P. లోనూ, Saurastra లోనూ ఎందుకు అమలు జరుగలేదు. ఇదంతా కూడా మనమంతా ఆలోచించాలి. గోపాలరెడ్డి గారు, చంద్రమౌళి గారు, వెంకట్రావు గారు మున్నగు మంత్రులు భూస్వాముల తరపున వున్నారను కోవడం పొరపాటు. భూసంస్కరణలు కావాలని మేమూకోరుతున్నాం. కాని దీంట్లో జటిలమైన సమస్యలున్నాయి, వీటన్నింటినీ మనం జాగ్రతగా ఆలోచించి చేయవలసి వుంది.

**Sri A. VENKATARAMA R JU:** —ఇప్పుడు మనం హైదరాబాదు వెడితే వారికి మనకూ ఎట్లా కుదురుతుంది?

The Hon Dr. B. GOPALA REDDI:- Prohibition విషయంలో ఎట్లా కుదురుతుందో ఇదికూడా అట్లాగే కుదురుతుంది. ఏమీ ఫరవాలేదు. హైదరాబాదు విషయం చూసి మనమేమీ భయపడనక్కర లేదు. అన్నిసమస్యలు పరిష్కారం చేసుకోవచ్చు. ఈ లోపల Congress High Command వారు, Congress Working Committee వారు, Planning Commission వారు, కేంద్ర ప్రభుత్వంవారు దీనిని గురించి ఆలోచిస్తూనే ఉన్నారు. వారి అభిప్రాయాలు తర్వలోనే ఒక స్థిరరూపం చెందుతా యనుకుంటున్నాము. మనం తొందరపడి ఏమీ చేసుకోనక్కర లేదు. This is a part of a bigger programme, ceilings on national wealth, total wealthఅని Planning Commissionవారు చెపుతూనే ఉన్నారు. ఈ విషయం వెంకటేశ్వర్లు గారు మర్చిపోతూ ఉంటారు. Total income మీదే ceiling పెట్టమని Planning Committee వారు అంటూంటే ఒక భూమి మీదే ceiling పెట్టమని కొంతమంది సభ్యులు ఎందుకంటున్నారో నాకు అర్థంకావడం లేదు. (Interruption) ఆకలి బాధతో బొంబాయిలోనూ, కాన్పూరులోనూ, మద్రాసులోనూ అనేకమంది బాధపడుతుంటారు. హెచ్చుజీతాలుగల ప్రభుత్వోద్యోగస్థుల జీతాలను తగ్గించాలని ఒక non-official తీర్మానంవస్తే జవహర్లాల్ నెహ్రూ గారు oppose చేశారు. కొంతమంది Secretaries కు 4,000 రూపాయలు జీతం వస్తుంది, అవి తగ్గించడానికి నెహ్రూగారు అంగీకరించలేదు. అంతజీతం ఆ ఉద్యోగస్థులకు ఉండాలనిచెప్పారు. అంత మాత్రాన వారు ప్రజలకష్ట సుఖాలను చూచుట లేదనడం న్యాయంకాదు. ఈ సమస్యలన్నీ మనం నిదానంగా, ఉదారంగా సమీక్షించుకోవాలి. దానికి మీరంతా అతి వాదులు, మేము మితవాదులం అని అనుకోనక్కరలేదు, అందరూ కూడా దేశ భక్తులే. అందరూ కూడా దేశాభివృద్ధికి కృషి చేస్తున్న వారమే. ఈ విషయంలో ప్రభుత్వానికి ఆక్షేపణలేదు. కాని మన Constitutionలో "you can't take any Property without Compensation" అనివుంది. Compensation తప్పకుండా ఇవ్వాలి. ఇదిఎక్కడనుంచి తీసుకురావాలి? ఎట్లా ఇవ్వాలి అనేవిషయాలు ఆలోచించు కోవాలి. ముందుగా instalments మీద ఈ tenancy అమలు చేద్దాము.తరువాత ceiling, agricultural labour, consolidation of holdings మున్నగున వన్నీ చేసుకుందాము.

మనం 4 నెలలతరువాత ఇప్పుడు మళ్ళీ సమావేశమయినాము. అనేకమంది సభ్యులు వారి వారి స్థానిక విషయములు కొన్ని చెప్పారు. దేశంలోని ఈ నాటి పరిస్థితులను గురించి కూడా కొంతమంది చెప్పారు. ఇప్పుడు దేశంలో కొంత ఉద్రేకమైన

వాతావరణం. కొంతశాంతియుత వాతావరణం ఉన్నాయి. గుజరాతులోనూ, మహా రాష్ట్రలోనూ కొంత అల్లరులు జరుగుతున్నాయి. దేశంలో పరిస్థితి అనేక రకాలుగా వుంది. దేశానికి ఉపయోగ పడేటట్లుగా ఈ బిల్లు నిన్ననే pass అయినది. దీని వల్ల శాంతి యేర్పడి, దేశంపురోభి వృద్ధిచెందగలదని ఆశిస్తున్నాము. ఇంతకుముందు మనకు ఏక భాషారాష్ట్రం అనే నినాదంవుండేది. ఇప్పుడు ద్విభాషారాష్ట్రమైనా భంటా లేదు. అదిదేశానికి ఒకవిధమైన బలమని మనకంటే అనుభవజ్ఞులైన, పెద్దలయిన లోక సభవారు నిర్ణయించారు. ఏకభాషారాష్ట్రమే కావాలి. ద్విభాషారాష్ట్రం ఉండ కూడదని మనం తీర్పు ఇవ్వనక్కరలేదు. ద్విభాషారాష్ట్రం ఎట్లా ఉంటుందో మనం expermental గా చూడబోతున్నము. అన్నిటి కన్నా ముఖ్యవిషయం ఒకటి చెబుతున్నాను.

మనరాష్ట్రానికి 6 కోట్ల రు॥లు అప్పుకావాలి నేను budget speech లోనే ఈ విషయం చెప్పినాను. కేంద్ర ప్రభుత్వం వారి ఔదార్యంమీద ఆధారపడి 11.12 కోట్ల సంపాదించు కోవాలని చెప్పాను. ఈ 6 కోట్ల రు॥లు అప్పుకోసం మన మంతా కూడా కృషిచేయాలి. సెప్టెంబరు 3వ తేదినుంచి 10వ తేదివరకు తీసు కుంటాము. 4% వడ్డీ కూడా వుంటుంది.

పెల్లలమర్రి వెంకటేశ్వర్లుగారితో కూడా చెప్పినాను. మీరంతా మీమీ నియో జక వర్గాలలోని ప్రజలకుచెప్పి కృషిచేయాలని కోరుతున్నాను. ఇదివరకెప్పుడూ ఇట్లా చేసినట్లు నాకుగుర్తు లేదు. ఈ సంవత్సరం ప్రప్రథమంగా ఈ పనిని జయ ప్రదం అయ్యేటట్లు చేస్తారని ఆశిస్తున్నాను. సభ్యులందరికీ నమస్కారములు.

Sri D. KONDAIAH CHOWDARY :- ఈ ప్రాజెక్టులను గురించి ప్రజల సంశయాలను తొలగించవలసినదిగా మనవి చేస్తున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI :- నందికొండ, కొల్లేరు ప్రాజెక్టుల విషయం మనం తరువాత చూచుకుందాము.

Sri D. KONDAIAH CHOWDARY :- నందికొండ కుడికాల్వకు 7 వేల క్యూసెక్కుల నీరు మాత్రమే పరిమితం చేస్తారనే భయం వుంది. దాన్ని గురించి కమ్యూనిష్టుపార్టీవారు తీవ్రమైన ప్రచారం చేశారు. దానివిషయం ప్రకటిస్తా మన్నారు. అందుచేత చెప్పమని అడుగుతున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI :-- నాకు పూర్తి వివరములు తెలియక పోయినప్పటికీ ఒక విషయం చెబుతాను. 7 వేలక్యూసెక్కులయినా, 14 వేల క్యూసెక్కులయినా నెల్లూరు జిల్లాకు ఎంత రావాలని మొదట నిర్ణయించారో అంతవరకు తప్పకుండా వస్తుంది. 7 వేలా 14 వేలా అనే విషయం మీకెందుకు ? మొదట నిర్ణయంచేసిన ప్రకారం తప్పకుండా వస్తుంది. ఈ విషయంలో ఎవ్వరికీ ఎట్లాంటి భయమూ అక్కరలేదు. గౌరవనీయ సభ్యులకు నమస్కారములు తెలియ జేస్తూ ఈ బిల్లు మీద amendremsts ఉప సంహరించు కోవాలని ప్రార్థిస్తున్నాను.

Sri P. NARSIMHAPPA RAO :-- నేను నిన్న Prohibition ను గురించి మాట్లాడాను. ఇతరదేశాలలోని Motor transport ను గురించి మంత్రి గారుచెప్పారు.Prohibiti on ను గురించి ఇతర దేశాలు కూడా కొన్ని సంవత్సరాలు ప్రయత్నించాయి. అమెరికా కూడాప్రయత్నిం చింది. కాని ఆప్రయత్నం విఫలమ యింది. దాని వల్ల కొంతడబ్బు వస్తుంది. ఇక్కడ కూడా ఎందుకు పెట్టకూడదు ?

The Hon. Dr. B. GOPALA REDDI :-- అదిమన Constituion కు పూర్తిగా వ్యతిరేకం. Directive Principles లో Prohibition పెట్టా లనివుంది. మద్రాసులో పెట్టారు. అమలులోవుంది దానిని జయప్రదం అయ్యేటట్లు చూచుకోవాలి. దానిని ఉపసంహరించు కోవాలనడం Constituion కు వ్యతిరేకం అవుతుంది,

MR. SPEAKER:- I shall now put the amendments to the vote of the House.

Amendments 1, 2, 3, 4, 5, 6, 7, 8 were by leave of the House withdrawn.

Amendments 9, 10, 11, 12, 13, 14, 15 were put to vote and lost.

Amendment 16 was put to vote and declared lost. Poll was demanded. *Ayes* 14, *Noes* a very large number. The amendment was lost.

Amendments 17, 18, 19, 20, 21 were put to vote and lost.

Amendments 22, 23, 24, 25, 26, 27, 28, 29, 30, 31, 32, 33, 34, 35, 36, 37, 38, 39, 40, 41, 42, 43, 44, 45, 46, 47, 48 and 49 were put to vote and lost.

Amendments 50 to 60 were withdrawn by leave of the House.

Amendment 95 was put to vote and declared lost. A poll was demanded.

*Ayes* 12, and *Noes* a great many. The motion was lost.

Amendments 96 to 106 were put to vote and lost.

Amendment 107 was put to vote and lost. A poll was demanded. *Ayes* 14, and *Noes* 119. The motion was lost.

Mr. SPEAKER: I shall now put the main motion to the vote of the House. The question is:

'That an humble Address be presented to the Governor as follows:-

"That the Members of the Andhra Legislative Assembly assembled in this session are deeply grateful to the Governor for the Address which he has been pleased to deliver to this House on 8th August, 1956".

The motion was carried amidst cheers.

Mr. SPEAKER: The House will now adjourn and meet at 8-30 a.m. on Monday, the 13th August 1956.

The House then adjourned.

---